




ముఖచిత్రం ఉగాది వేగంట

చిత్రకారుడు వడ్డాది పాపయ్య


యువ సాలుచందా రూ 36-00

దీపావళి సంచికతో రూ. 42-00

యువ, హైదరాబాదు-500001







ఈ నెల (మార్చి) యువ ముఖచిత్రం చాలా ఆకర్షణీయంగా ఉంది. మల్లాది వెంకట కృష్ణమూర్తిగారి "మందు", మల్లిక్‌గారి "నిజం" కథలు చాలా గమ్మత్తుగా ఉన్నాయి. "ప్రతిమలు", "మనసులు చేసుకున్న పెళ్ళి" అనే కథలు కూడా చాలా బాగున్నాయి.

పాఠకులకు మంచి వినోద, విజ్ఞాన వికాసాలను అందించే పత్రిక "యువ" అని అనటంలో ఏమాత్రం సందేహం లేదు.

—కొలనుపాక విజయవర్ధన్‌రావు,
నల్గొండ.

వడ్డాది కుంచెనుంచి వెలువడిన మార్చి నెల "వాసంతి" ముఖచిత్రం నయనానందకరంగా ఉంది. శ్రీ రా. కాఫీ క్లబ్ సినిమా ముగింపు చాలా బాగుంది. "ప్రతిమలు", "మందు", "నిజం", "ఓ కుర్రాడు'' కథలు పసందుగా ఉన్నాయి. రాగతి పండరిగారి జోకులు చదువుతుండే కడుపుబ్బ నవ్వుకున్నాం. రాబోయే "ఉగాది" సంచికకై నిరీక్షిస్తూ...

—సంకేపల్లి నాగేంద్రశర్మ,
వేములవాడ.

మార్చి నెల సంచికలో నారాయణ గారి, "ధేనుక" నవల చైతన్యవంత ముగా ఉన్నది. సనాతనాచారముల వంకతో, వేడుకతో నిండవలసిన ఖావి జీవితము వేదనతో పండిపోయిన జానకి వంటి సీడలేని అబలలను నిలువుదోపిడి చేసి, నిర్మల, ముసలాయనవంటి బంధువు లనబడెడి రాబందుల మృగ తృష్ణను ఈ నవలలో చక్కగా చిత్రిం చారు. శ్రీమతి వి. రతన్‌ప్రసాద్‌గారి, "ప్రతిమలు" కథ చక్కగా ఉంది "శ్రీ రాజేశ్వరీ విలాస్ కాఫీ క్లబ్" మంచి రిలీఫ్ నిచ్చింది. "మందు" మినీ కథ పిచ్చివాని పాత్రతో చక్కని హాస్యాన్ని చిందించింది. మల్లిక్‌గారి "నిజం" కథ "స్త్రీ బుద్ధి ప్రళయాంతకః" అన్న సామెత "నిజం" అని విమలపాత్రద్వారా నిరూపించింది. సీరియల్స్‌లో, 'చక్రపాణి'' మిక్కిలి యింటరెస్టింగ్‌గా సాగుతోంది.

వి. మార్కు రిజరెక్టర్-కాకినాడ.

మార్చి నెలలో ప్రచురించిన ''ఆ కుర్రాడు'' కథను అనువదించినది శ్రీమతి 'శర్వాణి' అని గమనించ ప్రార్థన

చూచి ఆనందించండి!



శ్రీ రాజేశ్వరీ విలాస్ కాఫీక్లబ్

ఈస్ట్మన్ కలర్





నిర్మాతలు:
నాగిరెడ్డి·చక్రపాణి

సంచాలకుడు:
చక్రపాణి

సహకారం:
బాపు

విజయా రిలీజ్
VIJAYA

గోద్రెజ్ నుంచి

# క్రొత్త టర్కిష్ బాత్




## ఒక ఉన్నతమైన సబ్బు నమ్మలేని ధరలో కేవలం

# Re. 1·00 (పన్నులు అదనం)

గోద్రెజ్ వారు మాత్రమే మీకు అంత తక్కువ ధరలో ఎక్కువ నురుగు నిచ్చే...ఎక్కువ నిలువ ఉండే... తాజాదనము నిచ్చె సువాసనతో ఉండే సబ్బును అంద చేయగలరు.

**గోద్రెజ్ వారి టర్కిష్ బాత్**

Interpub/GTB/1/75/TEL

ఏప్రెల్ నెల

# భావపరిచయపోటీ

(బహుమతి పొందిన వ్యాఖ్య)



నటనలో సహజత్వం
నటునికి ప్రాణ సంకటం

—పుల్లకూర సుబ్రమణ్యం, కదిరి

సచిత్ర మాసపత్రిక

సంస్థాపకులు : చక్రపాణి

సంపుటి 33 | ఏప్రెల్, 1976 | సంచిక 4

తిరుపతికొండమీద వేంకటేశ్వరుడు ఎప్పుడు వెలిశాడో, లేక వేంకటేశ్వర ప్రతిష్ఠ ఎప్పుడు జరిగిందో ఎవరూ చెప్పకుండా వున్నారు. ఏమయినా, ఆ క్షేత్రం పదిహేను వందల సంవత్సరాలకు తక్కువకాని చరిత్ర గలది. ఇక, అక్కడి దేవుడూ? తెలుగువారి ఇలవేల్పు ఆసేతుహిమాచల భారత భూమిలోని హిందువులందరికీ యిష్టదైవం. ఉత్తర హిందూదేశీయులు బాలాజీ అనీ, తెలుగువారు ఏడుకొండలవాడనీ, తమిళులు వెంగడాచలపతి అనీ, యీ దేవుణ్ణి ముద్దుగా పిలుచుకుంటారు.

వేంకటేశ్వరుడు వెలిసిన తిరుపతికొండమీద ప్రతిరోజూ పర్వదినమే. ఒకొక్కరోజున యాభై, అరవై వేలమంది భక్తులు కొండకు వస్తారు. ఏనాడూ పదివేలకు తక్కువ వుండరు. ఎన్నిరోజుల ప్రయాణమైనా, ఎంత ప్రయాసతోకూడిన ప్రయాణమైనా ఓర్చి, భక్తులు యీ కొండకు వచ్చి, దేవునిదర్శనం అరనిమిషంమాత్రమే అయినా, పరవశత్వంపొంది వెడుతున్నారు. తమ శక్తికొలదీ, భక్తికొలదీ కానుకలను సమర్పించి వెడుతున్నారు. స్వామి డబ్బిలోపడే నగలు, డబ్బు ఏడాదికి దాదాపు అయిదు

కోట్ల రూపాయల విలువలో వుంటున్నవి ముడుపులుకాక, దర్శనానికి సేవలకు భక్తులు కట్టే రుసుములుకూడా సుమారు ఒకకోటి రూపాయల వరకూ వుంటాయి

ఏ దేవుడైనా, దేవునికి వచ్చే ఆదాయాన్ని ఆయనే స్వహస్తాలతో స్వీకరించడు కనుకనూ, ఆయనే తన పరివారానికి జీతాలు యివ్వడు కనుకనూ, ఆయనే తన భక్తులకు తన ప్రాంగణంలో వసతులను ఏర్పాటు చెయ్యడు కనుకనూ, ప్రతి దేవాలయానికీ ధర్మకర్తలు ఏర్పడినారు. ఒకప్పుడు తిరుపతి దేవాలయానికి హత్తీరాం బావాజీ మఠాధిపతి అయిన మహంతు ధర్మకర్తగా వుండేవాడు. ఆ మహంతు పరిపాలన సక్రమంగా లేదని, ప్రభుత్వం ఒక శాసనంద్వారా ధర్మకర్తల బోర్డును నియమించింది. ఈ బోర్డు మూడేళ్ళకొకసారి ఏర్పాటు అవుతూ వుంటుంది ఇలాటి బోర్డులు సుమారు నలభై సంవత్సరాలుగా పనిచేస్తున్నాయి. అప్పటికీ యిప్పటికీ తిరుపతికొండమీద, తైర్థికులకు వసతులు ఎక్కువగానే ఏర్పాటయినవి. అయితే, వసతులు ఎక్కువైనకొద్దీ, కొండకు వచ్చే తైర్థికుల సంఖ్యకూడా చాలా ఎక్కువైంది. 1986 లో కొండకు వెళ్ళినవారు పదినిముషాలపాటు స్వామిదర్శనాన్ని చేసుకోగలిగేవారు. ఈనాడు యీ దర్శనభాగ్యం, అరనిముషమే స్వామి మూలవిరాట్ ముందునుంచి నడుస్తూ ఒకసారి స్వామిని చూడవలసిందే. నిలబడడానికి వీలులేదు. అంతటితోనే తృప్తిపడి భక్తులు బైటకు వస్తున్నారు. అలాటి భక్తులకు కొండమీద సదుపాయాలు ఇంకా కొంత మెరుగుగా వుండాలి. భోజన సదుపాయం ఇప్పటికంటే బాగా వుండేటట్టు చూడవలసిన అవసరం ఎంతేనా వుంది. కొండమీది కుటీరాల అద్దె యీమధ్య చాలా ఎక్కువచేయడం జరిగింది. ఆ అద్దెను తగ్గించాలి స్వామికి వచ్చిన డబ్బుతో యితర పట్టణాలలోనూ, ఇతర దేశాలలోనూ ఆఫీసులు నిర్వహించడం పెద్ద అవసరమేమీకాదు. వేంకటేశ్వరస్వామి మహిమను ఆఫీసులద్వారా ప్రచారం చెయ్యవలసిన అవసరంలేదు కాని, కొండకువచ్చి కోట్లరూపాయలను సమర్పిస్తున్న తైర్థికులకు యిచ్చే వసతికీ, ప్రసాదాలకూ ధరలను పెంచడంమాత్రం న్యాయంకాదు.

ఈమధ్య, అమెరికాలో ఒక వేంకటేశ్వర దేవాలయ నిర్మాణం జరిగి నట్టున్నది. ఆ ఆలయానికి, వేంకటేశ్వరస్వామి విగ్రహాన్ని, తిరుపతి

దేవస్థానంవారు తయారుచేయించి పంపించారట. అంతవరకు ఫరవాలేదు. కాని, అమెరికాలో ప్రతిష్ఠించబడిన స్వామివిగ్రహం, తిరుపతి మూలవిరాట్ కాదు, ఉత్సవ విగ్రహంకాదు తిరుపతిలోని స్వామి అంశకాదు. అచ్చటి దేవాలయం, తిరుపతి దేవాలయానికి బ్రాంచికాదు అయినా, తిరుపతి దేవస్థానంలోని పెద్దలు కొందరు ఆ ప్రతిష్ఠాపన సమయానికి అమెరికా వెళ్ళారు తమ సొంత ఖర్చుతో వెడితే ఫరవాలేదు కాని, దేవస్థానం ఖర్చు మీద వెళ్ళివున్నట్లయితేమాత్రం, తిరుపతి దేవునికి ముడుపులు చెల్లించిన భక్తులకు అన్యాయం చేసినట్లే

మనదేశంలోనే ఎన్నో ఆలయాలను ఉద్ధరించవలసి వున్నది. అంతదాకా ఎందుకు, తిరుపతి దేవుని పత్నిఅయిన పద్మావతీదేవి ఆలయం విషయంలోనే దేవస్థానంవారు కొంచెం ఎక్కువశ్రద్ధ తీసుకోవలసి వున్నది. అమ్మవారి గుడి చుట్టూ ప్రదక్షిణం చెయ్యాలంటే, ఎండాకాలంలో కాళ్లు బొబ్బలు పొక్కుతున్నాయి, వానాకాలంలో వొళ్ళు తడిముద్ద అవుతున్నది. ప్రదక్షిణమార్గం పైన కప్పువేయించినట్లయితే, భక్తులు పడే అవస్త కొంచెం తగ్గుతుంది తిరుచానూరులో ఇప్పుడున్న దానికన్న పెద్ద కళ్యాణమండపమూ, మంచి కాంటీను పెట్టించడం అవసరం.

తిరుపతిలో స్వామిదర్శనాన్ని ముగించుకొని తిరుచానూరు వచ్చేభక్తులకు తిరుపతినుంచి తిరుచానూరువరకూ, ఒక మాదిరి రోడ్డు సదుపాయం వుంది. కాని, తిరుచానూరునుంచి తిరిగి వెళ్ళడానికి మళ్ళీ తిరుపతి రావలసిందే. తిరుచానూరును, రేణిగుంటరోడ్డుతో కలిపేబాట ఒకటి వున్నది ఈ బాట మీద వెడితే రేణిగుంట వెళ్ళేవారికి సుమారు నాలుగుమైళ్ళ ప్రయాణం తగ్గుతుంది కాని, ఈ బాటమీద వేసిన కంకరమీద కాలినడక దుర్భరం. కార్లు ముందుకు సాగలేవు ఈ బాటను బాగుచేయించి, మంచి తారు రోడ్డును వేయించడానికి దేవస్థానంవారు ఎందుకు పూనుకోకూడదు? ఈ రోడ్డువల్ల, ఢిల్లీలోను, మద్రాసులోను, ఇంకా ఇతర చోట్లలోనువున్న దేవస్థానం ఆఫీసులకన్న ఎక్కువ ప్రయోజనం భక్తులకు కలుగుతుంది ఆ రోడ్డు జిల్లా పరిషత్తువారిది, దేవస్థానం ఏంచెయ్యగలదు అనే ప్రశ్న రావచ్చును. చక్కని రోడ్డును నిర్మించి, ఆ రోడ్డును జిల్లాపరిషత్తుకే అప్ప

గి_స్తే నష్టం ఏమిటి ? ఆ రోడ్డుకు మరమతు చెయ్యవలసినప్పుడు ఆ ఖర్చును దేవస్థానమే భరి_స్తే వచ్చే నష్టం ఏమిటి? తిరుపతి యాత్రికులకుతప్ప మరెవరికీ ఆ రోడ్డు పనికిరాదు. అంచేత, యాత్రికుల సౌకర్యంకోసం, యాత్రికులే సమర్పించే డబ్బులో కొంత, యీ సత్కార్యానికి వినియోగించకూడదని ఎవరూ అభ్యంతరం చెప్పరు పైగా, ఎంత అయినా యీ రోడ్డుకు అయ్యే ఖర్చు తిరుపతిస్వామికి ఒకరోజు వచ్చేముడుపులో సగంకూడా కాదు. ఇలాటి ఏర్పాట్లు చెయ్యడంవల్ల తిరుపతిదేవస్థానంవారు యాత్రికుల కృతజ్ఞతను పొందుతారేకాని నిందకు లోనవరు

తిరుపతి నగర పారిశుద్ధ్యం విషయంలోనూ, రోడ్లమీద ఆక్రమణలను తొలగించడంలోనూ కూడా దేవస్థానంవారు కొంతశ్రద్ధ చూపవచ్చును. అతి పురాతనమైన యీ పట్టణంలోని వీధులవెడల్పును పెంచడం కష్టంకావచ్చును కాని వున్న వెడల్పు తగ్గకుండా చూడడం కష్టంకాదు

ఇలాగే ఆలోచి_స్తే, యాత్రికుల సౌకర్యంకోసం చేయవలసిన ఏర్పాట్లు ఎన్నో కనపడుతవి. దేవస్థానంవారు ఈ విషయంలో మరింత శ్రద్ధ చూప గలరని ఆశిస్తున్నాము

---

మే నెల

# యువ
# భావపరిచయ పోటీ

బహుమానం రూ. 15-00



ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య (Caption) కావాలి.

గమనిక : వ్యాఖ్యలు పోస్టుకార్డుమీదనే వ్రాయాలి.



దానిని ఒకవిధంగా పట్టణం అనే అనవచ్చును. ఎందుకంటే... ఆ ఊరిలో రెండు కాలేజీలు, మూడు ఫాక్టరీలు, పది వరకూ సినిమా హాళ్లూ, రెండు మూడు పబ్లిక్ పార్కులూ, పెద్ద పెద్ద హోటళ్లూ, చిన్న చిన్న బార్లూ ఇంకా పట్టణానికి ఉండాల్సిన సర్వ హంగులూ ఉన్నాయి

చీకటి చిక్కగా పరుచుకుంది నాలుగు వైపులా అయితేమాత్రం మాకేం భయం అంటూ అన్ని వీధుల్లో వెలుగుతున్న వీధిలైట్లు విర్రవీగుతున్నాయి వీధిలో అంతగా జనసంచారం లేకపోయినా ఫరవాలేదు మేమున్నాం అన్నట్లు పెద్దగా రొదచేస్తూ, లారీలూ, ఊర్ల బస్సులూ తెగ తిరుగుతున్నాయి భావకవి మదిలో మెదిలే అందమైన ఆలోచనల్లా చెట్ల ఆకులు వెన్నెల్లో పిల్లగాలికి మెల్లగా కదులుతున్నాయి వీధి దీపం ఒకటి వెలుగుదామా వద్దా అన్నట్లు ఇంకొద్ది క్షణాల్లో పోయే ప్రాణంలా రెపరెప లాడుతుంది ఎవరిదో ఆల్సేషన్ కుక్క అప్పుడప్పుడూ భౌ(య్ మని మొరుగుతుంది ఎక్కడినుండో రేడియోలో


అదృష్టం
మల్లిక్
"అయ్యయ్యో బ్రహ్మయ్యా...
అన్యాయం చేశావేమయ్యా...
ఈ బుల్లోడే బుల్లెమ్మైతే ,
ఎంత గుమ్ముగా ఉండేదయ్యా... య్యా... య్యా"
అంటూ తెలుగు సినిమా పాట లీలగా వినిపిస్తుంది

ప్రసన్న కుమార్ చదువుతున్న కెమిస్ట్రీ పుస్తకం ప్రక్కనబెట్టి బద్ధకంగా ఒళ్లు విరుచుకున్నాడు గోడ గడియారంవంక చూశాడు.

ఏడు గంటల యిరవై నిముషాలైంది!

ఒకసారి మండుతున్న కనులు మూసుకుని అరచేతులతో మెల్లగా కను రెప్పలమీద వత్తుతూ కూర్చున్నాడు. అలా కాస్సేపు చేసి రెప్పలు అల్లల్లాడించి భారంగా ఉన్న తలను విదిలించాడు.

ప్రసన్నకు యింకొక వారంరోజులలో పి. యు. సి పరీక్షలున్నాయి ఇప్పుడ తనికి పరీక్షల ముందు నెల రోజులు 'ప్రపరేషన్ హాలిడేస్' ఇచ్చారు

పి. యు సి. లో తప్పకుండా ఫస్టు కాసు తెచ్చుకోవాలని ప్రసన్న పట్టు దల దానికి కావలసిన కృషి కూడా అతను చేస్తున్నాడాయె.

ప్రసన్న లేచి నిలుచుని మళ్ళీ ఒకసారి బద్ధకంగా ఒళ్లు విరుచుకున్నాడు. గోడకి తగిలించి ఉన్న అద్దంలో ఒకసారి తన ముఖం చూసుకున్నాడు మూడు వారాలనుండి రాత్రింబగళ్లు కష్టపడి చదువుతున్నందు మూలంగా ముఖం కాస్త పీక్కుపోయింది. కళ్లు ఎర్రగా ఉన్నాయి

నుదుటిమీద పడ్డ వెంట్రుకలను ఎడమచేత్తో వెనక్కి తోసుకున్నాడు అప్రయత్నంగా అతని కుడిచేయి గడ్డం క్రింద తడిమింది నున్నగా, మెత్తగా గడ్డం అతని చేతికి తగిలింది

గోడకున్న మేకునుండి అద్దాన్ని బయటకి తీశాడు తన ముఖం దగ్గరగా పెట్టుకుని అద్దంలోకి పరీక్షగా చూశాడు అతని గడ్డం నున్నగా మెత్తని చర్మంతో పలుచగా ఉంది మళ్లీ ఒకసారి గడ్డాన్ని చేత్తో తడుముకున్నాడు తన మూతి మీదకు దృష్టిని సారించాడు. నడినెత్తిన లైటు ఉండటంచేత ముక్కు క్రింద నీడ పడింది.

తలని కాస్త పైకెత్తి ముక్కు క్రిందిభాగంమీద వెలుతురు పడేలా పెట్టి అద్దంలో మళ్ళీ చూసుకున్నాడు, అతని మూతిమీద చిన్న చిన్న వెంట్రుకలు వస్తున్నాయి ఎంతో పరీక్షగా చూస్తేగాని ఆ వెంట్రుకలు కనబడవు.

కుడిచేత్తో అద్దాన్ని పట్టుకుని ఎడమచేత్తో తృప్తిగా తన నూనూగు మీసాలను తడుముకున్నాడు ఆవి అతని చేతికి అంటీ అంటనట్లు తగిలాయి

ఫరవాలేదు... తను భయపడాల్సిన అవసరంలేదు అనుకున్నాడు మనసు

లోనే ఈసారి అద్దాన్ని కాస్త దూరంగా పెట్టి తన అందమైన ముఖాన్ని చూసుకుని మురిసిపోయాడు.

రాఘవయ్య సుందరమ్మలకు ప్రసన్న, మాధవి- వీళ్ళిద్దరే సంతానం. రాఘవయ్య ఒక ప్రభుత్వ కార్యాలయంలో అప్పర్ డివిజన్ క్లర్కుగా పని చేస్తున్నాడు.

రాఘవయ్యకు ఒక చెల్లెలు కూడా ఉంది ఆమె పేరు జానకి

కొన్నాళ్ళ కష్టాలను భరించిన తరువాత అతనికి ఉద్యోగం దొరికింది కాని కొడుకు సంపాదించి పెడుతుంటే తిని సంతోషించే భాగ్యం అతని తల్లికి ఎక్కువ కాలం లేకపోయింది. రాఘవయ్యకు ఉద్యోగం వచ్చిన రెండు మూడు నెలలకే ఆమె జబ్బుతో మరణించింది తల్లి మరణం రాఘవయ్యను చాలా క్రుంగ దీసింది రాఘవయ్య తన తండ్రిని ఎరగడు చిన్నప్పుడే తండ్రిని కోల్పోయాడు. తనకు ఊహ తెలిసినప్పటినుంచి తన తల్లే అతనికి సర్వస్వం అయి పెంచింది అందుచేత ఆమె మరణంతో అతను మానసికంగా చాలా క్రుంగిపోయాడు.

భార్య సుందరమ్మ ప్రేమానురాగాలవల్ల రాఘవయ్య నెమ్మదినెమ్మదిగా కోలుకున్నాడు.

పెళ్ళయిన నాలుగేళ్ళకి ప్రసన్న కుమార్ పుట్టాడు. అప్పుడు ఆ దంపతుల ఆనందానికి హద్దులేలేవు

ప్రసన్న కుమార్ చిన్నప్పుడు బొద్దుగా, ఎర్రగా చాలా అందంగా ఉండేవాడు. పెద్దయేకొద్దీ సన్నగా నాజూకుగా తయారయ్యాడు.

ప్రసన్న అవటానికి మగపిల్లవాడే గానీ వాడికి అన్నీ ఆడ లక్షణాలే!... చిన్నప్పుడు ఎక్కువగా ఆడపిల్లలతోనే ఏ తొక్కుడు బిళ్ళో, గచ్చకాయలో ఆడుకుంటుండేవాడు. పెద్దవుతున్నకొద్దీ మగ స్నేహితులు ఏడిపించడంవల్లనైతేనేమి, ఆడపిల్లలే వీడితో ఆడటం మానివేయడం వల్లనైతేనేమి ఆడపిల్లలతో ప్రసన్న స్నేహం కొద్దిగా తగ్గింది ప్రసన్న ఎక్కువగా సిగ్గుపడతాడు ఆడపిల్లలు కూడా అంత యిదిగా సిగ్గుపడరు ఎవరైనా క్రొత్తవాళ్ల దగ్గరైతే అసలు నోరు మెదపడు ప్రసన్న తొలి యవ్వనదశలో ప్రవేశించి అతనికి ఆడ మగ తేడా తెలిసిన తరువాత అతనిలో సిగ్గుపడే గుణం మరింత ఎక్కువైంది. రోడ్డుమీద తల వంచుకునే వెళ్లేవాడు. ఎవరైనా అమ్మాయి ఎదురు పడిందంటే అతని తల మరింత క్రిందికి ఒరిగిపోయేది.

ఒకసారి స్కూలు ఫైనలు చదువుతున్నప్పుడు తెలుగు మాస్టారు, వరూధినిని వర్ణిస్తూ మధ్యలో ఆగి ప్రసన్న వంక చూసి,

"అంతెందుకూ... వరూధిని అచ్చు మన ప్రసన్నగాడిలా ఉంటుంది" అన్నారు.

క్లాసులోని మగపిల్లలంతా ఘొల్లుమని నవ్వారు. ఆడపిల్లలు ముసిముసిగా నవ్వుతూ ప్రసన్న వైపు కోర చూపులు చూశారు. ప్రసన్న ముఖం ఎర్రగా కందిపోయింది.

మరోసారి హఠాత్తుగా సైన్సు మాస్టారు ప్రసన్న చేయి పట్టుకుని ఆపి

"నువ్వు చాల అందంగా ఉంటావోయ్" అంటూ చుట్టుప్రక్కల ఒకసారి చూసి గట్టిగా బుగ్గమీద ముద్దుపెట్టుకుని వదిలేశారు.

అప్పుడు ప్రసన్నకి ఆడో మాదిరిగా అనిపించింది. అయినా మాస్టారికి భయపడి నోరు మూసుకుని ఎవరైనా చూశారేమోనని సిగ్గుపడుతూ గబగబ పరుగులాంటి నడకతో యిల్లు చేరుకున్నాడు.

ప్రసన్న మంచి మార్కులతో స్కూలు ఫైనలు పాసయ్యాడు. కాలేజీలో చేరిన తరువాత తోటి విద్యార్థుల అల్లరి మరింత భరించరానిదైంది అతనికి. ఒక్కొక్కడూ ఒక్కోవిధంగా రిమార్కు విసిరేవాడు.

"ఒరేయ్ ప్రసన్నా... నువ్వు ఆడదానివైతే ఎంతో బావుండేదిరా... అప్పుడు మన కాలేజీ బ్యూటివి నువ్వే."

"వీడి గొంతు చాల తీయగా ఉంటుందిరా అమ్మాయి గొంతులా"

"నువ్వు ఆడదానివైతే మా అమ్మా నాన్నలతో దెబ్బలాడైనా సరే... నిన్నే పెళ్ళిచేసుకునుండేవాడిని."

"వీడికి మీసాలవీ ఎప్పుడొస్తాయిరా ?"

"మన ప్రసన్న ఆడదానికంటే ఎక్కువగా సిగ్గుపడతాడురా."

"వీడు సిగ్గుపడితే ఆ అందం ముందు ప్రబంధ నాయికలు కూడా దిగదుడుపే."

ఇలా కాలేజీలో అందరూ కామెంట్స్ చేసేవారే... ఆఖరుకి విద్యార్థినులు కూడా ఇతను తల వంచుకుని వెళ్తుంటే వినబడీ వినబడనట్లు

"ప్రవరాఖ్యుడే..." అంటూ ఏమేమో కామెంట్స్ విసిరేవారు

ఒక్క చలపతి మాత్రం ప్రసన్నను ఏమీ అనేవాడు కాదు. అందుకనే ప్రసన్నకి చలపతంటే యిష్టం.

చలపతి చిన్నప్పటినుండి ప్రసన్నకి ఏకైక మిత్రుడు ప్రసన్న యింటిం రెండిళ్లు అవతల ఉంటాడు. ఇద్దరూ కలిసి స్కూలుకి వెళ్లేవారు. క్లాసులో కూడ ఒకే బెంచిమీద కూర్చునేవారు

స్కూలు ఫైనలు పాసయ్యాక కూడా ఇద్దరూ ఒకే కాలేజీలో పి యు. సి. లో ఒకే గ్రూపులో చేరారు అందుచేత అందరూ వీళ్ళిద్దరినీ భార్యా భర్తలనో, ప్రేయసీ ప్రియులనో అంటుండేవారు

భోజనం ముగించి గదిలోకి వచ్చి టేబులు ముందు కూర్చున్నాడు ప్రసన్న. పుస్తకం తీద్దామని చూశాడు తను ఇందాక చదువుతున్న కెమిస్ట్రీ పుస్తకం ప్రక్కనే నిలబెట్టి ఉన్న అద్దంలో తన ముఖం కనబడింది

అద్దాన్ని చేతిలోకి తీసుకుని తన ముఖం చూసుకోసాగాడు కాలేజీలో అందరూ అనే మాటలు గుర్తుకువచ్చాయి తనకు తర్వగా మీసాలు గడ్డాలూ వస్తే బావుండునని అనుకున్నాడు.

"ఒరేయ్ ప్రసన్నా !..."

హాలులోంచి రాఘవయ్య కేక వినబడింది.

అద్దాన్ని గోడకున్న మేకుకు తగిలించి బయటకు వచ్చాడు ప్రసన్న

"ఏమిటి నాన్నా ?"

"నీ కోసం చలపతి వచ్చినట్లున్నాడు... బయటనుండి కేకేస్తున్నాడు'' అన్నాడు రాఘవయ్య

ప్రసన్న వరండాలోకి వచ్చి చూశాడు. మెట్లదగ్గర చలపతి చేతిలో పుస్తకాలతో నిలబడి ఉన్నాడు

"ఈవేళ నీతో కొన్ని లెక్కలు చెప్పించుకుందామని వచ్చానురా" అన్నాడు చలపతి

"లోపలికి రా" అంటూ ప్రసన్న యింట్లోకి దారితీశాడు

*  *  *

ప్రసన్న పరీక్షలు అయిపోయాయి పరీక్షలయిన తరువాత అస్సలేమీ తోచడంలేదు యింట్లో ఊరికినే కూర్చుంటే విసుగుపుడుతుంది లైబ్రరీనుండి పుస్తకాలు తెచ్చుకుని వాటితోనే కాలక్షేపం చేస్తున్నాడు ప్రసన్న. అప్పుడప్పుడు చలపతి యింటికి వస్తే కారమ్స్ ఆడతాడు లేదా ఇద్దరూ కలిసి సినిమాకి వెళ్తారు లేదా గది కిటికీలో కూర్చుని ఎదురింటివైపు దొంగచూపులు చూస్తుంటాడు. ఎదురింటి అమ్మాయిని చూస్తుంటే ప్రసన్నకు ఏదో మాదిరిగా

అనిపిస్తుంది. తీరా ఆ అమ్మాయి ప్రసన్న చూస్తుండగా తను చూసిందంటే మాత్రం ప్రసన్న తల వంచేసుకుంటాడు

ఏదో భయం !

గుండె దడ

ఆ అమ్మాయి యింట్లో అటూ ఇటూ తిరుగుతూ ఉంటే చూడటమేగానీ ఆ అమ్మాయి కూడా కిటికీలో కూర్చుని ఉంటే తను అయిష్టంగానే లేచి లోపలికి వెళ్ళిపోతాడు

"ఒరేయ్ ప్రసన్నా !... ఎక్కడున్నావురా ?... త్వరగా రా" అంటూ మధ్య గదిలోంచి రాఘవయ్య కేక వినబడింది...

మిగిలిన కాస్త కాఫీని గటగట మంచినీళ్ళలా త్రాగేసి మధ్య గదిలోకి వరుగెత్తాడు ప్రసన్న.

రాఘవయ్య చేతిలోని న్యూసు పేపరు అతని ముఖంలోని కుతూహలం చూసి సంగతి పసిగట్టాడు.

"మీ పరీక్ష ఫలితాలు వచ్చాయిరా... నీ నెంబరెంత ?" రాఘవయ్య పేపరులోంచి బయటకి చూస్తూ అడిగాడు

ప్రసన్న చెప్పాడు

పేపరు తిరగేస్తూ "నువ్వు సెంకెండ్ క్లాసులో పాసయ్యావురా" అన్నాడు రాఘవయ్య

ఆయన గొంతులో ఆనందం ఉందో, నిరాశ ఉందో ప్రసన్నకు అర్థం కాలేదు ఆయన అతి సాధారణంగా అన్నాడా మాటలను.

రాఘవయ్య ప్రసన్న చేతికి పేపరిచ్చి

"ఏమేవ్ సుందరీ !..." అంటూ వంటింట్లోకి వెళ్లాడు

ప్రసన్నకు ఒక్కపెట్టున నిరాశ ఆవహించింది తను పి. యు సి ఫస్టు క్లాసులో పాసవ్వాలని, బి యి లో చేరి ఇంజనీరు కావాలనీ ఇంకా ఏవేవో కలలు కన్నాడు తన ఆలోచనలన్నీ రూపాలు కల్పించుకుని తన ముందు నిలిచి పరిహసిస్తున్నట్లు అనిపించింది

"ఏమండీ !– ప్రసన్నని ఇంజనీరింగు చదివిద్దామండీ'' అంది రాఘవయ్యతో సుందరమ్మ.

"వీడికి, వచ్చిన సెకండ్ క్లాసుకి ఇంజనీరింగ్‌లో సీటు ఎవడిస్తాడని — మీ బాబు !''

రాఘవయ్య విసుక్కున్నాడు.

ప్రసన్న మనసు చివుక్కుమంది. అసలే ప్రసన్నది చాల సున్నితమైన మనసు చాల చిన్న విషయాలకే అమితమైన ప్రాధాన్యతనిచ్చి బాధపడతాడు. అటువంటిది రాఘవయ్య ప్రదర్శించిన విసుగుదల నిరాశతో బాధపడుతున్న ప్రసన్నను మరింత కృంగదీసిందంటే ఆశ్చర్యపడాల్సిన అవసరంలేదు. అది ప్రసన్న విషయంలో సర్వ సాధారణం.

ప్రసన్న తల వంచుకున్నాడు. సుందరమ్మ ప్రసన్న ముఖం చూసి పరిస్థితి కాస్త అర్థంచేసుకుంది

"నేను యిప్పుడే అలా బజారుకెళ్లి వస్తాను" అంటూ చెప్పులు తొడుక్కుని వీధిన పడ్డాడు రాఘవయ్య

"నీళ్లు కాగిపోయినట్టున్నాయ్... నువ్వు రావే మాధవీ స్నానం చేద్దువు గాని" అంటూ సుందరమ్మ మాధవిని లాక్కెళ్లిపోయి ప్రసన్నకి ఏకాంతం కల్పించింది

కుర్చీలో ఉన్న పేపరును తీసుకుని తన గదిలోకి నడిచాడు ప్రసన్న

టేబులు ముందు కూర్చోబోతుంటే గోడకు తగిలించి ఉన్న అద్దంలో తన ముఖం దీనంగా కనిపించింది అయినా అందంగానే ఉందనుకున్నాడు ప్రసన్న.

కుర్చీలో కూర్చుని న్యూస్ పేపరును టేబులుమీద పరిచి రిజల్ట్సు వంక చూశాడు.

ఫస్టు క్లాసులు ఏమంత ఎక్కువమందికి రాలేదు అసలు తనకి కూడా ఫస్టు కాసు రావలిసిందే... కానీ పరీక్ష హాలులో అనవసరంగా కంగారుపడి లెక్కల పేపరు, కెమిస్ట్రి ప్రాక్టికల్సు పాడుచేశాడు.

ఒకసారి సెకండ్ క్లాసు రిజల్ట్సు కాలములో తన నెంబరువంక చూసుకున్నాడు

చలపతి గుర్తుకు వచ్చాడు

అవునూ !... చలపతి నెంబరెంతో ?...

గోడమీద ఒక మూలగా పెన్సిలుతో రాసిన చలపతి నెంబరు చూశాడు

గబగబా పేపరులో వెతికాడు. అందులో చలపతి నెంబరు లేదు చలపతి ఫేలయిపోయాడు

ఇప్పుడు ప్రసన్న మనసులో తనకు ఫస్టు క్లాసు రాలేదన్న బాధ పోయి దాని స్థానంలో చలపతిమీద జాలి చేరింది

చలపతి ఫేలయ్యాడన్న విషయం తెలిసిన తరువాత తను పాసయ్యాడన్న భావం ఆతనికి సంతృప్తిని కలిగిస్తూంది.

"అన్నయ్యా ! ... నీళ్ళు తోలివేసు ... స్నానం చేద్దువుగాని ... రా !" అంటూ జుట్టు చివరలు తువ్వాలుతో తుడుచుకుంటూ వచ్చింది మాధవి

ప్రసన్న కుర్చీలోంచి లేస్తూ లేచేటప్పుడు గోడకున్న అద్దంలో అరక్షణం పాటు కనిపించిన తన ముఖాన్ని మననం చేసుకుంటూ బాత్రూం వైపు నడిచాడు.

* * *

వరండాలో కూర్చుని పేపరు చదువుతున్న రామయ్య అలికిడి విని పేపర్లోంచి తలెత్తి వాకిలివైపు చూశాడు.

రిక్షాలోంచి దిగుతున్న చెల్లెలు జానకిని, మేనల్లుడు కృష్ణ నుచూసి రామయ్య ఆశ్చర్యపోయాడు

గబగబ మెట్లుదిగి వెళ్ళి రిక్షావాడికి డబ్బులిచ్చి సూట్ కేసు చేతిలోకి తీసుకుని "వస్తున్నట్లు ఉత్తరం ముక్కైనా రాయలేదేవిటే !" అంటూ ఇంట్లోకి అడుగు పెట్టాడు

"ఏం చెయ్యనురా అన్నయ్యా ! ... అనుకోకుండా ప్రయాణంచేశాను" అన్నది జానకి

గుమ్మంలోంచి లోపలికి వస్తున్న రామయ్యను వెనకాల ఉన్న జానకిని కృష్ణను చూసి "అమ్మా ! ... అత్తయ్య బావ వచ్చారే" అంటూ లోపలికి పరుగులు తీసింది మాధవి.

మాధవి కేక విని ప్రసన్న గదిలోంచి బయటకి వచ్చాడు

"ఏం అత్తయ్యా...బావున్నావా ?...మామయ్య రాలేదా ?"

"మీ దయవల్ల బాగానే ఉన్నామురా ప్రసన్నా ! ... మీ మామయ్యగారు ఆఫీసు పనిమీద క్యాంపుకి వెళ్ళారు. ఒక రెండువారాలపాటు క్యాంపులో ఉంటారు. కృష్ణకి కూడా కాలేజి లేదాయె వీడు బి. యస్సీ, పాసయిపోయాడు."

"ఏరా కృష్ణా...ఏవిటి విశేషాలు ?" ప్రసన్న కృష్ణని అడిగాడు

ప్రసన్నకి వరసలుపెట్టి పిలవాలంటే చికాకు జానకి వయసులో చాల పెద్దది గాబట్టి వరసబెట్టి పిలిచాడు సమవయస్కులను వరసలుపెట్టి పిలవడం ప్రసన్నకి యిష్టం ఉండదు

"ఏమ్మా జానకీ...బావున్నావా ?...అన్నట్టు అన్నయ్యగారు రాలేదా ?... కృష్ణ ఏంచేస్తున్నాడు ?" అంటూ ప్రశ్నల వర్షం కురిపించింది సుందరమ్మ

జానకి అన్నింటికీ సమాధానం యిచ్చింది.

మాధవి రెండు గ్లాసులనిండా కాఫీ పట్టుకొచ్చింది కృష్ణకి ఒక గ్లాసు అందించి ఇంకో గ్లాసు జానకికి ఇచ్చింది.

ఇది ఇంకొంచెం పెద్దదయి ఉంటే మా కృష్ణకి జోడి సరిపోయేది...అసలు ప్రసన్న ఆడదై పుట్టిఉంటే బావుండునన్నయ్యా... సరిగ్గా ఈడూ జోడూ సరిపోయేది...ప్రసన్న ఆడపిల్లయి ఉంటే మా కృష్ణకే కానీ కట్నంలేకుండా చేసుకుని ఉందును ... మీరు మొదట ఆడపిల్లనే కన్నారు కాదు !" అంది జానకి.

రామయ్య సుందరమ్మలు నవ్వి ఊరుకున్నారు.

మళ్ళీ తను కాలేజీలో చేరేదాకా ఏమీ తోచదనుకున్న ప్రసన్నకు జానకి కృష్ణల రాక ఆనందాన్ని కలిగించింది వాళ్ళతో బాగానే గడిచిపోతుంది.

కృష్ణ ఒక్కక్షణం తీరికగా ఉండడు అక్కడికి వెళ్దాం, ఇక్కడికి వెళ్దాం అని ప్రసన్నను ఊరంతా త్రిప్పుతాడు. లేదా కారమ్స్‌గానీ లేక పేకగానీ ఆడదాం అంటాడు. ఇవన్నీ కాకపోతే ఏ సినిమానో షికారో అంటాడు

వాళ్ళున్న రెండువారాలూ చాల త్వరగా గడిచిపోయినట్టనిపించింది. ఒక రోజు జానకి భర్త రామారావు వచ్చి అక్కడ ఒక్కరోజు ఉండి వాళ్ళిద్దర్నీ తీసుకెళ్ళిపోయాడు. అత్తయ్యా, బావా వెళ్ళిపోయిన తరువాత ప్రసన్నకి యిల్లంతా బోసిగా స్మశానంలా అనిపించింది. ఒకటి రెండురోజులు ఏమీ తోచలేదు. అప్పుడు మళ్ళీ చలపతి గుర్తుకు వచ్చాడు పరీక్షా ఫలితాలు వచ్చిన తరువాత అసలు చలపతిని కలవనే లేదు తను పాసయ్యాడు ! చలపతి ఫేలయ్యాడు !! అందుచేత చలపతిని కలవడానికి మనసు ఒప్పలేదు తను పలకరించి అనవసరంగా చలపతిని బాధపెట్టిన వాడినౌతానేమో అని అతని సందేహం ప్రసన్న కాలక్షేపంకోసం మళ్ళీ లైబ్రరీమీద పడ్డాడు కాలేజీలు తెరవడానికి ఇంకా వారం రోజులుంది ఎప్పుడెప్పుడు కాలేజీలు తెరుస్తారా ఎప్పుడు డిగ్రీకోర్సులో చేరదామా అని ఎదురుచూస్తున్నాడు ప్రసన్న

* * *

కాలేజీలు తెరిచారు న్యూ అడ్మిషన్స్ జరుగుతున్నాయి ప్రసన్న తను యిదివరకు పి యు సి చదివిన కాలేజీలోనే బి యస్సి లో చేరాడు.

డిగ్రీకోర్సులో చేరిన తరువాత తనెందో పెద్దవాడైపోయినట్టు అనిపిస్తుంది. కాని తన గదిలో గోడకు తగిలించిఉన్న అద్దంలో ముఖం చూసుకున్నప్పుడల్లా

తనింకా చిన్నపిల్లవాడిగానే అనిపిస్తుంది. డిగ్రీకోర్సులోకి వచ్చినా తనకు ఇంకా సరిగ్గా మీసాలు కూడా రానందుకు ప్రసన్నకు చికాకు కలిగేది

అప్పుడప్పుడు చలపతి సాయంత్రం వేళల్లో ప్రసన్న యింటికి వస్తున్నాడు. మాటల సందర్భంలో తను పి.యు సి ప్రయివేటుగా కట్టదలుచుకున్నట్టు చలపతి ప్రసన్నతో అన్నాడు ఒకసారి ప్రసన్న ఊహించినట్టు చలపతి తను పరీక్ష తప్పినందుకు బాధపడుతున్నట్లు అనిపించలేదు ప్రసన్నకు ఫస్టు క్లాసు రానందుకు ఎంత బాధపడ్డాడో అందులో పదో వంతైనా తను ఫెయిలయినందుకు చలపతి బాధపడలేదు

అదే ప్రసన్నకు చలపతికి ఉన్న భేదం!

ఒక నెలరోజులు మామూలుగా గడిచిపోయాయి క్లాసులో కొద్దికొద్దిగా తోటి విద్యార్థులతో ప్రసన్నకు పరిచయం ఏర్పడింది వాళ్ళు కూడా ప్రసన్నమీద కామెంట్సు వదిలేవారు

"నన్నడుగుతే...మీసాలూ, గడ్డాలూ పెరగడానికి నువ్వేవయినా నూనెలు వాడాలి ప్రసన్నా!" అంటాడు రవి.

వాడు ప్రసన్నకంటే వయసులో ఒకేడు చిన్నే! అయినా వాడికి పెద్ద పెద్ద మీసాలు వచ్చాయి వాడి గడ్డంకూడా బాగా ముదిరిపోయింది

"నీకే నయం గురూ! ... రోజూ షేవింగ్ చేసుకోలేక చస్తున్నాం!" అంటాడు విస్సిగాడు

ఇంకా నానా రకాలుగా వాళ్ళుకూడా అనడం మొదలుబెట్టారు.

పడేవాళ్ళుంటే అనేవాళ్ళకేం కొదవ?

పి యు సి. చదువుతున్నప్పుడు తన తరఫున చలపతైనా ఉండేవాడు. వాడు ఫేలవకుండా ఉంటే బావుణ్ణు అనుకున్నాడు ప్రసన్న

ఎన్నో రోజులుగా ఎంతోమంది ఎన్నో రకాలుగా కామెంట్సు విసిరినా అతను ఏమంత ఎక్కువగా మానసిక అసౌకర్యం ఫీలవలేదు.

కాని కళ్యాణి ప్రశాంతంగా ఉన్న సరోవరంలో చిన్న రాయిని విసరి అలలు రేపింది

కళ్యాణి ప్రసన్న క్లాస్‌మేట్ కళ్యాణిని చూడగానే ఎవ్వరికయినా ముందు ఆమె ముక్కుమీదనే దృష్టిపోతుంది ఆ ముక్కు సన్నగా పొడుగ్గా కొనదేరి ఎంతో అందంగా ఉంటుంది కళ్ళు ఏమంత పెద్దవి కాకపోయినా వాటిలో వింత మెరుపుంది, ఆకర్షణ ఉంది కనుబొమలు తీర్చిదిద్దినట్టు ఉంటాయి పల్చని పెదాలు కాస్త వొంపు తిరిగి ఉంటాయి మనిషి చాల నాజూకుగా ఉంటుంది

కళ్యాణి నవ్వినపుడు చూసినవాళ్లు ఆమెను ఏదోవిధంగా నవ్వించాలని ప్రయత్నించి తీరతారు ఆమె నవ్వు నిజంగా అంత ఆహ్లాదాన్ని కలిగిస్తుంది నవ్వడం ఆమెకు తప్ప ఇంకెవ్వరికీ రాదేమో అనిపిస్తుంది అటువంటి కళ్యాణి అందరు అబ్బాయిల్నీ ఆకర్షించిందంటే అదేమంత ఆశ్చర్యపడాల్సిన విషయం కాదు కళ్యాణి ప్రసన్నచేత ఆకర్షింపబడిందంటే అదీ ఆశ్చర్యపడాల్సిన విషయంకాదు ప్రసన్న అందం అటువంటిది

కొద్దిరోజులలోనే ప్రసన్న తెలివైన విద్యార్థి అనే అభిప్రాయం క్లాసులో అందరికీ కలిగింది

కళ్యాణి ప్రసన్న నోట్సులవీ తీసుకునే నెపంమీద అతన్ని పరిచయం చేసుకుంది. మొదట్లో ప్రసన్నకు కళ్యాణితో మాట్లాడాలంటేనే చాల అదురుగా ఉండేది గుండె దడదడ లాడేది కాళ్ళు వణికేవి మాటలు పెగిలేవికావు ఒకవేళ మాట్లాడినా తడబడుతూ మాట్లాడేవాడు నోట్సు అందిస్తున్నప్పుడు పొరబాటునో లేక మనఃపూర్వకంగానో కళ్యాణి చేతివేళ్ళు తగిలితే అతని వెన్నెముకలోంచి జివ్వుమని చలి మెదడులోకి ప్రాకేది రానురాను కళ్యాణితోనూ, ఆమె స్నేహితురాళ్ళతోను అప్పుడప్పుడూ మాట్లాడుతూండటం మూలాన గుండె దడదడలూ, కాళ్ళు వణకడం మొదలయినవి తగ్గాయి కాని మొదటినుండీ ఉన్న అలవాటు—సిగ్గుపడటంమ్మాత్రం పోలేదు ఆ ఆడపిల్లలతో తనూ ఆడపిల్లలా సిగ్గుపడుతూ మాట్లాడేవాడు.

రానురాను కళ్యాణి నోట్సులపేరుతో ప్రసన్న యింటికి రావడం మొదలు బెట్టింది. ప్రసన్నకు వాళ్ళ అమ్మా నాన్నల ముందు, మాధవిముందు కళ్యాణితో మాట్లాడాలంటే మనసుకు చాల యిబ్బంది అనిపించేది. కళ్యాణి మాధవితో బాగా స్నేహంచేసి, సుందరమ్మతో అత్తయ్య వరస కలిపి కొద్ది రోజులకే వాళ్ళింట్లో ఒక మనిషిగా కలిసిపోయింది

ఆ రోజు ఆదివారం—కాలేజీకి శలవు ప్రసన్న యింట్లోనే ఉన్నాడు రాఘవయ్య బజారుకి వెళ్లాడు సుందరమ్మ వంట పనిలో ఉంది మాధవి రేడియో సిలోన్‌లో హిందీపాటలు వింటూ కూర్చుంది

ఉదయం పదకొండుగంటలు కావొస్తుంది ప్రసన్న వరండాలో కూర్చుని ఏదో నవల చదువుతున్నాడు మధ్య మధ్య వీధివంక చేతి వాచీవంక చూస్తు న్నాడు నవల చదువుతుంటే ఏదో కట్టు కథ చదువుతున్నట్టు లేదు రచయిత

తన అనుభవ సారాన్ని సిరాగా మార్చి ఆ నవలను రాశాడేమో అనిపించింది ప్రసన్నకు.

చదువుతున్న పేజీదగ్గర చూపుడువేలు పెట్టి పుస్తకం మూసి వీధివైపు చూసి నిట్టూర్చాడు.

ప్రతీ ఆదివారం కళ్యాణి పదిగంటలకల్లా వచ్చేసేది ఈవేళ యింకా రాలేదు...ఒకవేళ రాదేమో ?

ఆ ఊహ ప్రసన్నకు నిరాశను కలిగించింది.

కళ్యాణి ఎదురుగా లేనంతసేపూ ఆమెగురించి ఏమేమో ఊహిస్తూ ఆమె కోసం తపిస్తాడు. తీరా ఆమె తన ముందున్నప్పుడు సరిగ్గా మాట్లాడటం కూడా ఆతనికి చేతగాదు. ఒక్కొక్కప్పుడు కళ్యాణి ప్రవర్తన ప్రసన్నను కలవర పరిచేది.

ఒకసారి కాలేజీనుండి పార్కుకు వెళ్దామంది. ప్రసన్నకు మనసులో యిష్టం ఉన్నా బెరుకుదనంవల్ల ఆప్పటికి ఏదో కారణంచెప్పి తప్పించుకున్నాడు. కళ్యాణి ఎన్నిసార్లు యింటికి ఆహ్వానించినా ఏదో ఒక సాకుచెపుతూ తప్పించు కున్నాడు.

ఒకసారి కారమ్స్ ఆడుతున్నప్పుడు తను రెడ్ కొట్టబోతుంటే,

"అది నాకు వదిలేయ్ ప్రసన్నా ! ... నాకు ఒక్క పాయింటు కూడా యిప్పటిదాకా ఇవ్వలేదు ... నీకు ఆడపిల్లలతో ఎలా ఆడాలో కూడా తెలీదు" అంటూ కళ్యాణి ప్రసన్న చేతిని పట్టుకుని నెమ్మదిగా గిచ్చింది.

అప్పుడు ఆమె కళ్ళలో ప్రతిఫలించిన భావాల పరంపర ప్రసన్నకు అర్థం అయీ కానట్టు అనిపించి తికమకపడ్డాడు.

కళ్యాణి ప్రసన్నను "నువ్వు శుద్ధ అమాయకుడివి" అని చాలసార్లు అంది.

కళ్యాణి గురించిన ఆలోచనలనుండి మనసును తను చదువుతున్న నవల మీదకు మళ్ళించాలని ప్రయత్నించాడు ప్రసన్న కాని కళ్యాణి గురించిన ఆలో చనలు అతని వదలడంలేదు కళ్యాణితో పరిచయం అయినదగ్గరనుంచీ ప్రసన్నకు ఆమెను గురించిన ఆలోచించడం తప్ప వేరే పనేమీ ఉండటంలేదు.

విసుగ్గా చేతి వాచీవంక మళ్ళీ చూసుకున్నాడు ప్రసన్న. పదకొండు న్నరైంది

"కళ్యాణి ఇంక రాదు."

నిరాశగా అనుకున్నాడు ప్రసన్న.



తను కళ్యాణిని ప్రేమించడం లేదుకదా ?! ... అని తనను తాను ప్రశ్నించుకున్నాడు

లేకపోతే ఆమె రాకపోతే తనకెందుకు ఇంత నిరుత్సాహం ? కళ్యాణి గురించి రెండు గంటలనుండీ వరండాలో కూర్చుని ఎదురుచూడ్డంలో అర్థం ఏమిటి ?

కళ్యాణిని ఒక్కరోజు చూడకపోతే తన మనసు మనసులో ఉండదెందుచేత ?

కళ్యాణి చేతి గాజుల చప్పుడుకూడా తన శరీరం ఎందుకలా జలదరిస్తుంది ?

తను నిజంగానే కళ్యాణిని ప్రేమిస్తున్నాడేమో ? !

కళ్యాణి కూడా తనని ప్రేమిస్తుందా ?

ఏమో ? ! !

ఏదేమైనా కళ్యాణికి తనంటే అమితమైన యిష్టం. లేకపోతే మాట - మాటకీ ఇంటికెందుకు వస్తుంది

కళ్యాణినిపెళ్లి చేసుకుంటే?

తన ఆలోచనలకి తనే సిగ్గుపడిపోయి ముసిముసి నవ్వులు నవ్వుకున్నాడు ప్రసన్న

"ఏవిటో అబ్బాయిగారు తమలో తామే ముసిముసి నవ్వులు నవ్వుకుంటున్నారు... ఆ మధుర స్మృతులేవో మాతో చెప్పవచ్చా ?"

ఉలిక్కిపడి కళ్లు తెరిచి చూశాడు ప్రసన్న

ఎదురుగా కళ్యాణి నవ్వుతూ నిలుచుంది. ఆమె చెవుల లోలాకులు వింతగా ఊగుతున్నాయి. గులాబీరంగు చీర అదే రంగు జాకెట్టు వేసుకుంది రెండు జడల్లో ఒకటి ముందుకు వేసుకుంది అందులో ఒక గులాబీ తురుముకుంది. తలంటి పోసుకోవడంవల్ల జుట్టు చెంపలమీదికి మెత్తగా జారిపోతుంది

కళ్యాణి అందాన్ని వీక్షిస్తూ ఈ లోకాన్నే మరిచిపోయాడు ప్రసన్న.

"ఏవండోయ్ !... అలా చూస్తారేం ?... నేను కళ్యాణిని" అంది.

మనసులో నీ కళ్యాణిని అనుకుంటి.

ప్రసన్న ఉలిక్కిపడి తన తప్పును తెలుసుకుని సిగ్గుపడ్డాడు

"రా... రా... కూర్చో" అని ఎదురుగా ఉన్న కుర్చీని చూపించాడు

"మీరు నాకోసమే ఎదురుచూస్తున్నట్లున్నారు" అని చిలిపిగా చూస్తూ కుర్చీ యింకా దగ్గరగా జరుపుకుని కూర్చుంది

"అబ్బే... ఊరికే బయట చల్లగాలికోసం కూర్చున్నాను" ఎక్కడ తన రహస్యం కనిపెట్టేస్తుందో అని తడబడ్డాడు ప్రసన్న

కళ్యాణి మాటలు విని లోపలినుండి మాధవి వచ్చింది

"హలో కళ్యాణీ !... ఎంతసేపైంది వచ్చి ?" ప్రసన్ననూ కళ్యాణినీ మార్చి మార్చి చూస్తూ అంది

మాధవి చూపులు గమనించి "పిల్ల గడుసైందే !" అనుకుంది కళ్యాణి

"ఇప్పుడే ! వచ్చి ఒక అయిదు నిముషాలు కూడా కాలేదు" అని పైకి అంది

"ఈవేళ ఇంత ఆలశ్యంగా వచ్చావేం? మా అన్నయ్య ఇందాకటినుండీ నీ కోసం ఎదురుచూస్తున్నాడు" మాధవి ప్రసన్నవైపు నవ్వుతూ చూసింది.

ప్రసన్న చెల్లెలిని చురచుర చూశాడు.

"మీ అన్నయ్యకి నాతో ఏం పనమ్మా?" కళ్యాణి మూతి తిప్పింది

మళ్ళీ మూతి తిప్పితే బావుణ్ణు అనుకున్నాడు ప్రసన్న.

ఇంతలో సుందరమ్మ చేయి కొంగుకు తుడుచుకుంటూ బయటికి వచ్చింది.

"ఏమే కోడలా... ఎంతసేపైంది వచ్చి?" అంది,

"ఇప్పుడే అత్తయ్యా... నేను వంటింట్లోకి వద్దామనుకుంటుంటే ప్రసన్న తరువాత వెళ్ళొచ్చులే అంటే ఇక్కడ కూర్చున్నాను" అంది కళ్యాణి ప్రసన్నవైపు చిలిపిగా చూస్తూ.

"ఈ రెండురోజులనుండీ రాలేదేమే మా యింటికి?"

"యింట్లో చుట్టాలొచ్చారు అత్తయ్యా!... పనుండి రాలేదు... అయినా నేనెందుకు రావాలి?... ప్రసన్న మా యింటికి వస్తున్నాడేమిటి?" మూతి ముడుచుకుంది కళ్యాణి

"ఈవేళ వాడిని మీ యింటికి తప్పకుండా పంపిస్తానులేవే... ఏరా... కళ్యాణి వాళ్ళింటికి వెళ్ళవూ?" సుందరమ్మ ప్రసన్నను అడిగింది

ప్రసన్నకు కళ్యాణివాళ్ళ యింటికి వెళ్ళాలంటే భయం వాళ్ళ వాళ్ళేమయినా అనుకుంటారని అనుమానం ప్రసన్న సమాధానం చెప్పేలోగా కళ్యాణే అందుకుంది.

"ఈవేళ మా యింటికి వస్తానన్నా నేను ఒప్పుకోను... ఈవేళ వేరే ప్రోగ్రాం ఉంది"

"ఏమిటి కళ్యాణీ!" మాధవి కళ్యాణివంక చూసింది

"ఈవేళ మనం అందరం సినిమాకు వెళ్దాము... అత్తయ్యా, మామయ్యా కూడా వస్తారు... ఏం అత్తయ్యా?"

కళ్యాణి సుందరమ్మ సమాధానంకోసం చూసింది సుందరమ్మ సినిమాకు రావడానికి ఎలానూ ఒప్పుకోదని కళ్యాణికి తెలుసు

"సినిమాకు మేమెందుకే కోడలా?... మీరు ముగ్గురూ వెళ్ళిరండి"

"వరవాలేదు అత్తయ్యా... ఈ ఒక్కసారికి రాకూడదూ?" ఎక్కడ వస్తానని అంటుందో అని భయపడుతూనే అడిగింది

"నాకు తీరిక లేదే... ఓపిక కూడా లేదు... మీరు ముగ్గురూ వెళ్ళిరండి."

కళ్యాణి తేలికగా శ్వాస పీల్చుకుంది.

"మనం వంటయ్యేలోగా పేకాడదాం అన్నయ్యా!" అంది మాధవి

"ఇంకా ఆలశ్యం దేనికి?... త్వరగా తీసుకురా" అంటూ ప్రసన్న అభిప్రాయంతో పని లేకుండానే మాధవిని లోపలికి తరిమింది కళ్యాణి

మాధవి, పేకలు తెచ్చింది

ముగ్గురూ వరండాలో చాపవేసుకుని కూర్చున్నారు.

కళ్యాణి చక చక ముక్కలు పంచింది.

ఆట జోరుగా సాగుతుంది ఆడుతున్నంతసేపూ కళ్యాణి తెగ అల్లరి చేసింది. ఊరికే నవ్వుతుంది ఏమేమో మాట్లాడుతుంది ప్రసన్నమాత్రం ఆమె మాటలన్నీ మౌనంగా వింటూ అప్పుడప్పుడు చిరునవ్వులు పెదాలమీద చిలకరిస్తున్నాడు.

"ఇంక ఆ ఆటని కట్టిపెట్టి భోజనాలకు లేవండి" అంటూ సుందరమ్మ వచ్చింది.

"ఉండత్తయ్యా.. ఆట మంచి పట్టులో ఉ ... ప్రసన్నకి పాపం మంచి ముక్కలు పడినట్టు లేవు" ఉడికిస్తూ అంది కళ్యాణి.

"పట్టూ లేదు — గిట్టూ లేదు... ముందు భోజనాలకు లేవండి... తరువాత సినిమా టైమువరకూ ఆడుకుందురుగాని" అంటూ పేకముక్కలు లాక్కుంది

ముగ్గురూ భోజనానికి లేచారు

కళ్యాణి ప్రసన్న ప్రక్కన కూర్చునే భోజనం చేసింది భోజనం చేస్తున్నంతసేపూ ప్రసన్నకి అది-ఇది వడ్డించమని సుందరమ్మకు ఒకటే పురమాయింపులు చేసింది. ప్రసన్న వద్దని అంటే మగవాడివి ఆ మాత్రం తినలేవా అంటూ కోపం ప్రదర్శించింది

సుందరమ్మ నవ్వి ఊరుకుంది

ముగ్గురూ భోజనాలు పూర్తి కానిచ్చి వరండాలోకి వచ్చారు రాఘవయ్య ఎప్పుడు వచ్చాడో అక్కడ కుర్చీలో కూర్చుని పేపరు చదువుకుంటున్నాడు.

అలికిడికి పేపరులోంచి తలెత్తి కళ్యాణిని చూశాడు

"ఏమ్మా కళ్యాణీ! బావున్నావా?"

"మీ దయవల్ల బాగానే ఉన్నాను మామయ్యా!" అంది.

"మాటలు బాగానే నేర్చావే?... అన్నట్టు మీరు ముగ్గురూ భోజనం కొట్టే శారేవిటి?''

ముగ్గురూ నవ్వారు

రాఘవయ్య మాటలు విని సుందరమ్మ బయటికి వచ్చింది.

''ఏమండీ... మీరు కూడా లేచి కాళ్లు కడుక్కోండి... భోజనం వడ్డిం చేస్తాను" అంది

"నువ్వు కూడా వీళ్లతో కొట్టేశావా ఏవిటి?" అంటూ రాఘవయ్య పరా చికాలాడాడు

అందరూ ఘొల్లుమని నవ్వారు

''చాల్లెండి వేళాకోళం... లేవండి"

సుందరమ్మ కోపం ప్రదర్శించింది

ఇద్దరూ లోపలికి వెళ్ళిపోయారు.

"సినిమాకి ఇంకా గంటన్నర టైముంది... అంతవరకూ పేకాడుకుందాం అంది కళ్యాణి.

ముగ్గురూ మళ్ళీ పేకాటలో పడ్డారు. కళ్యాణి మళ్ళీ అదే అల్లరి ప్రసన్నకు కళ్యాణి చేసే అల్లరి ఏదో హాయిని కలిగిస్తుంది

''టైం అయిపోయింది... ఇంక ఆట ఆపేద్దాం" అంటూ ప్రసన్న ముక్కలు కలిపేశాడు

రాఘవయ్య అక్కడికి వచ్చాడు

"అదేమర్రా... లేచిపోతున్నారు?... కూర్చోండి! నేను కూడా రెండా టలు ఆడతాను" అన్నాడు.

"లాభంలేదు మామయ్యా... ఇంకోసారి మిమ్మల్ని కూడా ఆడిస్తుకుంటాం. యిప్పుడు మేము సినిమాకి వెళ్తున్నాం" అంది కళ్యాణి చేతులు త్రిప్పుతూ

"అయితే నేను కూడా మీతో వస్తాను"

"మేము స్టంటు సినిమాకి వెళ్తున్నాం మామయ్యా!... మీకు అటువంటి సినిమాలు నచ్చవనుకుంటాను."

''అబ్బే!... అదేం లేదమ్మా. నేను ఏ సినిమాలైనా చూస్తాను'' అన్నాడు రాఘవయ్య కళ్యాణిని ఉడికిస్తూ.

"సరే... అయితే మీరు కూడా రండి" అంది కళ్యాణి నీరసంగా

"పోన్లే... రమ్మన్నావు— అదే పదివేలు... నాకు తీరిక లేదమ్మా... మీరు ముగ్గురూ వెళ్ళిరండి" అన్నాడు నవ్వేస్తూ.

తన మనసు రామయ్య చదివేశాడేమో అని సిగ్గుపడిపోయింది కళ్యాణి.

ప్రసన్న తయారౌతున్నంతసేపూ కళ్యాణి తీయగా బాధపెట్టింది.

"ఛ ఛ... ఈ చొక్కా ఏం బాగోలేదు... వేరేది తొడుక్కో"

"ఇదేం పంట్లాం... చాల ఓల్డ్ ఫాషన్.. ఇది పంట్లాం లాగుందా పైజామా లాగుంది గానీ"

"పంట్లాం చొక్కా రెండూ బాగున్నాయిగానీ ఈ రెండూ మాచ్ కావు"

"ఏదీ... ఆ వైట్ బ్లూ కలర్ చొక్కా ఇలా తే... ఆ రంగంటే నాకు చాలా యిష్టం... ప్చ్... ఈ చొక్కా బావుందిగానీ టైలర్ ఎవరో సరిగ్గా కుట్ట లేదు... చొక్కా చెడగొట్టేశాడు."

ఇలా రకరకాలుగా ప్రసన్నను సతాయించి ఎట్లాగయితేనేం చివరికి ఒక డ్రెస్ సెలెక్ట్ చేసింది.

ప్రసన్నకి ఆ బట్టలు తొడుక్కోవడం అంత యిష్టంలేదు. కాని కళ్యాణి ఎన్నికచేసింది. అందుచేత వాటిని తొడుక్కున్నాడు.

కళ్యాణి ప్రసన్నను తలకూడా అతనికి నచ్చిన రీతిలో దువ్వుకోనీయలేదు.

"ఛ... పాపిడిని అంత ప్రక్కకి తీసుకున్నావేం ?... కాస్త యిటు ప్రక్కకి తీసుకో."

"యిప్పుడు మరీ మధ్యకి తీసుకున్నావ్ !"

"క్రిందకి అలా అణిచి దువ్వుకుంటావేం ? కాస్త పైకి దువ్వుకోరాదూ ?"

"వెనక చూడు కోడి పుంజు ఈకల్లా జుట్టెలా నిలబడిందో... సరిగ్గా దువ్వుకో ప్రసన్నా... నువ్వు తయారయ్యేలోగా మ్యాట్నీ మాట అలా ఉంచి సాయంత్రం ఆటకి కూడా టైమైపోయేట్టుంది."

అక్కడ మాధవి ఉందిగానీ లేకపోతే ప్రసన్న చేతిలోంచి దువ్వెన లాక్కుని తనే దువ్వేసేదేమో

దువ్వెన ప్రక్కనపెట్టి అద్దంలో ముఖం చూసుకున్నాడు ప్రసన్న

తను పెద్ద పెద్ద మీసాలు మెలేస్తూ కళ్యాణి ప్రక్కనుండి నడుస్తే బావుణ్ణు అనుకున్నాడు ప్రసన్న

"ఇంక చాల్లే... ఇటు తిరుగు."

ప్రసన్నని తృప్తిగా చూసి ,

"ఇంక పదండి పోదాం" అంటూ లేడిలా వంటింటిలోకి పరుగుతీసి సుంద రమ్మకి అక్కడినుండి వరండాలో కూర్చున్న రామయ్యకి వెళ్తున్నట్టు చెప్పి ప్రసన్నను మాధవిని వెంటబెట్టుకుని తనే లీడ్ చేస్తూ సినిమాహాలుకి తీసు కెళ్ళింది

ముగ్గురూ హాలులోకి వెళ్లారు మాధవి వెనకాల ప్రసన్న అతని వెనకాల కళ్యాణి సీట్లు వెతుక్కుంటూ నడుస్తున్నారు

ఒక చోట మాధవి కూర్చుండిపోయింది. మాధవికి అటు ప్రక్క ఇంక సీట్లులేవు. ప్రసన్న చెల్లెలి ప్రక్కన కూర్చున్నాడు కళ్యాణి ప్రసన్న ప్రక్కన కూర్చుంది

సినిమా జరగుతున్నంతసేపూ కళ్యాణి ప్రసన్న చేతిమీద తన చేయి వేయ డమో అతని మోకాలుకు తన మోకాలు తగిలించడమో చేస్తూనే ఉంది అప్పు డప్పుడూ మీదికి ఒరిగి చెవిలో ఏమేమో మాట్లాడుతునే ఉంది.

ఆమె ఏం చేసినా ప్రసన్న కదలడంలేదు మెదలడంలేదు.

"నువ్వు వట్టి పిరికివాడివి ప్రసన్నా "

ప్రసన్న చేతిని గిచ్చుతూ చెవిలో గొణిగింది కళ్యాణి.

* * *

నాలుగురోజులు యధావిధిగా గడిచిపోయాయి.

సాయంత్రం అయింది పక్షులు గూటికి చేరుకుంటున్నాయి. అంతవరకూ లోకసంచారం చేసిన సూర్యుడు కందిపోయాడు పశ్చిమాన విశ్రమించడానికి బంగారు మబ్బుల పరుపుల మీదనుండి ఎఱ్ఱని ఆకాశపు గొడుగు క్రింద మెత్తగా జారుకుంటూ పోతున్నాడు సూర్యుడు.

చీకటిపడుతూంది... లైటన్నా వేసుకోకుండా ఆడుతున్నారే మర్రా..." అంటూ సుందరమ్మ లైటు వెలిగించింది.

ముగ్గురూ ఒకసారి తలెత్తి సుందరమ్మ ముఖం వైపు చూసి మళ్ళీ పేకల్లో తల దూర్చేశారు.

"ఎప్పుడూ పేకాటేనా?... కాస్సేపు ఊరికెనే కూర్చుని మాట్లాడు కోండర్రా" అంది సుందరమ్మ.

"ఉండత్తయ్యా... ఈసారి ఆట కూడా నాదే... ప్రసన్నను ఈవేళ చిత్తుగా ఓడించిగానీ లేవను" అంది కళ్యాణి రెప్పలు ఎగురవేస్తూ.

"ఈసారి ఆట సీదనుకుంటున్నావా ?... అలాగే అనుకుంటూండు'' అన్నది మాధవి తల పంకించి తన ముక్కల్లోనికి చూసి చిరునవ్వు విసురుతూ

"నాకు ఒక్క 'టచ్' వస్తే చాలు— షో !" అన్నాడు ప్రసన్న హుషారుగా

"మాడత్తయ్యా !—ఇలా రా — నా ముక్కలు చూడు — ఎంత బాగా ఉందో ఆట !" అంది కళ్యాణి సుందరమ్మకి ముక్కలు చూపుతూ

"మీతో పెట్టుకుంటే నా పనులు అయినట్టే — అవతల కూర మాడుతున్నట్టుంది—నేను వస్తాను" అంటూ వంటింట్లోకి వెళ్ళిపోయింది సుందరమ్మ

ఆ స్సేపటికి రాఘవయ్య ఆఫీసునుండి ఇంటికి వచ్చాడు. చెప్పులు విడిచి వాలెట్ టేబుల్‌మీద పడేసి కుర్చీలో కూర్చున్నాడు

రాఘవయ్య వచ్చిన అలికిడి విని సుందరమ్మ బయటికి మంచినీళ్ల గ్లాసుతో వచ్చింది.

సుందరమ్మ చేతిలోంచి గ్లాసునందుకుని మంచినీళ్ళు గటగట త్రాగేసి ఖాళీ గ్లాసు ఆమె చేతికి అందించి.

"వీళ్ళిద్దరూ ఏరీ ?" అని ప్రసన్నను, మాధవిని ఉద్దేశించి అడిగాడు.

"కళ్యాణి వచ్చింది — అవతల గదిలో ఉన్నారు — మీరు ముఖం కడుక్కోండి ! — కాఫీ పట్టుకొస్తాను !!" అంటూ సుందరమ్మ వంటింట్లోకి వెళ్ళిపోయింది

రాఘవయ్య బాత్రూమ్‌లోకి దారితీశాడు.

రాఘవయ్య కాఫీ త్రాగి ప్రసన్నవాళ్ళున్న గదిలోకి వచ్చాడు.

"నమస్కారం మామయ్యా...ఆఫీసునుండి ఇప్పుడే వచ్చావా మామయ్యా?" అని నమ్రతగా అడిగింది కళ్యాణి ప్రసన్న సర్దుక్కూర్చున్నాడు.

"అవునమ్మా కళ్యాణీ!...అన్నట్టు నాలుగురోజులక్రితం ఆదివారం తరువాత ఇప్పుడా మళ్ళీ రావడం ?...ఈ మధ్య మా యింటికి రావడం మరీ తగ్గించేశావేమమ్మాయ్ ?"

"ప్రసన్న మా యింటికి వస్తున్నాదేవిటి ? నేను రావడానికి ??...అయినా ప్రసన్న మా యింటికి రాకపోయినప్పుడు నేనుమాత్రం మీ యింటికి ఎందుకు రావాలి అనుకుంటాను...కాని అత్తయ్యను, మిమ్మల్ని చూడకుండా ఉండలేను మామయ్యా !" అంది కళ్యాణి ప్రసన్న వైపు చూసి కన్నుగీటుతూ.

ప్రసన్న కంగారుపడ్డాడు - ఎక్కడ తన తండ్రి పసిగడతాడో అని

"అదేం లేదమ్మా...వాడికి క్రొత్తవాళ్ళంటే తగని సిగ్గు.. అంతేగానీ వేరేమీ లేదమ్మా.. "

"సిగ్గు ఆడవాళ్ళకి ఉండాలిగానీ మగవాళ్ళకెందుకు మామయ్యా" అంది కళ్యాణి ప్రసన్న వైపు కొంటెగా చూస్తూ

ప్రసన్నకి పౌరుషం వచ్చింది

"అదేం కాదులే...ఎట్లాగూ నువ్వు మా యింటికి వస్తున్నావు కదా ... కలుసుకుని మాట్లాడేది ఎక్కడైతేనేం అని రావడంలేదు ... అంతే !..." అన్నాడు మూతి ముడుచుకుంటూ.

కళ్యాణి ప్రసన్న ముఖంచూసి ఫక్కుమని నవ్వింది

"అయితే ఈ ఆదివారం మీ యింటికి నేను రావడంలేదు - నన్ను కలుసుకోడానికి మా యింటికి రా ... ఎక్కడైతేనేం కలుసుకోడానికి ? ... మరేం సిగ్గుపడకు ఏం ?!"

మళ్ళీ గుక్కలుపట్టి నవ్వింది

ప్రసన్నకు కోపంవచ్చినా కళ్యాణి నవ్వుముందు అతనికోపం ఎండలో మంచులా కరిగిపోయింది

"సిగ్గు నాకెందుకూ ?" గొంతు హెచ్చించి అన్నాడు

"అయితే మా యింటికి రా "

"ఎందుకు రాదమ్మా...తప్పకుండా వస్తాడు...ఏరా ప్రసన్నా ?"

"ఈసారి ఆదివారం నేను మీ యింటికి వస్తాను...సరేనా ?"

"ఏమో ? ... నాకు నమ్మకం లేదు బాబూ ..."

"అబ్బబ్బ ... మా అన్నయ్య ఎక్కడికీ పోడు కళ్యాణీ ... మీ యింటికి ఎల్లుండి ఆదివారం తప్పకుండా వస్తాడులే ... అంతగా అయితే నేను మీ యింటికి లాక్కొస్తానుగా" అంది మాధవి ఆట మధ్యలో ఆగిపోయినందుకు విసుక్కుంటూ.

"ఏవిటీ ?... నువ్వుకూడా ప్రసన్నతో మా యింటికి వస్తావా ?"

అనుమానంగా ప్రశ్నించింది కళ్యాణి

"నేను రావడం నీ కిష్టంలేకపోతే రానులే "

"ఛఛ... అదేంకాదు మాధవీ ... మా యింటికి రావడం నీ కిష్టమో కాదో నని.. అంతే ... నువ్వుకూడా వస్తే అంతకంటే కావలసిందేముందీ ?" అంది కళ్యాణి తడబడతూ

"మీరు ఆడుకుంటూ ఉండండి" అంటూ బయటికి వెళ్ళిపోయాడు రాఘవయ్య.

"అయితే నువ్వు నిజంగానే మా యింటికి వస్తున్నావా ప్రసన్నా ?"

"అబ్బబ్బ...మా అన్నయ్యను మీ యింటికి తీసుకొచ్చే బాధ్యత నాది కళ్యాణీ...ఇంక ఆటలోకి రా" మాధవి మళ్ళీ విసుక్కుంది.

కళ్యాణి నవ్వింది

కాస్సేపయిన తరువాత మాధవి,

"మంచినీళ్ళు త్రాగివస్తాను...నా ముక్కలు చూశారంటే జాగ్రత్త" అంటూ పేక బోర్లించి లోపలికి వెళ్ళింది

"నిజంగా మా యింటికి వస్తావా ప్రసన్నా" కళ్యాణి మళ్ళీ అడిగింది.

ప్రసన్నను తన యింట్లోవాళ్ళకి పరిచయంచేసి ప్రసన్నమీద వాళ్ళకు మంచి అభిప్రాయం కలగజెయ్యాలని కళ్యాణి ఉద్దేశం

"తప్పకుండా వస్తాను కళ్యాణీ ... నా మాటమీద నీకు నమ్మకం లేదా ?"

"అయితే ఒట్టువెయ్యి "

కళ్యాణి చెయ్యి చాపింది

ప్రసన్న ఆమె చేతిలో చెయ్యివేసి,

"తప్పకుండా వస్తాను ... సరిగ్గా ఉదయం పదిగంటలకు వస్తాను ... సరేనా ?" అన్నాడు.

కళ్యాణి అతని చేతిని తన చేతితో మెత్తగా వత్తింది. ప్రసన్న శరీరం జివ్వుమంది

కళ్యాణి చేతిని తన చేతిలో గట్టిగా బిగించాడు ప్రసన్న. కళ్యాణి కళ్ళు మిలమిల మెరిశాయి ఎన్నడూ ప్రసన్నముందు సిగ్గుపడని ఆమె సిగ్గు పడింది ! ...

మాధవి అడుగుల సవ్వడి విని ప్రసన్న చేతిలోని తన చేతిని గబుక్కున లాక్కుంది కళ్యాణి

"నా ముక్కలుగానీ చూడలేదు కదా ?'

అంటూ ఓణీ అంచుతో మూతి తుడుచుకుంటూ వచ్చిన మాధవి తలవాల్చుకుని ఉన్న కళ్యాణినీ, గోడలనూ, పటాలనూ ఇంటికప్పునూ మార్చి మార్చి చూస్తున్న ప్రసన్ననూ చూసి అట్లాగే నిలుచుండిపోయింది

* * *

ఆ రోజు ఆదివారం !

కళ్యాణి ఎంతో ఆత్రంగా రెండురోజులనుండీ ఎదురుచూసిన రోజది !!

వరండాలో కుర్చీలో కూర్చుని పత్రిక తిరగేస్తూ ప్రసన్న రాకకోసం ఎదురు చూస్తుంది కళ్యాణి

పత్రిక చదువుతున్నదన్నమాటేగానీ కళ్యాణి బుర్రలోకి అవేమీ ఎక్కడం లేదు. ఏమేమో ఆలోచనలు ఆమె మనసులో సుడుల్లా తిరుగుతున్నాయి

అప్పుడు సమయం పదిన్నర గంటలైంది ప్రసన్న సరిగ్గా పదిగంటలకే వస్తానని అన్నాడు. తను ప్రసన్నని భోజనం చేయకుండా రమ్మంది ఇద్దరూ కలిసి భోజనం చేయాలని తన ఉద్దేశం.

ప్రసన్న ఇంకా రాలేదేమిటి ?...ఒకవేళ రాడేమో ?.. అబ్బే ! ... అదేం కాదు...వస్తానని చెప్పి ఎందుకు రాడు ??...ఇప్పుడు దారిలో ఆడపిల్లలా తల వంచుకుని వస్తుంటాడు.

కళ్యాణికి రెండురోజులక్రితం పేకాడుతున్నప్పుడు మాధవి మంచినీళ్లకని లోపలికి వెళ్ళినప్పుడు ప్రసన్న తన చేయిపట్టుకున్న సంఘటన గుర్తుకు వచ్చింది. ఆమె చెక్కిలిమీద గులాబీలు పూచాయి మనసులోని మధురభావన లోంచి పుట్టిన వెలుగుకిరణం ఆమె కళ్ళలోకి వచ్చి వెలిగింది.

అందులో కొంత చిరునవ్వుగా మారి ఆమె పెదాలమీద నిలిచింది.

ప్రసన్న పట్టుకున్న తన అరచేతిని చూచుకుంది. ఆ సంఘటన పునశ్చరణ చేసుకుంటూ చేతిని ముద్దుపెట్టుకుంది

మళ్ళీ తనను ఎవరైనా గమనిస్తున్నారేమో అని కంగారుపడి చుట్టూ చూసి ఎవరూ తనను చూడటంలేదని నమ్మకం కుదిరాక తేలికగా శ్వాస పీల్చుకుంది.

"ఏవేం...ఆ అబ్బాయి ఇంకా రాలేదూ ?" కొంగుకు చేతులు తుడుచుకుంటూ బయటికివచ్చిన పార్వతమ్మ కూతుర్ని అడిగింది.

"లేదే...తప్పకుండా రావాలి మరి !...అన్నట్టు వంటయిపోయిందా ?"

"ఆ ... అయిపోయినట్టే ! ఇంకొక అరగంటలోగా పూర్తిగా అయిపోతుంది...అయినా ఆ అబ్బాయి వస్తాడంటావా ? ఆడపిల్లవు నువ్వు వాళ్ళింటికి రోజూ వెళ్తుంటావు - మగపిల్లవాడు ఆ అబ్బాయి మనింటికి రాడేమే ?... ఇలా సిగ్గుపడే మగవాళ్లను నేనెక్కడా చూడలేదు సుమా!..." అంటూ దీర్ఘాలు తీసింది పార్వతమ్మ

"తప్పకుండా వస్తాడులేవే !" అంది కళ్యాణి కాస్త విసుగ్గా.

"ఏమో ః... ఎట్లాగో ఏమో ! ...అవతల చారు తెర్లుతుంది...నే పోతా"
అంటూ లోపలికి వెళ్ళిపోయింది పార్వతమ్మ

కళ్యాణి నిట్టూర్చింది

పత్రిక పేజీలు ఇటూ అటూ త్రిప్పి కాస్సేపు సమయం గడిపింది

కుర్చీలోంచి లేచి వరండాలో నిలబడి వీధిలోకి తొంగిచూసింది కనుచూపు మేరవరకూ ప్రసన్న వస్తున్నట్లు ఎక్కడా కనబడలేదు

ఆమె కనుబొమలు ముడిపడ్డాయి

విసుగ్గా చేతి వాచీవంక చూసింది పదకొండు దాటిపోయింది

ఆమెను నిరాశ ఆవరించింది మనసు పరిపరి విధాల పోయింది

ప్రసన్న యింక రాడేమో ? ... పదిగంటలకే వస్తానన్నాడు, ఇంకా రాలేదంటే ఏదైనా అవసరమైన పని తగిలిందేమో ?— ఒకవేళ తనీవేళ వస్తానని చెప్పిన విషయం మర్చిపోయాడేమో ?—ఛఛ—ఎలా మర్చిపోతాడు ?—

లేకపోతే అప్పటికి ఊరికినే వస్తానని అన్నాడేమో ?

మరి తన చేతిలో చెయ్యేసి ప్రమాణంచేసిన సంగతి ??—

తామిద్దరూ ఆఖరుసారిగా కలుసుకున్నది ఆ రోజు — తన చేతిని పట్టుకున్న రోజు సాయంత్రమే — అప్పటినుండీ ఇద్దరూ కలుసుకోలేదు — ప్రసన్న ఈ రెండురోజులూ కాలేజీకి కూడా రాలేదు—బహుశా ఒంట్లో బాగోలేదేమో ?

తను కూడా వాళ్ళింటికి వెళ్లలేదు

అసలు ఊళ్లో ఉన్నాడా ?

ఈ రకాల ఆలోచనలతో కళ్యాణి బుర్ర వేడెక్కిపోయింది.

ఒక నిశ్చయానికి వచ్చి కళ్యాణి లోపలికి వెళ్ళి కాస్త పౌడరు పులుముకుని అద్దంముందు నిలుచుని చెంపల దగ్గర, నొసటిమీద ముంగురులు సర్దుకుని తన ప్రతిబింబాన్ని తృప్తిగా ఒకసారి చూసుకుని చెప్పులు తొడుక్కుంది.

అప్పుడే వంటింట్లోంచి గదిలోకి వచ్చిన పార్వతమ్మ,

"ఎక్కడికే వెళ్తున్నావ్ ?" అని అడిగింది

"ప్రసన్న వాళ్ళింటికి — మళ్ళీ ఇప్పుడే వచ్చేస్తాను" అని చెప్పి బయటికి నడిచింది

"వంటయిపోయింది—భోజనంచేసి వెళ్లకూడదూ ,"

పార్వతమ్మ అంటున్న మాటలు వినిపించుకోకుండా వీధిలోకి వెళ్ళిపోయింది

ప్రసన్న వాళ్ళ యింటికి వెళ్ళిన కళ్యాణికి వరండాలో ఎవ్వరూ కనిపించ లేదు.

"బహుశా అందరూ లోపల ఉండి ఉంటారు" అనుకుంటూ లోపలికి అడుగు పెట్టింది.

హాలులో కూడా ఎవ్వరూ లేరు

"అత్తయ్యా !" —అంటూ పిలిచింది

బదులుగా రాఘవయ్య బయటికి వచ్చాడు అతని ముఖంలో విచారఛాయలు చూసి కళ్యాణి మనసు ఏదో కీడును శంకించి రెపరెపలాడింది.

"లోపలికి రామ్మా !" — అంటూ లోపలి గదిలోకి దారితీశాడు

కళ్యాణి నిశ్శబ్దంగా అతన్ని అనుసరించింది.

గదిలోని దృశ్యంచూసి కళ్యాణి నవనాడులూ స్థంభించిపోయాయి.

మంచంమీద ప్రసన్న పడుకుని ఉన్నాడు. ముఖంతప్ప నిండుగా దుప్పటి కప్పి ఉంది. ప్రసన్న ముఖం బాగా పీక్కుపోయింది మంచం ప్రక్కన సుందరమ్మ దీనంగా నిలుచుని ఉంది.

"ఏమైంది అత్తయ్యా ?"

కళ్యాణి గొంతు నూతిలోంచి వచ్చినట్లు ఉంది.

"రెండురోజులనుండీ జ్వరం అమ్మా—మాయదారి జ్వరం పట్టుకుంది—నువ్వు క్రితంసారి వచ్చావు చూడు — ఆ రాత్రినుండే – ఈవేళ నార్మల్‌కి వచ్చింది — " అంటూ ఇంక మాట్లాడలేక కొంగు నోటిదగ్గర పెట్టుకుని దుఃఖించసాగింది.

"వట్టి జ్వరమే అయితే ఫరవాలేదమ్మా—కాని గుండెల్లో మంటని ఒకసారి అంటాడు – డొక్కల్లో నెప్పని ఒకసారి అంటాడు – ఏమీ చెప్పకుండా ఏడుస్తాడు ఒక్కోసారి—నిన్న మొన్న "చెస్ట్ పెయిన్" చాల ఎక్కువగా ఉందని గోలపెట్టాడు—వీడు పి యు సి చదువుతుండగా కూడా ఇలా రెండు మూడు సార్లు చెస్ట్ పెయిన్ వచ్చింది—మా డాక్టరు దానికి సరియైన కారణం చెప్పలేక పోయాడు.

"పెద్ద ఆసుపత్రికి తీసుకెళ్లలేకపోయారా మామయ్యా !"

"అదే నేనూ అనుకుంటున్నానమ్మా— వీడికి జ్వరం తగ్గింది కదా – కాస్త కోలుకున్నాక పెద్దాసుపత్రికి తీసుకెళ్ళి ఎక్స్‌రే తీయించడమో పూర్తిగా అన్ని పరీక్షలూ చేయించడమో చెయ్యాలని అనుకుంటున్నాను "

రాఘవయ్య కళ్లలోని నీటిపొరలను గమనించింది కళ్యాణి

మగవాడు గాబట్టి దుఃఖాన్ని దిగమింగుకున్నాడు.

"వాడి బాధను చూడలేకుండా ఉన్నాం తల్లీ! — వాడి బాధేవిటో మాకు అర్థంకావడంలేదు— వాడుకూడా చెప్పలేకపోతున్నాడు" సుందరమ్మ కుమిలి పోసాగింది

కళ్యాణికి కడుపులో దేవినట్టయింది హృదయం భారమైంది.

కాస్సేపు నిశ్శబ్దం ఆ గదిలో పిశాచ నృత్యం చేసింది.

"ఇంతకుముందే కళ్లుమూసి పడుకున్నాడమ్మా — ఈ రెండురోజులూ నీ గురించే అడిగాడు—ఈవేళ మీ యింటికి వస్తానని అన్నాడు కదూ ! — మీ యింటికి రాలేనందుకు చాల బాధపడ్డాడు "

రాఘవయ్య నిశ్శబ్దాన్ని భంగపరిచాడు.

"ఫరవాలేదు మామయ్యా — ప్రసన్నకి ఒంట్లో బాగుండాలేగానీ మా యింటికి రోజూ రాడూ ? — అన్నట్టు మాధవి ఏది మామయ్యా ?"

"వంటింట్లో ఉందమ్మా !"

కళ్యాణి వంటింట్లోకి వెళ్ళింది అక్కడ మాధవి మోకాలుమీద ముఖం ఆనించి దీర్ఘంగా ఆలోచిస్తూ పీటమీద కూర్చుంది ఆమె ముఖంలో దైన్యం గూడుకట్టుకుని ఉంది. కళ్యాణి రాకను కూడా గమనించినట్టులేదు.

"ఏం మాధవీ ! — బాగున్నావా ?"

కళ్యాణి గొంతువిని మాధవి తలపైకెత్తి చూసింది.

మాధవి కళ్యాణికి ఒక పీటవేసింది కళ్యాణి మోకాళ్ళు ఎత్తిపెట్టి చేతులు రెండూ కాళ్లకుచుట్టి, గడ్డం మోకాలుమీద ఆనించి స్టౌలోని, నీలిమంటలకేసి చూస్తూ కూర్చుంది

ఇద్దరూ అలా కాస్సేపు మౌనంగా కూర్చున్నారు. స్టౌమీది అన్నం తెర్లు తుంటే మాధవి గరిటతో కలుపుతూంది

"అమ్మాయ్ మాధవీ—ప్రసన్న లేచాడు—కాస్త బత్తాయి పళ్ళు రసంతీసి పట్టుకు రావే" సుందరమ్మ లోపలి గదిలోంచి కేకవేసింది

మాధవి లేవబోయింది.

"నువ్వు అన్నం సంగతి చూడు మాధవీ — పళ్లరసం నేను తీస్తానులే— అన్నట్లు పళ్ళు ఎక్కడ ఉన్నాయి ?"

కళ్యాణి వంటింటి నలుమూలలా పరికించింది.



"అదిగో — ఆ ప్లాస్టిక్ బుట్టలో ఉన్నాయి"

కళ్యాణికి చెప్పి మళ్ళీ అన్నం కలపడంలో నిమగ్నమయిపోయింది మాధవి.

కళ్యాణి పళ్లరసం తీసి గ్లాసుతో మధ్య గదిలోకి వచ్చింది

"నీ కెందుకమ్మా శ్రమ" అంటూ సుందరమ్మ కళ్యాణి చేతిలోంచి గ్లాసు అందుకుంది

"ఇందులో శ్రమేం ఉందత్తయ్యా !—"

కళ్యాణి గొంతు వినవచ్చిన దిక్కుగా తలత్రిప్పి చూశాడు ప్రసన్న. కళ్యాణిని చూసిన ప్రసన్న కళ్ళు చీకటి ఆకాశంలో నక్షత్రంలా మిణుకు మిణుకు మని మెరిశాయి ఏదో మాట్లాడబోయాడు.

"ముందు పళ్లరసం త్రాగు బాబూ !"

సుందరమ్మ ప్రసన్న తలను తన తొడమీద పెట్టుకుని నెమ్మదిగా పళ్లరసం త్రాగించింది ఆ దృశ్యం చూసిన కళ్యాణి కళ్ళు చెమ్మగిల్లాయి

ప్రసన్న కళ్యాణిని దగ్గరికి రమ్మన్నట్లు సైగచేశాడు. మాధవి, మంచం దగ్గరగా కుర్చీవేసింది. కళ్యాణి కుర్చీలో కూర్చుంటూ,

"ఇప్పుడెలా ఉంది ప్రసన్నా ?" అనడిగింది.

"జ్వరం తగ్గిపోయింది—చెస్టు పెయిన్ కూడా అంతగా లేదు "

ప్రసన్న నీరసంగా జవాబు చెప్పాడు.

"నువ్వు బాగా రెస్టు తీసుకో ప్రసన్నా ! —పూర్తిగా తగ్గేవరకూ మంచం మీదనుండి కదలొద్దు."

కళ్యాణి పెద్ద ఆరిందాలా సలహాలు యిస్తుంది.

"కళ్యాణీ ! —నామీద నీకు కోపం లేదుకదా ?"

ప్రసన్న ఉన్నట్టుండి కళ్యాణిని ఈ ప్రశ్న అడిగాడు

"నీ మీద నాకు కోపం ఏమిటి ప్రసన్నా ?"

"నువ్వెన్నిసార్లు మీ యింటికి ఆహ్వానించినా రాకుండా బెట్టుచేశాను — ఈవేళ వద్దామని అనుకున్నా రాలేకపోయాను— నన్ను క్షమించు కళ్యాణీ "

ప్రసన్న కన్నీళ్లు పెట్టుకున్నాడు

"ఛఛ — అవేం మాటలు ప్రసన్నా — నీ ఆరోగ్యం బాగోలేదు గాబట్టి రాలేకపోయావు—నువ్వు పూర్తిగా కోలుకున్నాక ప్రతీరోజూ మా యింటికి రాకపోతావా ఏమిటి ?"

"నువ్వు విసుగు పుట్టి రావద్దని అనేదాక వస్తాను కళ్యాణీ "

ప్రసన్న నీరసంగా నవ్వాడు

"కాస్త ఈ మందు త్రాగి పడుకోరా "

సుందరమ్మ, రాఘవయ్య చేతిలోంచి మందుసీసా, మాత్రలు అందుకుంది

ప్రసన్న మాత్రలు వేసుకుని మందు త్రాగి సీసా కళ్యాణి చేతికిచ్చాడు

"అన్నట్లు ఈ రెండురోజులూ మనకి కాలేజీలో ఏమేమి చెప్పారు కళ్యాణీ " నిన్న మనకి ప్రాక్టికల్సున్నాయికదూ !— ఏ ఎక్స్పెరిమెంట్సు చేయించారు ?" అనడిగాడు ప్రసన్న

"చాల్లే— ఇప్పుడు చదువుగొడవెందుకు ? శుభ్రంగా రెస్టు తీసుకో— నేను వ్రాసుకున్న నోట్సు నీకిస్తాను గానీ నువ్వు క్లాసులు పోతాయని కాలేజీకి రావడానికి తయారవ్వొద్దు— నేనిక వెళ్తాను— మళ్ళీ రేపు సాయంత్రం వస్తాను— నువ్వింక రెస్టు తీసుకో— వస్తాను అత్తయ్యా—"

కళ్యాణి లేచి నిలబడింది

"కాస్త ఎంగిలిపడి పోదువుగాని ఉండవే కళ్యాణీ!''

"అవును కళ్యాణీ— భోజనంచేసి వెళ్లకూడదూ'' అంటూ అంగీకారం కోసం ప్రసన్న ముఖంలోకి చూసింది మాధవి.

''ప్రసన్న పూర్తిగా కోలుకున్నాక అందరం కలిసి భోజనం చేద్దాంలే అత్తయ్యా!— వస్తాను అత్తయ్యా!— ప్రసన్నా!— నీ ఆరోగ్యం జాగ్రత్త!! మళ్ళీ రేపు వస్తాను'' అంటూ గది బయటికి వెళ్ళిపోతున్న కళ్యాణి కన్నీటి పొరల్లోంచి ప్రసన్నకు మసగ్గా కనిపించింది.

* * *

ప్రసన్న నెమ్మది నెమ్మదిగా వారంరోజులకు కోలుకున్నాడు. ఈ వారం రోజులూ కళ్యాణి ప్రతిరోజు సాయంత్రం వచ్చి ప్రసన్నను చూసిపోతోంది. అప్పుడప్పుడూ కాలేజీ కూడా ఎగ్గొట్టి ప్రసన్న దగ్గరికి వస్తూంది.

ఆ రోజు రాఘవయ్య ప్రసన్నను పెద్దాసుపత్రికి తీసుకువెళ్లాడు. అక్కడ ఎక్స్‌రే తీయించాడు. రక్తం పరీక్ష చేయించాడు.

డాక్టర్లుచే అని విధాల పరీక్షలూ చేసి ప్రసన్న ఆరోగ్యం బాగానే ఉందని తేల్చారు. రాఘవయ్య తృప్తికోసం కొన్ని టానిక్కులు రాసిచ్చి వాడమన్నారు.

ప్రసన్న మామూలుగా కాలేజీకి వెళ్తున్నాడు. అప్పుడప్పుడూ కళ్యాణీ వాళ్ళింటికి కూడా వెళ్తున్నాడు. కళ్యాణి వాళ్ళింటికి వెళ్లేదారిలోనే చలపతి యిల్లు కూడా. ఎప్పుడైనా చలపతి యింటికి కూడా వెళుతున్నాడు.

ఇంతలో మొదటి యేడు పరీక్షలు దగ్గరపడ్డాయి. పరీక్షలకు ప్రసన్న కళ్యాణి ఇద్దరూ కలిసి తయారవుతున్నారు. రాత్రుళ్ళు కళ్యాణి తన తల్లి తండ్రులతో చెప్పి ప్రసన్న వాళ్ళింట్లోనే పడుకుంటుంది. సుందరమ్మ రాఘవయ్యలు వాళ్ళిద్దరూ రాత్రి చాలా సేపటివరకూ చదవకుండా చూస్తున్నారు. రాత్రుళ్లు ఎక్కువసేపు మేలుకుని ఉంటే మళ్లీ ప్రసన్న ఆరోగ్యంఎక్కడ దెబ్బ తింటుందోనని వాళ్ల భయం.

పరీక్షలయిపోయాయి. ఫలితాలు కూడా వచ్చాయి. కళ్యాణి ప్రసన్నలు పాసయ్యారు. ఇద్దరికీ మంచి మార్కులే వచ్చాయి. మాధవి స్కూలు ఫైనలు పాసయ్యింది. ఈసారి చలపతి కూడా పి. యు. సి. పాసయ్యాడు. ఇంకా కాలేజీలు తెరవడానికి నెలరోజులుంది.

శలవు రోజులు సరదాగానే గడిచిపోతున్నాయి. ప్రసన్న, కళ్యాణి మాధవి

ముగ్గురూ కళ్యాణి వాళ్ళింట్లోగాని లేదా ప్రసన్నవాళ్ళింట్లోగాని రోజూ కలుసుకుని పేకాటో, కారమ్సో ఆడుతూ కాలక్షేపం చేస్తున్నారు. అప్పుడప్పుడూ చలపతి కూడా వీళ్లతో చేరుతున్నాడు

ఈ మధ్యకాలంలో ప్రసన్నకి ఒకటి రెండుసార్లు 'చెస్ట్ పెయిన్' వచ్చింది. రాఘవయ్య చాలమంది డాక్టర్లకు ప్రసన్నను చూపించాడు. ఎవ్వరూ అతనిలోని లోపాన్ని కనిపెట్టలేకపోయారు.

ఆ రోజు—

ప్రసన్న గోడ మేకుకు తగిలించి ఉన్న అద్దంలో తన ముఖాన్ని చూసుకుంటున్నాడు ఇప్పుడు తను బి. యస్సి. రెండవ సంవత్సరంలోకి వచ్చాడు. అయినా తనకు మీసాలూ గడ్డాలూ రాలేదు తను ఆడపిల్లైనా బావుండేది—

ఈ మీసాలూ గడ్డాల బాధ ఉండేదికాదు.

పోనీ గొంతు చూద్దామంటే అదీ అంతే—

తనది ఆడపిల్ల గొంతులా ఉంటుందని అందరూ అంటారు— ఎవరేమంటే తనకేం ?— తనను కళ్యాణి ప్రేమిస్తుంది. కళ్యాణికి తను బావుంటాడు తన కదే చాలు— తను బి యస్సి పాసయిన తరువాత ఉద్యోగంలో చేరతాడు ఆ తరువాత కళ్యాణి తనూ పెళ్లిచేసుకుంటారు !—

అద్దంలో ప్రసన్న ముఖం అందంగా నవ్వింది ! !

మరుక్షణం ప్రసన్నకు తనకు వస్తున్న చెస్ట్ పెయిన్ గుర్తుకు వచ్చింది.

మూడు నాలుగు నెలల క్రితం తనకు వక్షస్థలంమీద రెండు బిళ్లల్లాగ వచ్చాయి మొదట్లో తను వాటిని అంతగా పట్టించుకోలేదు. అవే తగ్గిపోతాయని అనుకున్నాడు. కాని రానురాను అక్కడ నెమ్మదినెమ్మదిగా ఉబ్బెత్తుగా అవి గుండెలమీద పొంగుతున్నాయి. అసలు చెస్ట్ పెయిన్ వాటి వల్లనే వస్తుందేమో!! అంతే కాకుండా తనలో ఇంకా ఏమేమో మార్పులు వస్తున్నట్లు అనుమానం కలుగుతూంది. ఈ డాక్టర్లేమో వీక్ నెస్ వల్ల తనకు 'చెస్ట్ పెయిన్' వస్తుందని అంటున్నారు. అసలు కారణం తన వక్షస్థలంమీద పెరుగుతున్న ఆ మాంసమేనేమో ? ! !—

ప్రసన్న గది తలుపులు లోపలనుండి గడియవేసి చొక్కా విప్పి అద్దంలో తన వక్షస్థలం చూసుకున్నాడు. ఉబ్బెత్తుగా పొంగి ఉన్న ఆ బిళ్లలను చూడగానే అతని గుండె దిగజారిపోయింది

ఈవేళ తను అమ్మకి నాన్నగారికి ఈ విషయం గురించి చెప్పాలి !— మళ్ళీ ఆలస్యం జరిగితే ఏం ప్రమాదం ముంచుకొస్తుందో ?—

ఎవరో తలుపు తట్టారు

ప్రసన్న ఒకసారి అద్దంలో తన ముఖం చూసుకుని చొక్కా తొడుక్కుని తలుపు గడియతీశాడు

గది బయట సుందరమ్మ నిలుచుని ఉంది

"గదిలో తలుపులు బిగించుకుని ఏం చేస్తున్నావురా ?— భోజనం వడ్డిం చేశాను— కాళ్ళు కడుక్కుందువుగాని రా "

ప్రసన్న మౌనంగా బాత్రూమ్ వైపు నడిచాడు

భోజనం అయిన తరువాత మధ్య గదిలోకి వచ్చారు. సుందరమ్మ తమల పాకులు చిలకలు చుట్టి పేపరు చూస్తున్న రాఘవయ్యకి అందిస్తూంది మాధవి ఒక మూలగా కూర్చుని దిండు గలేబుమీద రంగుదారాలతో పూవులు కుడుతుంది

తను చెప్పదలుచుకున్న విషయం ఎలా మొదలుబెట్టాలో అర్థంకాక మౌనంగా ఎదురుగా నిలుచున్న ప్రసన్నను చూచి ఏదో చెప్పడానికి తటపటా యిస్తున్నాడని గ్రహించి

"ఏంవిట్రా ?" అని అడిగాడు రాఘవయ్య.

ముందు సందేహించి మళ్ళీ తను త్వరపడకపోతె ఏం ప్రమాదం సంభ విస్తుందో నన్న భయంచేత ప్రసన్న తన వక్షస్థలంమీద ఉబ్బెత్తుగా పొంగిన బిళ్లల గురించి రాఘవయ్యకు చెప్పాడు

"మరి యిన్నాళ్లూ ఎందుకు చెప్పలేదూ ?'' అంటూ మండిపడ్డాడు రాఘవయ్య.

ప్రసన్న బిక్కమొహం వేశాడు.

"ఉండండీ... వాడికేదో అయి భయంతో చస్తుంటే వాడి భయం తీర్చా ల్సింది పోయి మీరలా వాడిని కసురుకుంటారేం !... ఏదిరా !... ఎక్కడ నీకు గడ్డలు లేచింది ?"

సుందరమ్మ ప్రసన్న చొక్కా విప్పబోయింది.

"అసలేమైందో మమ్మల్ని చూడనిస్తావా లేదా ?"

ప్రసన్న ధోరణి రాఘవయ్యకు విసుగు పుట్టించింది

రాఘవయ్య ఎంత విసుక్కున్నా, సుందరమ్మ ఎంత బ్రతిమాలినా ప్రసన్న వాళ్లకు చూపించలేదు చొక్కా విప్పిచూపించాలంటే ఏదో సిగ్గుగా అనిపించింది.

రాఘవయ్య ప్రసన్నను మంచి డాక్టరు కెవరికైనా చూపించాలని నిశ్చయించుకున్నాడు

మర్నాడు ఆఫీసులో తన స్నేహితుడు ఒకడికి ప్రసన్న గురించి చెప్తూ బాధపడ్డాడు రాఘవయ్య.

"ఎంత బాధపడుతున్నాడో ఏమిటో?— చెస్టుమీద గడ్డలు లేచాయంటాడు— వాడికి ఈ మధ్య వస్తున్న 'చెస్ట్‌పెయిన్' వాటివల్లనేమో అని నా అనుమానం— ఇంతకీ అదేం జబ్బో ఏమో?!— ఒక మంచి డాక్టరుకి చూపించాలి" అన్నాడు రాఘవయ్య బాధను దిగమింగుతూ.

"అయితే చూడు రాఘవయ్యా!— పెద్దాసుపత్రిలో నాకు తెలిసిన డాక్టరు ఒకాయన ఉన్నాడులే, ఆయన పేరు తిరుమలరావు! ఫారిన్ రిటర్న్!!— అతనికి నేను ఒక ఉత్తరం వ్రాసిస్తాను దాన్ని నువ్వు పట్టుకెళ్ళి చూపించావంటే ప్రసన్నను తన స్వంత కొడుకుకంటే ఎక్కువ జాగ్రత్తగా చూసుకుంటాడు" అన్నాడు రాఘవయ్య స్నేహితుడు రామనాధం

రాఘవయ్యలో ఆశ మొలకెత్తింది

"అదేదో త్వరగా యివ్వు రామనాధం!— నీకు పుణ్యం ఉంటుంది" అన్నాడు హీనస్వరంతో.

రామనాధం తిరుమలరావుకి ఉత్తరం రాసి రాఘవయ్యకు ఇచ్చాడు. ఆ రోజంతా రాఘవయ్యకు ఆఫీసు పనిమీద దృష్టిపోలేదు ఎప్పుడెప్పుడు తిరుమలరావుని కలుసుకుందామా అని ఆత్రంగా ఉంది ఆ మర్నాడు ప్రసన్నను పెద్దాసుపత్రికి తీసుకెళ్లడంకోసం ఆఫీసుకి శలవుపెట్టాడు

డాక్టరు తిరుమలరావుకి నమస్కారంపెట్టి ఆయనకు ఎదురుగా కుర్చీలో కూర్చుని రామనాధం రాసిచ్చిన ఉత్తరం ఆయనకు ఇచ్చాడు రాఘవయ్య. ప్రసన్న ఒక ప్రక్కగా నిలుచుని దిక్కులు చూస్తున్నాడు

రామనాధం ఉత్తరం చదివిన తిరుమలరావు చాల ఆత్మీయత ప్రదర్శించాడు

రాఘవయ్య ప్రసన్న చెస్ట్‌పెయిన్ గురించి, అతని వక్షస్థలం మీద ఉన్న ఉబ్బెత్తుల గురించి చెప్పాడు. తిరుమలరావు ప్రసన్నని చొక్కా విప్పి చూపమన్నాడు ప్రసన్న సందేహించాడు

తిరుమలరావు ప్రసన్నను స్క్రీన్ లోపలికి తీసుకెళ్లి అన్నిరకాల పరీక్షలూ చేసి మంచి మాటలు చెప్పి, కొంత బెదరించి ప్రసన్న చొక్కా విప్పి పరీక్ష చేశాడు.

లోపలనుండి వచ్చిన తిరుమలరావు ముఖంలోకి ఆతృతగా చూశాడు రాఘవయ్య. అతని వెనకాలే చొక్కా బొత్తాములు పెట్టుకుంటూ ప్రసన్న వచ్చి రాఘవయ్య ప్రక్కన నిలబడ్డాడు తిరుమలరావు సిగరెట్టు ముట్టించాడు అతని ముఖ కవళికలనుబట్టి ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్నాడని అనుకున్నాడు రాఘవయ్య. తిరుమలరావు టేబులుమీద బెల్ వాయించాడు

ప్యూన్ వచ్చి అతని ఆజ్ఞ శిరసావహించటానికి సిద్ధంగా నిలుచున్నాడు.

"ఈ అబ్బాయిని బయట బెంచీమీద కూర్చోబెట్టు."

"చిత్తం!— అలాగేనండి!"

ప్యూను ప్రసన్నను బయటికి తీసుకెళ్ళి అక్కడ ఉన్న ఒక బెంచిమీద కూర్చోబెట్టాడు

'ఇంతకీ వాడిలోని డిఫెక్ట్ ఏమిటి డాక్టర్?''

"—వెరీ బాడ్ లక్!!— ఐయామ్ వెరీ సారీ రాఘవయ్యగారూ!— మీకు యిటువంటి వార్త చెప్పవలసి వచ్చినందుకు నేను చాలా బాధపడు తున్నాను," అన్నాడు తిరుమలరావు రాఘవయ్య ముఖంలోకి జాలిగా చూస్తూ

అతని ధోరణి రాఘవయ్యకు అమితంగా కంగారుపెట్టేసింది

"అసలేమైందండీ— వాడిలోని డిఫెక్ట్ ఏమిటి?— ప్రమాదమేమీ లేదు కదా?"

"రాఘవయ్యగారూ!— మీరు ఎక్సైటెడ్ అవకండి— నేను చెప్పేది మీరు జాగ్రత్తగా వినండి!"

తిరుమలరావు, తెల్లబోతూ వింటున్న రాఘవయ్యకు అసలు విషయం చెప్పాడు. రాఘవయ్య అనుమానంగా తిరుమలరావు ముఖంలోకి చూశాడు.

"మీరు నన్ను నమ్మాలి!" అన్నాడు తిరుమలరావు అతని మనసు చదివిన వాడిలా.

''ఏమిటి డాక్టర్?— నాకంతా అయోమయంగా ఉంది— మీరు చెప్పేది నిజమేనా?— అయితే వాడు — ఎం— భగవాన్! ఏమిటీ పరీక్ష!!!''

రాఘవయ్యకు దుఃఖం వచ్చింది కాస్సేపు తనలో తనే కుమిలిపోతూ

కూర్చున్నాడు. తిరుమలరావు శూన్యంలోకి చూస్తున్నాడు ఇటువంటిది అతని సర్వీసులో మొట్టమొదటి కేసు ఇదివరకు ఇటువంటి కేసుల గురించి వినడమే-అదైనా విదేశాల్లో ఎక్కడో జరిగాయి. కాని ఈవేళ అటువంటి కేసు తనకే రావడం చాల చిత్రంగా అనిపించింది అతనికి.

బయట బెంచీమీద కూర్చున్న ప్రసన్న మనసు పరి పరి విధాలపోతుంది డాక్టరు తనను బయటికి పంపించేయడం, లోపల తన తండ్రి, డాక్టరు చాల సేపటినుండి మాట్లాడడం చూస్తుంటే అతని గుండె పీచు పీచుమంటుంది

ప్రసన్న గొంతు తడారిపోయింది. ప్యూనుకి మంచినీళ్లు కావాలన్నట్లు సైగ చేశాడు

"ఇంతకీ యిప్పుడేం చెయ్యాలంటారు?" రాఘవరావు గొంతు పెగుల్చుకుని అడిగాడు

"ఇక్కడ చెయ్యాల్సిందేమీ లేదు— ఆ ఆపరేషను చేయడానికి కావలసిన పరికరాలు ఇక్కడలేవు. మీరు మీ అబ్బాయిని హైదరాబాదు తీసుకెళ్లాల్సిందే —ఎంత త్వరగా తీసుకెళ్తే అంత మంచిది— హైదరాబాదు ఉస్మానియా-హాస్పిటల్‌లో నాకు తెలిసిన డాక్టర్లు చాలమంది ఉన్నారు— వాళ్లలో నాకు బాగా ప్రాణస్నేహితులైనవాళ్లు ఒకరిద్దరికి ఉత్తరాలు రాసిస్తాను— మీరు వెళ్ళి వాళ్లను కలుస్తే మిగతాదంతా వాళ్ళు చూసుకుంటారు— ఏమంటారు?"

"మీ యిష్టం— మీరు చెప్పినట్టే చేస్తాను."

తిరుమలరావిచ్చిన ఉత్తరాలు తీసుకుని అతనికి కృతజ్ఞతలు తెలుపుకుని గదిలోంచి బయటపడ్డాడు రాఘవయ్య బెంచీమీద కూర్చుని అయోమయంగా దిక్కులు చూస్తున్న ప్రసన్నను చూడగానే ఆయనకు దుఃఖం వచ్చింది.

రాఘవయ్య ముఖం చూడగానే ప్రసన్న గుండె నీరైపోయింది జరగకూడనిది ఏదో జరిగింది అనుకున్నాడు

* * *

అంతదూరంనుండే రాఘవయ్య ప్రసన్నల రాకను గమనించి,

"అమ్మా—నాన్నగారు వస్తున్నారే" అంటూ కేకేసింది మాధవి

మాధవి, కళ్యాణి వరండాలో కూర్చుని ఉన్నారు.

మాధవి కేకవిని బయటకు పరుగున వచ్చింది సుందరమ్మ

లోపలికి అడుగు పెట్టీ పెట్టక మునుపే సుందరమ్మ ఆత్రంగా ప్రశ్నల వర్షం కురిపించింది

డాక్టరు గారున్నారా ? — ప్రసన్నని పరీక్షించారా ?? - ఏం అన్నాడు ??? - తగ్గిపోతుందన్నాడా ! – ప్రమాదం ఏమీ లేదుకదా ??"

ఒకసారి ప్రసన్న కళ్యాణి, మాధవిల వంకచూసి,

'మరేం భయపడాల్సిన అవసరంలేదు - తగ్గిపోతుందని అన్నాడు"

రాఘవయ్య కుర్చీలో కూర్చుంటూ అన్నాడు

"హమ్మయ్య - డాక్టరు ఏమంటాడోనని హడలి చస్తున్నాను ఇందాకట్నుంచీ – అయితే మరేం ఫరవాలేదన్నమాట !! - అన్నట్టు యిప్పుడే పోస్టులో మీ చెల్లెలు జానకి దగ్గరనుండి ఉత్తరం వచ్చింది - ఒసే మాధవీ ! - లోపల అలమారులో అత్తయ్య ఉత్తరం పెట్టాను – తీసుకొచ్చి నాన్నగారికివ్వు" అంది.

మాధవి ఉత్తరం తీసుకొచ్చి రాఘవయ్య కిచ్చింది రాఘవయ్య కళ్ళు ఉత్తరంలోని అక్షరాల వెంబడి పరుగెత్తాయి.

ప్రియమైన అన్నయ్యకు,

మీ చెల్లెలు జానకి నమస్కరించి వ్రాయునది ఏమనగా — ఇక్కడ అంతా క్షేమం ! మీరు క్షేమంగానే ఉన్నారని భావిస్తాను.

మీ దగ్గరనుండి ఈ మధ్య బొత్తిగా ఉత్తరాలు రావడంలేదు. నేను నీకంత కానిదాన్ని అయిపోయానా ? — పరీక్షలయ్యాక ఎండాకాలం శలవులకి ప్రసన్నని మాధవిని మా ఊరికి పంపిస్తావని ఆశపడ్డాను. ఇప్పటికైనా మించిపోయింది లేదు. వాళ్లకి శలవులు ఎన్నాళ్ళుంటే అన్నాళ్ళే ఉంటారు —వాళ్లని వెంటనే పంపించు

అన్నట్టు మా కృష్ణకి ఈ నెలలోనే బ్యాంకులో ఉద్యోగం అయింది వాడు వారంరోజులనుండి ఆఫీసుకెళ్ళి వస్తున్నాడు. మీ బావగారు కూడా ఇంటిదగ్గర లేరు కర్నూలు క్యాంప్‌కి వెళ్లారు. ఇంట్లో ఒక్కదాన్ని బిక్కుబిక్కుమంటూ ఉన్నాను కృష్ణకు పెళ్ళిచేసేస్తే కాస్త ఒంటరితనం అయినా పోతుంది. మాధవికి కృష్ణకి ఏడేళ్ల తేడా ఉంది అయినా ఫరవాలేదని నా ఉద్దేశం మీ బావగారికీ నాకూ పదేళ్ల తేడా లేదూ ?—నీ అభిప్రాయం రాయి—నువ్వు సరేనంటే వచ్చే వేసవిలో చేసెయ్యొచ్చు

అసలు ప్రసన్న ఆడపిల్లయి ఉంటే వాడినే మా అబ్బాయికి చేసుకునేదాన్ని...వాడైతే ఈడూ జోడూ చాల చక్కగా ఉండేది ! ఒడ్డూ పొడుగూ

అంతా మా కృష్ణకి చక్కగా సరిపోయేది... నేను మాధవిని చూసి సంవత్సరం అయింది...ఇప్పుడు అదికూడా బాగా ఎదిగి ఉంటుంది...''

అంటూ ఇంకా చాల రాసింది

ఉత్తరం ముగించి రాఘవయ్య నిట్టూర్చాడు

"మీరేమంటారు ?"

సుందరమ్మ రాఘవయ్య ముఖంలోకి చూసింది

"మాకేం అభ్యంతరం లేదని రాస్తాను."

"మా వెంకట్రావు అన్నయ్య కొడుకు రామం ఉన్నాడు కదండీ... వాడుకూడా చాల బుద్ధిమంతుడే !"

సుందరమ్మ పుట్టింటి మమకారం రాఘవయ్యకు అర్థం అయింది

"అసలు ఏ సంబంధం అయినా నచ్చాల్సింది మాధవికి కదా ?— అయినా పెళ్ళి వచ్చే సంవత్సరంలో చేద్దామని అంటుందిగా—అప్పుడే ఆలోచిద్దాం అని రాస్తాను"

"అయితే వచ్చే సంవత్సరం ఈపాటికి మాధవి పెళ్ళికూతురన్నమాట !— వీలైతే ఈలోగానే దీని ముక్కుకు తాడు తగిలించే ఏర్పాట్లు చెయ్యండి మామయ్యా !" అంది వాళ్ళమాటలు విన్న కళ్యాణి మాధవిని మోచేత్తో పొడుస్తూ

మాధవి సిగ్గుపడింది.

"దాని మాటటుంచి ముందు నువ్వెప్పుడు ముక్కుకు తాడు తగిలించుకుంటావే పిల్లా" అంది సుందరమ్మ.

కళ్యాణి తలవొంచుకుని ఓరగా ప్రసన్నవైపు చూస్తూ నవ్వింది.

రాఘవయ్య నిట్టూర్చాడు

"నీకో విషయం చెప్పాలి ! — లోపలికి రా" అన్నాడు రాఘవయ్య సుందరమ్మతో రహస్యంగా

సుందరమ్మ మనసులో కీడును శంకిస్తూ తడబడే అడుగులతో రాఘవయ్య వెనకాల లోపలికి వెళ్ళింది

రాఘవయ్య చెప్పిన విషయం విని నిర్ఘాంతపోయింది సుందరమ్మ. అతను చెప్తున్నది విని అది నిజమా కాదా అని సందేహించింది తను అటువంటిది ఎక్కడా కనీ వినీ ఎరగదు

ఆమె మాతృహృదయం క్షోభించింది

"ఏమండీ—అలా కాకుండా చేయడానికి వీలులేదా ?"

"వీలులేదని డాక్టరు చెప్పాడు — ఇతను మంచి డాక్టరే — కాని ఎంత మంచి డాక్టరైతేమాత్రం ? పొరబాటు పడదని నమ్మకం ఏముంది ?? — ఎట్లాగూ ప్రసన్నని హైదరాబాదుకు తీసుకువెళ్తున్నానుగా — అక్కడి వాళ్ళను కూడా అడిగి తెలుసుకుంటాను — వీలులేకపోతే అంతకంటే ఏమి చేయగలం ?"

"ఏమండీ—వాడి ప్రాణాలకు హాని ఏమీ లేదుకదా ?"

సుందరమ్మ భయపడుతూనే అడిగింది

"అబ్బే—అటువంటి పిచ్చి పిచ్చి భయాలేమీ పెట్టుకోవద్దు — ఈవిషయం నువ్వు ఎవ్వరికీ చెప్పకు — ఇది మనిద్దరి మధ్యనే ఉండాలి — ఆఖరుకి ప్రసన్నకు కూడా తెలియడానికి వీలులేదు — హైదరాబాదు వెళ్ళిన తరువాత అలాకాకుండా వీలౌతుందేమో కనుక్కుంటాను — తరువాత ఎలా జరగాలో అలానే జరుగుతుంది"

రాఘవయ్య బాధను అతి కష్టంమీద దిగమ్రింగుకున్నాడు

సుందరమ్మ రకరకాల సందేహాలతో సతమతమౌతుంది. ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

రాఘవయ్య ఆఫీసుకు రెండువారాలు శెలవుపెట్టి ప్రసన్నను తీసుకుని హైదరాబాదు బయలుదేరాడు స్టేషనుకి కళ్యాణి, మాధవి, సుందరమ్మ కూడా వచ్చారు

* * *

రైలు హైదరాబాదు చేరేసరికి ఉదయం ఏడుగంటలైంది.

హైదరాబాదు నాంపల్లి స్టేషనులో బండిదిగి అక్కడికి దగ్గరగా ఉన్న ఒక హోటలులో గది తీసుకున్నాడు రాఘవయ్య

ఇద్దరూ స్నానంచేసి టిఫిన్ తిని గదికి వచ్చారు ప్రయాణం మూలంగా బాగా బడలికగా ఉంది రైలులో రాత్రంతా నిద్రకూడా లేదు ఇద్దరూ మంచం మీద కాస్సేపు నడుంవాల్చారు ఎవరిమట్టుకువారు రెండవ మనిషి నిద్రపోతున్నాడని అనుకుంటున్నారు ఇద్దరి మనసుల్లో గజిబిజిగా ఆలోచనలు అల్లుకుంటున్నాయి.

రాఘవయ్య, డాక్టరు తిరుమలరావు ఇద్దరూ గదిలో చాలసేపటివరకూ

గుసగుసలాడ. కోపడం తరువాత పాలిపోయిన ముఖంతో రాఘవయ్య బయటకి రావడం మాటి మాటికి గుర్తుకువచ్చి ప్రసన్న భయపడుతున్నాడు.

రాఘవయ్య మనసులో ఏదో చెప్పలేని ఆందోళన ! - డాక్టరు తిరుమలరావు చెప్పిన మాటలు అతని చెవుల్లో గింగురుమంటున్నాయి

అతను చెప్పిన విధంగానే అవుతే? - తరువాత పరిస్థితులు ఎలా ఉంటాయి ? - ప్రసన్న ఇంక పనికివస్తాడా ?? - మరుక్షణంలో అతనికి కళ్యాణి గుర్తుకు వచ్చింది కళ్యాణికి ఈ విషయం తెలుస్తే ? -పాపం ఆ పసి హృదయం ఎంతగా గాయపడుతుందో ? ! -

ఇలా రాఘవయ్య మనసులో సంధనపడసాగాడు

ఇద్దరూ కాస్సేపు మంచంమీద పొర్లాడారు. ఎప్పుడు నిద్రవట్టేసిందో ఇద్దరూ నిద్రపోయారు

రాఘవయ్యకు మెలకువ వచ్చింది. లేచి టేబులుమీద పెట్టిన చేతివాచిలో టైము చూశాడు సరిగ్గా మధ్యాహ్నం పన్నెండైంది

ప్రసన్న వంక చూశాడు - వాడింకా నిద్రపోతున్నాడు.

రాఘవయ్య బట్టలు మార్చుకుని గది తలుపులు దగ్గరగా జారేసి హోటలు రిసెప్షనిస్టు గదివైపు దారితీశాడు

రిసెప్షనిస్టు దగ్గరనుండి సెక్రటేరియట్ ప్లానింగ్ డిపార్టుమెంటులో లక్ష్మణ రావు పనిచేస్తున్న సెక్షనుకు ఫోనుచేశాడు రాఘవయ్య

"ఒరేయ్ - నేనురా" రాఘవయ్య తన చిన్ననాటి స్నేహితుడి గొంతు గుర్తుపట్టి ఉత్సాహంగా అరిచాడు.

"ఎవరూ ? !! "

"నేనురా! - రాఘవయ్యని !!"

"ఒరేయ్ రాఘవయ్యా ! - నువ్వట్రా - ఫోనులో నీ గొంతు గుర్తుపట్టలేక పోయాను - అది సరే - నువ్వు హైదరాబాదు ఎప్పడొచ్చావు ? "

"ఈ వేళే - హౌరా ఎక్స్ప్రెస్‌లో వచ్చాను."

"ఎక్కడుంటున్నావ్?"

" - హోటలులో."

"ఒరేయ్ - నీకేమైనా బుద్ధుందా - నేను ఉన్నానని అనుకున్నావా, చద్దా



నని అనుకున్నావా ! - నేనుండగా నువ్వు హోటలులో దిగాల్సిన ఖర్మేం పట్టింది ! - వెంటనే ఆ హోటలుగది ఖాళీచేసి మా యింటికి రా !"

"ఫరవాలేదులేరా ! -" రాఘవయ్య నీళ్లు నమిలాడు.

"అదేం కుదరదు - నువ్వు మా యింట్లో ఉండాల్సిందే - ఇంతకీ నువ్వు ఒక్కడివే వచ్చావా ? - కూడా ఎవరైనా ఉన్నారా ?"

"అవునురా ! - మావాడి ఆరోగ్యం బాగోలేదు - ఇక్కడ ఉస్మానియా హాస్పిటల్లో పరీక్ష చేయించుదామని వచ్చాను."

"అయితే పనుండే హైదరాబాదు వచ్చావన్నమాట ! - అంతేలే - నాకోసం నువ్వెందుకొస్తావు ? — మీరంతా పెద్దలు."

"అది కాదురా -"

"ఏది కాదు ? - నువ్వు వస్తున్నట్లు ఒక్క ఉత్తరం ముక్క రాశావా ? - పోనీ రాయకపోతే మానేయ్ - మా యింటికి రాకుండా హోటలులో దిగుతావ్ ?"

"నే నే పరిస్థితిలో ఉన్నానో తెలిస్తే నువ్విలా మాట్లాడవు - "

"సరే సరే వంకలకేం ? - ఎన్నైనా చెప్పొచ్చు - ఈవేళ సాయంత్రం ఎక్కడికీ వెళ్ళకు - నేను నీ రూముకు వస్తాను - అక్కడినుండి మా యింటికి వెళ్దాము - అన్నట్టు రూము నెంబరెంత ?"

రిసీవరు క్రెడిల్ మీద పెట్టేసి తిరిగి రూమువైపుకు మళ్ళాడు.

దగ్గరగా ఉన్న తలుపులు తోశాడు. తలుపులు బోర్లా తెరచుకున్నాయి లోపలి దృశ్యం చూసిన రాఘవయ్య హృదయం ద్రవించిపోయింది.

అద్దంముందు నిలుచుని చొక్కా బొత్తాలు విప్పదీసి చూసుకుంటున్నాడు ప్రసన్న. తలుపు తెరిచిన అలికిడి వినగానే కంగారుగా చొక్కా బొత్తాలు పెట్టుకుని వెనక్కి తిరిగి రాఘవయ్య కళ్ళలోని కన్నీళ్ళు చూసి వణికిపోయాడు

సాయంత్రం లక్ష్మణరావు వచ్చాడు. రాఘవయ్యచేత బలవంతంగా రూము ఖాళీ చేయించి ఇద్దర్నీ తన యింటికి తీసుకువెళ్లాడు.

లక్ష్మణరావుకి ముగ్గురు పిల్లలు. ఒక మగపిల్లవాడు. ఇద్దరు ఆడపిల్లలు. మగపిల్లవాడు అందరికంటే చిన్నవాడు. ఆడపిల్లల్లో మొదటి అమ్మాయి ఇందిర- బి.ఏ. చదువుతుంది. రెండవ అమ్మాయి లావణ్య పదోతరగతి, మగ పిల్లవాడు రఘు ఎనిమిదో తరగతి చదువుతున్నారు. లక్ష్మణరావు భార్య జగదాంబ "అన్నయ్యా - అన్నయ్యా" అంటూ కలుపుగోరుతనంగా ఉంటూ చేస్తున్న ఆదరానికి రాఘవయ్య కరిగిపోయాడు. ఆమె ఆతిథ్యానికి తబ్బిబ్బై పోయాడు.

భోజనాలైన తరువాత అందరూ వసారాలో కూర్చున్నారు. లక్ష్మణరావు పిల్లలు కొత్తనేది లేకుండా మాట్లాడేస్తున్నారు. ప్రసన్న బిడియపడుతున్నాడు. ఆడపిల్లలయినా వాళ్ళే సిగ్గుపడకుండా ప్రసన్నతో మాట్లాడుతున్నారు.

లక్ష్మణరావు, రాఘవయ్యలు తమ చిన్ననాటి ముచ్చటలు చెప్పుకుంటున్నారు. మాటల సందర్భంలో ఒకటి రెండుసార్లు లక్ష్మణరావు జగదాంబ ఇద్దరూ ప్రసన్న జబ్బుగురించి తెలుసుకోగోరి అడిగారు. రాఘవయ్య 'అబ్బే - ఏంలేదని' మాట మార్చేశాడు.

చాల రాత్రివరకూ వాళ్ళు అట్లా మాట్లాడుతూ కూర్చున్నారు మిత్రులిద్దరూ ఇంకా తమ చిన్ననాటి మధుర స్మృతులను నెమరు వేసుకుంటున్నారు

జగదాంబ పడకలు ఏర్పాటుచేయడానికని లోపలికి వెళ్ళింది ఆమెతో బాటే

ఇందిర, లావణ్య లోపలికి వెళ్ళారు. రఘు నిద్రకళ్ళతో గోడకు జారబడి కూర్చున్నాడు.

"ఏవండీ ! - చాల రాత్రయింది - ఇంక పడుకోరా యేం ?? " అంది లోపలనుండి వచ్చిన జగదాంబ.

"ఆయన మాటకేం — మాట్లాడే వాళ్లుండాలే గానీ తెల్లార్లూ కూర్చుంటారు - నువ్వు లే అన్నయ్యా ! - ప్రయాణంలో అలసిపోయి ఉంటావు."

"ఉండవే - చాల రోజుల తరువాత కలుసుకున్నాం - మాట్లాడాల్సిన విషయాలు బోలెడన్ని ఉన్నాయి - మమ్మల్నిలా కాస్సేపు మాట్లాడుకోనీయ్" అన్నాడు లక్ష్మణరావు.

"రావయ్యా అల్లుడూ ! - నువ్వు నిద్ర పోదువుగాని" అంది ప్రసన్నను ఉద్దేశించి.

ప్రసన్న రాఘవయ్యవైపు చూశాడు.

"వెళ్ళరా - నిద్రపో " అన్నాడు రాఘవయ్య.

ప్రసన్న జగదాంబవెంట లోపలికి వెళ్ళిపోయాడు.

"రేపు ఆఫీసుకు శలవుపెట్టి నేనుకూడా మీ వెంట హాస్పిటలుకు వస్తానోయ్ !" అన్నాడు లక్ష్మణరావు రాఘవయ్య ముఖంలోకి చూస్తూ.

"ఆ ! - ఎందుకోయ్ నీకు అనవసరమైన శ్రమ !"

"బాగానే ఉంది - ఇందులో శ్రమేం ఉందీ ? - మీ హాస్పిటలు పని అయిపోయిన తరువాత నేను వారంరోజులు శలవు పెట్టి నీతోనే గడపాలని అనుకుంటున్నాను" అన్నాడు.

రాఘవయ్య ఇంతసేపూ ప్రసన్న గురించి దాచాడు. లక్ష్మణరావు తనకి ప్రాణస్నేహితుడైనా ఆ విషయం చెప్పలేదు. ఇప్పుడెలాగూ అతనికి ఈ విషయం తెలియక మానదు. అతనంతట అతనే తెలుసుకునే ముందు తను ఆ విషయం చెప్పడం మంచిదని అనుకున్నాడు.

ప్రసన్న గురించి రాఘవయ్య చెప్పిన విషయాలు విని లక్ష్మణరావు నిర్ఘాంత పోయాడు.

* * *

మర్నాడు భోజనంచేసి ప్రసన్నను తీసుకుని రాఘవయ్య, లక్ష్మణరావులు ఉస్మానియా హాస్పిటలుకు వెళ్ళారు

డాక్టరు తిరుమలరావు కలుసుకోమన్న డాక్టరును కలుసుకున్నారు అతని

పేరు సోమసుందరం. చాల మంచి అనుభవజ్ఞుడు. విదేశాలవి తిరిగి వచ్చాడు. అతను వేరే డాక్టర్లు లాభంలేదని వదిలేసిన కేసులను చాలవాటిని తను చేపట్టి చచ్చిపోతారనుకున్న పేషంట్సుని అందరూ ఆశ్చర్యపడేవిధంగా బ్రతికించాడు.

డాక్టరు సోమసుందరం ముగ్గురినీ సాదరంగా ఆహ్వానించి కూర్చో బెట్టాడు.

''ఈ ఉత్తరం డాక్టరు తిరుమలరావుగారు మీకిమ్మన్నారండీ.''

రాఘవయ్య తిరుమల రావిచ్చిన ఉత్తరం సోమసుందరానికి ఇచ్చాడు.

ఉత్తరం చదివి ప్రసన్నవంక మెరిసే కళ్ళతో చూశాడు.

"వెరీ గుడ్ !" - ఇంతవరకూ నేను రకరకాల ఆపరేషన్లు కోకొల్లలుగా చేశాను. కాని యిటువంటి ఆపరేషను ఒక్కటి కూడా తగల్లేదు. అసలిటువంటి కేసులు తగలడానికి ఎక్కడైనా ఉంటే కదా !" అన్నాడు.

ఆపరేషను చేసిన ఘనత తనే పొంది ఇంకా కీర్తిని సంపాదించవచ్చునని అతని ఆశ.

తమ బాధ అతనికి ఆనందం కల్గించడంచూసి వైరాగ్యంగా నవ్వుకున్నాడు రాఘవయ్య.

''మీరేం భయపడాల్సిన పనిలేదు - ఆపరేషనేమీ ప్రమాదకరమైనదికాదు. చాల సింపుల్'' అన్నాడు రాఘవయ్యతో డాక్టరు సోమసుందరం.

"మా వాడు మారిపోకుండా ఏదైనా ఆపరేషను చేయడానికి వీలుకుదర దాండీ ?" గాద్గదిక స్వరంతో ప్రశ్నించాడు రాఘవయ్య.

"అబ్బే — అదేం లాభంలేదండీ - మా తిరుమల్ పూర్తిగా పరీక్షచేసి ఆ రిపోర్టంతా నాకు రాశాడు. వాడు పరీక్షచేసినా నేను చేసినా ఒకటే !"

"మీరు కూడా ఒకసారి పరీక్షచేసి వీలౌతుందేమో - '' అంటూ నీళ్ళు నమిలాడు రాఘవయ్య.

"ఓ.కే. - దానిదేముంది.''

ప్రసన్నవైపు చూసి ''రా అబ్బాయ్ - " అంటూ లోపలికి తీసుకెళ్ళాడు సోమసుందరం.

ఒకపావుగంట తరువాత ఇద్దరూ బయటికి వచ్చారు రాఘవయ్య ఆతృతగా డాక్టరు ముఖంలోకి చూశాడు

"సారీ రాఘవయ్యగారూ ! — మీ అబ్బాయి మారిపోకుండా ఆపడం అసాధ్యం."

జేబురుమాలుతో ముఖంమీది స్వేదబిందువులు అద్దుకుంటూ కుర్చీలో కూర్చున్నాడు సోమసుందరం.

రాఘవయ్య ముఖంలో నిరాశా, చీకట్లు ఆవరించాయి.

"అంతేకాకుండా మనం అటువంటి ప్రయత్నమేదైనా చేస్తే మీ అబ్బాయి అటు ఆడ ఇటు మగకి మధ్యలో ఉండిపోయే ప్రమాదం కూడా ఉంది - అలా జరగడం మీ కిష్టమేనా ?"

రాఘవయ్య ముఖంలోకి సూటిగా చూస్తూ ప్రశ్నించాడు డాక్టరు,

రాఘవయ్య నీరసంగా లేదన్నట్లు తలత్రిప్పాడు. ప్రసన్నకి అంతా గందర గోళంగా ఉంది ఏదో కొంచెం అర్థం అయీ కానట్టు ఉంది.

"మీరు ఈ రోజే మీ అబ్బాయిని ఇక్కడ జాయిన్ చెయ్యండి - ఒకటి రెండురోజుల్లో ఆపరేషను మొదలుపెడ్తాము."

రాఘవయ్య ముఖంలోని భావాలను గమనించి,

"ఏం ? సందేహిస్తున్నారా ??" అంటూ ప్రశ్నించాడు సోమసుందరం.

"అబ్బే - అదేం లేదండీ ! - ఆపరేషను అయిన తరువాత మా అబ్బాయి పూర్తిగా ఆడపిల్లయిపోతాడా ?"

"అవును."

చిత్రంగా రాఘవయ్య ముఖంలోకి చూశాడు డాక్టరు సోమసుందరం. రాఘవయ్యకు ఆ సందేహం ఎందుకొచ్చిందో ఆయనకు అర్థంకాలేదు.

ప్రసన్నకి యిప్పుడు పూర్తిగా పరిస్థితి అర్థం అయింది. శరీరంలోని రక్తం అంతా మెదడులోకి ప్రవహించినట్టనిపించింది. మనసునిండా ఏవేవో గజిబిజిగా ఆలోచనలు ముసురుకుంటున్నాయి.

"అంటే నా ఉద్దేశం — మా వాడు ఆడపిల్లగా మారి దాంపత్య సుఖాన్ని పొందగలడంటారా ?"

భయాన్నంతా తన ప్రశ్నలో నింపి ఆతృతగా డాక్టరు ముఖంలోకి చూశాడు రాఘవయ్య.

"ఓహ్ - అదా మీ భయం ? - ఇందులో మీరు భయపడాల్సిన దేమీ లేదు - మీ వాడు నిక్షేపంగా పెళ్ళిచేసుకుని గంపెడు సంతానాన్ని కనవచ్చు" అన్నాడు సోమసుందరం నవ్వేస్తూ.

ప్రసన్న గుండె ఝల్లుమంది అతనికి ఒక్కసారిగా కాలేజీలో తోటి విద్యార్థులందరూ తనమీద విసిరిన కామెంట్సన్నీ గుర్తుకు వచ్చాయి అవన్నీ యీనాడు నిజం కాబోతున్నాయి

ఈనాడు తను ఒకబ్బాయిని పెళ్ళిచేసుకోవాలి

వెంటనే అతనికి కళ్యాణి గుర్తుకువచ్చి ముఖం పాలిపోయింది

"మేము మిమ్మల్నే నమ్ముకున్నామండీ— మమ్మల్ని గట్టెక్కించే భారం మీదే" అన్నాడు రాఘవయ్య అమిత దీనంగా

"నో నో— మీరు అంతగా భయపడాల్సిన పనేమీ లేదండీ

—ఒక విధంగా మీరు చాల అదృష్టవంతులు మీవాడు మగపిల్లవాడు కావడం నిజంగా మీ అదృష్టం- ఈ మార్పే గనక ఆడపిల్లకి సంభవిస్తే బాధ పడవలసి వచ్చేది ; ;"

"అలా ఎందుచేతనండీ?"

లక్ష్మణరావు కుతూహలంగా డాక్టరునుండి సమాధానం ఆశిస్తూ చూశాడు

"ఒకబ్బాయి అమ్మాయిగా మారిన తరువాత అతను పూర్తిగా ఆడదానిగా జీవించవచ్చు అదే ఒకమ్మాయి అబ్బాయిగా మారడం సంభవించినప్పుడు ఆమె చూపులకు మాత్రం మగవాడిలా ఉంటుంది కాని ఆమె మగవాడిగా దాంపత్య జీవితానికి పనికిరాదు " అన్నాడు

ప్రసన్నకి బదులు మాధవికి ఈ విధమైన మార్పు సంభవించనందుకు ఒకవిధంగా తను అదృష్టవంతుడిగానే భావించాడు రాఘవయ్య

"మరి ఆపరేషను సులభంగానే జరిగిపోతుంది కదండీ?'

సోమసుందరం ఎంత సర్దిచెప్పినా రాఘవయ్య మనసులోంచి భయం తొలగి పోవడంలేదు

"ఆపరేషను ప్రమాదకరమైనదేమీకాదు... చాల సింపుల్ కూడా... మగ వాడి శరీరంలోంచి యాండ్రోజన్స్ (మేల్ హార్మోన్స్) తీసివేసి, టెస్టిస్, ఎడ్రినల్ కార్టెస్ (ఆర్గాన్స్) ప్రొడ్యూస్‌చేసి వాటిని ఎస్ట్రోజన్స్— అంటే ఫిమేల్ హార్మోన్స్‌తో ట్రీట్ చెయ్యాలి - అంతే!— అసలు మీవాడికి ఆపరేషను చేయాల్సిన పని ఉండేది కాదు — ఎందుచేతనో మీవాడు ఆడపిల్లగా మారు తూండగా మధ్యలో ఆ మార్పు ఆగిపోయింది ఆ మార్పు కంటిన్యూ అవ్వడం కోసం ఈ ఆపరేషను చెయ్యాల్సి వచ్చింది మీ అబ్బాయిది నాచురల్

ఛేంజ్— సాధారణంగా ఈ నాచురల్ ఛేంజ్ ఆఫ్ సెక్స్ యవ్వనారంభంలో సంభవిస్తుంది— ఆర్టిఫిషియల్‌గా కూడా ఒక మగవాడు ఆడదానిగా ఆపరేషన్ ద్వారా మారవచ్చు కాని అది చట్ట విరుద్ధం" అన్నాడు సోమసుందరం

సోమసుందరం రాఘవయ్యకు ధైర్యం చెప్పి ప్రసన్నకు హాస్పిటలులో స్పెషలు వార్డులో జాయిన్ చేయించాడు లక్ష్మణరావు రాఘవయ్యలు ప్రసన్నకు ధైర్యం చెప్పారు

ఈ వార్త హాస్పిటలు మొత్తం ప్రాకింది రాఘవయ్య లక్ష్మణరావులున్న ఆ కొద్ది సేపటిలోనే చాలమంది ప్రసన్న ఉన్న ఆ స్పెషల్ వార్డులోకి చూడటానికి వచ్చారు పెద్ద పెద్ద డాక్టర్లందరూవచ్చి ప్రసన్నను పరీక్షచేసి రకరకాల ప్రశ్నలు వేసి వెళ్లిపోతున్నారు ప్రసన్నకు వాళ్లందరివంకా చూడాలంటే ఏదో భయంగా ఉంది. వాళ్లమీద చెప్పలేని కోపం కూడా పుడుతుంది తన మానాన తను మౌనంగా తల వంచుకుని మౌనంగా మంచంమీద కూర్చున్నాడు

కాస్సేపయిన తరువాత రాఘవయ్య, లక్ష్మణరావులు యింటికి వెళ్ళిపోయారు

ఆ మర్నాడు రాఘవయ్య ఒక్కడే ప్రసన్నకోసం భోజనం తీసుకుని హాస్పిటలుకు వచ్చాడు. లక్ష్మణరావు ఆవేళ ఆఫీసుకు వెళ్లిపోయాడు.

రాఘవయ్య హాస్పిటలుకు వచ్చే సమయానికి ప్రసన్న చుట్టూ పెద్ద పెద్ద డాక్టర్లు, కొందరు పత్రికా విలేఖరులూ ఇంకా వైద్య విద్యార్థులూ చాలమంది ఉన్నారు అందరూ ప్రసన్నను ఏవేవో ప్రశ్నలు వేస్తూనే ఉన్నారు ఈ పత్రికా విలేఖరులైతే సరే సరి

సాయంత్రం పూట ఆఫీసునుండి తిన్నగా హాస్పిటలుకే వచ్చాడు లక్ష్మణరావు చీకటిపడేవరకూ లక్ష్మణరావూ, రాఘవయ్యలు ఆ మాటా ఈ మాటా మాట్లాడుకున్నారు

రాఘవయ్య ప్రసన్నకు నచ్చజెప్పి తాను కూడా లక్ష్మణరావు వెంబడి యింటికి వెళ్లిపోయాడు ఉదయంనుండి చాల రాత్రివరకూ ప్రసన్న దగ్గరికి వాళ్లూ వీళ్లూ వస్తూ పోతూనే ఉన్నారు డాక్టరు సోమసుందరం ఎవరెవరినో తీసుకువచ్చి ప్రసన్నను చూపిస్తున్నాడు

రాత్రి పదిగంటలైంది అప్పటికి ప్రసన్న ... దగ్గరికి వచ్చే జనాభా పూర్తిగా తగ్గిపోయింది ఆసుపత్రిని నిశ్శబ్దం నిశ్శబ్దంగా ఆవరించింది అప్పు

తప్పుడూ నైట్ డ్యూటీ నర్సుల బూట్లచప్పుడు, మధ్య మధ్య రోగుల మూలు గులు తప్ప మరే యితర శబ్దమూ వినిపించడంలేదు

ప్రసన్నకు నిద్రపట్టడంలేదు అతని మనసునిండా ఎన్నో రకాల ఆలోచనలు సుడులు తిరుగుతున్నాయి

రేపే తనకు ఆపరేషను జరిగేది!— రేపటినుండి తను ఆడపిల్లగా చలామణి అవుతాడు కాలేజీలో తోటి విద్యార్థులన్నట్టుగా తను ఆడపిల్లగా మారిన తరువాత నిజంగా చాల అందంగా ఉంటాడా? అప్పుడు కాలేజి బ్యూటీ తనేనేమో?— నీలిమను ఎవ్వరూ కాలేజీ బ్యూటీ అని అనరు- పాపం! తను గోల పెట్టేస్తుంది ఇన్నాళ్లూ ఆమె చుట్టూ తిరిగే వాళ్లందరూ ఇకనుండి తన చుట్టూ తిరుగుతారు.

తన పెళ్లి గురించి నాన్నగారు అంత బాధపడాల్సిన పనిలేదు తన అందం చూసి ఎవరైనా వివాహం చేసుకోవడానికి ముందుకు వస్తారు తను కళ్యాణిని తప్ప ఎవరినీ చేసుకోనని నాన్నగారికి చెప్పేస్తాడు

తేలికగా ఊపిరి పీల్చుకుని గుండెలమీద చెయ్యి వేసుకున్నాడు ప్రసన్న

హఠాత్తుగా ప్రసన్నకు తన ఆలోచనలోని పొరపాటు ఏమిటో తెలిసింది

అన్నట్టు తను కళ్యాణిని ఎలా వివాహమాడగలడు? తను కూడా ఆడపిల్లైపోతున్నప్పుడు ఇదెలా సాధ్యం??— కళ్యాణికి తనకు వివాహం జరగదు!!—

వివాహం జరగదు!!!—

కళ్యాణి వేరే ఎవరితో వివాహం చేసుకుంటుంది పిల్లల్ని కంటుంది అప్పుడు తను వాళ్లింటికి వెళ్తే ఆమె సరిగ్గా మాట్లాడనే మాట్లాడదు తన పిల్లల్ని ఆడించడంలోనో, యింటి పనిలోనో నిమగ్నమై ఉంటుంది ఒకవేళ మాట్లాడినా తన భర్త గురించే చెప్తుంది అప్పుడు తను భరించగలడా?— తన హృదయం ముక్కలైపోదూ??—

ఆలోచనలతో ప్రసన్న బుర్ర వేడెక్కిపోయింది కళ్యాణి తనకు దూరం అవుతుందన్న ఆలోచన అతన్ని కృంగదీస్తుంది

ప్రసన్న కళ్లనుండి అశ్రువులు స్రవించి తలగడను తడిపేశాయి. ఎప్పుడో అర్ధరాత్రి మగతగా నిద్ర పట్టింది

మర్నాడు ఉదయమే సోమసుందరం వచ్చి ప్రసన్నకు ధైర్యం చెప్పి వెళ్ళిపోయాడు ఆ రోజు మధ్యాహ్నమే ప్రసన్నకు ఆపరేషను జరుగుతుంది ఆ

వార్డులోని నర్సు ప్రసన్న దగ్గరికి పరుగెత్తుకు వచ్చి చేతిలోని న్యూసు పేపరు అందించింది

అందులో ప్రసన్న గురించి పెద్ద పెద్ద అక్షరాలతో అతని ఫొటోతో సహా పడింది

అందులోని విషయాలు చదువుకుని వైరాగ్యంగా నవ్వుకున్నాడు ప్రసన్న. ఆ వార్డులోని వారందరి కళ్ళూ ప్రసన్ననే గమనిస్తున్నాయి వాళ్ళందరికీ విసుగుపుట్టకుండా కాలం గడిచిపోయేందుకు ప్రసన్న ఉపయోగపడుతున్నాడు.

కాస్సేపయిన తరువాత రాఘవయ్య, లక్ష్మణరావులు వచ్చారు లక్ష్మణరావు ఆవేళ ఆఫీసుకు శలవుపెట్టాడు కూడా జగదాంబ, ఇందిర, లావణ్యలు కూడా వచ్చారు

"నిన్ను చూడాలని వచ్చారోయ్ వీళ్ళంతా" అన్నాడు లక్ష్మణరావు నవ్వుతూ

అతని నవ్వు రాఘవయ్యకు బాధను కలిగించింది

ప్రసన్న ఏమీ సమాధానం చెప్పకుండా తలవంచుకుని కూర్చున్నాడు. వాళ్ళ ముఖాల్లోకి చూడాలంటేనే అదోవిధంగా ఉంది వాళ్ళవంక చూస్తే అపహాస్యంతో కూడుకున్న వాళ్ళ నవ్వును ఎక్కడ చూడాల్సివస్తుందోనని అతని భయం.

''అమ్మాయి కాకముందే అతనికి ఎంత సిగ్గో ? ! "

ఇందిర నవ్వింది లావణ్య ఇందిర నవ్వుతో శృతికలిపింది.

హాస్పిటలులోని మిగతా రోగులూ, రోగుల్ని చూడటానికి వచ్చిన విజిటర్లూ, వేరే వార్డులలోని నర్సులూ, డాక్టర్లూ అందరూ ప్రసన్నను చూడటానికి వస్తున్నారు. పేపర్లో వార్తచదివిన వాళ్లకూడా చాలమంది ప్రసన్నను చూడటానికి తయారయ్యారు. వీళ్లకాక పత్రికా విలేఖరులూ, ఫొటోగ్రాఫర్లూ అందరూ తయారయ్యారు

డాక్టరు సోమసుందరం ఎవ్వరూ ప్రసన్నను చూడటానికి ఒప్పుకోలేదు. ఆపరేషను ముందు అతనికి రెస్టు యివ్వడం, మనసును ప్రశాంతంగా ఉంచడం చాల అవసరం అని అందర్నీ పంపించేశాడు రాఘవయ్య, లక్ష్మణరావు తదితరులు కూడా ప్రసన్నతో మాట్లాడడానికి వీలులేదని, వాళ్ళింక వెళ్ళిపోవలసిందనీ కోరాడు జగదాంబ, లావణ్య, ఇందిరలు యింటికి వెళ్ళిపోయారు.

ప్రసన్నను ఆపరేషను థియేటరులోకి తీసుకెళ్ళారు మంచి అనుభవజ్ఞులుగా పేరుపొందిన పెద్ద పెద్ద డాక్టర్లు పదిమందివరకూ లోపలికి వెళ్లారు హాస్పిటలులో ఎక్కడలేని హడావిడంతా ఆ గదిముందే ఉంది

రాఘవయ్య, లక్ష్మణరావులు ఆపరేషను థియేటరు బయట బెంచిమీద కూర్చున్నారు అక్కడ వీళ్ళిద్దరూకాక ఇంకా చాలమంది ఉన్నారు అందరికీ ఆత్రంగా ఉంటే రాఘవయ్యకు మాత్రం ఆందోళనగా ఉంది

రాఘవయ్య మనసు మనసులో లేదు, అతని మనసులో ఎన్నో ఆలోచనలు ! - ఏదో చెప్పలేని ఆందోళన అతని ఆలోచనలన్నీ ప్రసన్న ఆడపిల్లగా మారిన తరువాత పరిస్థితులు ఎలా ఉంటాయన్నదాని గురించే !

ప్రసన్నకు కళ్యాణితో వివాహం జరిపించాలని తను అభిప్రాయపడ్డాడు కళ్యాణి ప్రసన్నను అమితంగా కోరుకుంటుంది ప్రసన్నకూడా కళ్యాణంటే చాల యిష్టపడతాడు కళ్యాణి తనకు దూరమౌతుందని తెలిసి వాడు చాల కృంగిపోతాడు — తనకు తెలుసు - వాడిది చాల సున్నితమైన మనసు ! ఈ దెబ్బ తట్టుకోగలడా ? - కళ్యాణి కూడా చాల బాధపడుతుంది కాని తన చేతిలో ఏముంది ? - విధి అంతా తారుమారుచేసింది - యిటువంటి పరిస్థితి తను కలలోనైనా ఊహించాడా : - ఇంకా తను కలవరపడి లాభం ఏమీ లేదు - కనులముందు జరిగేదాన్ని చూస్తూ కూర్చోడమే తను చేయగలపని.

రాఘవయ్య నిట్టూర్చాడు లక్ష్మణరావు రాఘవయ్య భుజం తట్టాడు

డాక్టరు సోమసుందరం అలసిపోయిన ముఖంతో బయటికి వచ్చాడు. అతన్ని చూసిన రాఘవయ్య బెంచీమీదనుండి గబుక్కున లేచి ఆత్రంగా,

"డాక్టర్ ?" అన్నాడు

"ఆపరేషన్ సక్సెస్ — ఇక మీరు నిశ్చింతగా ఉండవచ్చు" అన్నాడు సోమసుందరం

ప్రసన్నకుమార్ ప్రసన్నకుమారిగా మారిపోయాడు !

ఆ క్షణంనుండి అతను అబ్బాయికాడు - అమ్మాయి !!

ప్రెస్ రిపోర్టర్సు, మెడికల్ స్టూడెంట్సు, హాస్పిటలులోని మిగతా జనం ప్రసన్నకుమారిని చూడడానికి ఎగబడ్డారు సోమసుందరం ప్రసన్నని చూడటానికి ఎవ్వరినీ అనుమతించలేదు

"ఆమెకి ఈ రోజంతా రెస్టు కావాలి - మీరు రేపు ఆమెను చూడవచ్చు" అని అందర్నీ పంపించివేశాడు

ఆ రాత్రి రాఘవయ్య అక్కడే పడుకున్నాడు.

మర్నాడు మళ్ళీ అందరూ హాస్పిటలుకు తయారయ్యారు. వివిధ పత్రికా విలేఖరులు ప్రసన్నకుమారితో ఇంటర్వ్యూ చేశారు

ఆ రోజు సాయంత్రమే ప్రసన్నను డిస్చార్జిచేశారు. రాఘవయ్య, లక్ష్మణ రావు ప్రసన్నలు యింటికి బయలుదేరారు

జగదాంబ, ఇందిర, లావణ్య, రఘు తనను జంతువుని చూస్తున్నట్లు చూస్తుంటే ప్రసన్నకు చాల యిబ్బంది అనిపించింది వాళ్ళ ప్రశ్నలు ప్రసన్నకు చికాకు, కోపం తెప్పించాయి అసలే మొగమాటస్తురాలు గాబట్టి ఏమీ అనలేకపోయింది. ఎవ్వరి మాటకీ సమాధానం లేకుండా మూగదానిలా కూర్చుంది

లావణ్య ప్రసన్నను ఏదో విధంగా మాట్లాడించాలని చూస్తుంది రాఘవయ్య లావణ్యవైపు తీక్షణంగా చూస్తున్నాడు. అతని చూపులను లక్ష్మణరావు గమనించాడు.

"ఏయ్ లావణ్యా - కాస్సేపు నోరుమూసుకో - ఎందుకలా ఆ అబ్బా యిని — సారీ ! - ఆ అమ్మాయిని విసిగిస్తావ్ ?" అంటూ కసురుకున్నాడు లక్ష్మణరావు

చాల సీరియస్‌గానే ఆ మాటలు అనాలని అనుకున్నాడు గానీ అమ్మాయిగా మారిన అబ్బాయిని పిలవడంలో వచ్చిన తడబాటుకి అతనికి నవ్వు వచ్చేసింది.

* * *

అప్పుడే వచ్చిన న్యూస్‌పేపరు మొదటి పేజీలోని హెడ్‌లైన్ చదివి లోపలి పేజీలు తిరగేస్తున్న కళ్యాణి ఆ పేజీ దగ్గర ఆగిపోయింది. ఆమె కనుబొమలు ముడిపడ్డాయి. తను చూస్తున్నది నిజమేనా లేకపోతే తను కల గంటున్నదా ? అనుకుంది పేపరులోని ప్రసన్న ఫొటోని మరొకసారి పరికించి చూసింది.

పైనే పెద్ద పెద్ద అక్షరాలతో ఉన్న హెడ్‌లైన్స్ చదివి నివ్వెరపోయింది. కొద్దిక్షణాలపాటు శిలాప్రతిమలా ఉండిపోయింది కళ్యాణి.

షాక్‌నుండి తేరుకుని మళ్ళీ ఒకసారి పేపర్లోని ప్రసన్న ఫొటోవంక చూసింది కళ్యాణి

సందేహం లేదు ! - నా ప్రసన్నే !! -

గబగబ ఆ వార్తను మొదటి అక్షరంనుండి చివరి అక్షరంవరకూ చదివింది

అంతా చదివిన తరువాత తన కళ్ళముందే తన ఆశాసౌధాలు కూలి పోతున్నట్టూ, తను కన్న కలలు కల్లలై పరిహసిస్తున్నట్లు, ఉదయిస్తున్న చంద్రుడు తనతోబాటు వెన్నెలను తీసుకుని హఠాత్తుగా కొండలమాటున పడి పోయినట్లూ, తిందామని నోటివరకూ తెచ్చిన భక్ష్యం అమలినమైనట్టూ ఫీలయింది కళ్యాణి

"ఏమైందే - అలా కూర్చున్నావ్ ?" అంటూ వచ్చిన పార్వతమ్మ కేకతో ఈ లోకంలో పడింది కళ్యాణి చీర చెరగుతో కళ్ళు వత్తుకుంది

"ఏమైందే ??"

కళ్యాణి కళ్ళలో నీళ్ళుచూసి పార్వతమ్మ కంగారుపడింది.

కళ్యాణి ఏమీ మాట్లాడకుండా పేపరు పార్వతమ్మకు ఇచ్చింది.

పార్వతమ్మ అంతా చదివి,

"ఏవిటీ ! - ఇది నిజమే ?? ! - " అంటూ ఆశ్చర్యపోయిందావిడ

"ఇంకా నయం - అబ్బాయి బుద్ధిమంతుడే - వరవాలేదు - నిన్నిచ్చి చేద్దామని అనుకుంటుంటే - పెళ్ళయ్యాక ఇలా అయ్యుంటే ? - "

కళ్యాణి చేతిలో పేపరు పెట్టి ఆమె ఇంకా ఏమేమో అంటుంది కళ్యాణి మనసు బాధతో మూలిగింది

"ఏవండోయ్ ! - ఈ వార్త విన్నారా ?"

అంటూ పార్వతమ్మ హడావిడిగా లోపలికి వెళ్ళిపోయింది.

కళ్యాణి న్యూస్ పేపరు పట్టుకుని వీధిలో పడింది

బియ్యం ఏరుతున్న సుందరమ్మ అలికిడి విని తలెత్తి చూసింది గుమ్మం దగ్గర పాలిపోయిన ముఖంతో కళ్యాణి నిలుచుని ఉంది

"రా కళ్యాణీ - రా ! - " అంటూ తెచ్చిపెట్టుకున్న నవ్వుతో ఆహ్వానించింది

సుందరమ్మ తనతో ఇన్నాళ్ళూ మాట్లాడుతున్నప్పుడు ఎందుకు తడబడు తుందో, ఆమె ముఖంలో గజిబిజిగా మనసులోని భావాలకు అనుగుణంగా రంగులు క్షణ క్షణం ఎందుకు మారుతున్నాయో కళ్యాణికి అర్థం అయింది. ఆమె పడుతున్న మనోవేదనకు కళ్యాణి కళ్ళు చెమ్మగిల్లాయి.

"ఈవేళ కాలేజీకి వెళ్ళలేదా కళ్యాణీ ?"




"లేదు అత్తయ్యా - వంట్లో బాగోలేదు — మాధవి యింట్లో లేదా ?"

"స్కూలుకు వెళ్ళిపోయింది - అన్నట్టు మా వాళ్ల దగ్గరనుండి ఉత్తరం వచ్చింది - ప్రసన్నకు ఏమీ ఫరవాలేదని రాశారు మీ మామయ్య - అందుచేత నువ్వేం బెంగపడక్కరలేదు - నాకు తెలుసు- నువ్వందుకే వచ్చావు కదూ ?" అంది తెచ్చిపెట్టుకున్న నవ్వుతో.

కాని అది ఆమెకు సాధ్యంకాలేదు బలవంతంగా తెచ్చిపెట్టుకున్న నవ్వువల్ల ఆమె ముఖంలో ఒక వికృతరూపం కదిలింది

కళ్యాణి వైరాగ్యంతో నవ్వింది

కన్నీళ్ళు సుందరమ్మకు కనబడకూడదని ముఖాన్ని ప్రక్కకు తిప్పుకుంది

సుందరమ్మ కళ్యాణి కళ్ళలో ఉబికిన కన్నీళ్ళు చూడనే చూసింది.

"ఏమైంది కళ్యాణీ ? - ఎందుకేడుస్తున్నావ్ ? — ఇప్పుడేమైందని ‹? - ప్రసన్న ఆరోగ్యంగానే ఉన్నాడుగా ?? "

"నిజంగా ఏమీ కాలేదా అత్తయ్యా ?"

కళ్యాణి కళ్ళు వత్తుకుంటూ అడిగింది.

సుందరమ్మ దోషిలా తలవంచుకుంది

"నాకు అంతా తెలుసు అత్తయ్యా ? - "

సుందరమ్మ రివ్వున తలఎత్తి ఆశ్చర్యంగా కళ్యాణి ముఖంలోకి చూసింది

"అయితే మాధవి నీకు చెప్పిందా ?"

తల అడ్డంగా త్రిప్పి చేతిలోని న్యూస్‌పేపరు సుందరమ్మకు యిచ్చింది కళాణ్యి

పేపరులోని ప్రసన్న ఫొటో, దానిక్రింద వార్తచదివిన సుందరమ్మ ముఖం వెలవెలబోయింది

ఇద్దరిమధ్యా నిశ్శబ్దం కాస్సేపు మూలిగింది సుందరమ్మ శూన్యంలోకి చూస్తూ కూర్చుంది. కళ్యాణి తను ఇంతక్రితంవరకూ పెంచుకున్న ఆశలను తలుచుకుంటూ కుమిలిపోతుంది

"ఇంక నేను వెళ్ళొస్తానత్తయ్యా ! - "

కాస్సేపయిన తరువాత హఠాత్తుగా లేచి నిలుచుని అంది కళ్యాణి

సుందరమ్మ జవాబు చెప్పలేదు కళ్యాణి ఒకటి రెండు క్షణాలు సుందరమ్మ వైపుచూసి కాస్త తటపటాయించి వడివడిగా వీధి గుమ్మంవైపు అడుగులు వేసింది

ప్రసన్న యింట్లోంచి వీధిలోకి వచ్చి పదడుగులు వేసిన కళ్యాణికి చలపతి ఎదురయ్యాడు అతనుకూడా ప్రసన్న యింటికే వెళ్తున్నాడు చేతిలో ఆదే న్యూస్‌పేపరు ఉన్నది.

కళ్యాణిని చూసి చలపతి పలకరింపుగా నవ్వాడు. కళ్యాణి పెదవులమీద జీవంలేని ఒక చిరునవ్వు కదిలి మాయమయ్యింది

"ఏమండీ - మీ కీవిషయం తెలుసా ?" అన్నాడు కళ్యాణి తెలుసన్నట్లు తల ఊపింది.

"అరె !! - అయితే మీరుకూడా ఈ వార్త చదివారన్నమాట ?! - చూడండి - ఆడదాని రూపంలో ప్రసన్న ఎంత అందంగా ఉన్నాడో ?!! - సారీ ! - నేను వాడినింకా అబ్బాయిక్రింద జమకట్టే మాట్లాడుతున్నాను - 'ఎంత అందంగా ఉందో ?!' అనాలి కదూ ?" నవ్వుతూ పేపరు మడతలు విప్పి ప్రసన్న ఫొటో చూపించబోయాడు

"అక్కరలేదు లెండి - నేను చూశాను !"

"ప్రసన్న ఊరునుండి ఎప్పుడు వస్తాదో ?" ఛఛ — చూశారా ? - మళ్ళీ అలవాటులో పొరబాటు - ప్రసన్న ఊరునుండి ఎప్పుడు వస్తుందో ఆవిడ చెప్పారా ?"

"లేదు - నేనడగలేదు !"

కళ్యాణికి అతని మాటలు విసుగు పుట్టిస్తున్నాయి ముళ్ళమీద నిలుచున్నట్టు ఫీలవుతుంది

"అయితే నేను అడిగి కనుక్కుంటాను లెండి - నాకుమాత్రం ప్రసన్నను ఎప్పుడెప్పుడు చూద్దామా అని ఉంది — ఆడదానిగా ప్రసన్న చాల అందంగా ఉండి తీరాలి ! - ఏమంటారు ?"

సమాధానంకోసం ఆమె ముఖంలోకి చూశాడు

కళ్యాణి ఏమీ మాట్లాడలేదు ఆమె ముఖం చాల తీవ్రంగా ఉంది. చలపతికి ఇంకేం మాట్లాడాలో తోచలేదు

"మరి నేను వెళ్ళొస్తానండీ "

*   *   *

రైల్లో కిటికీదగ్గర కూర్చుని బయటికి చూస్తుంది ప్రసన్న  కిటికిలోంచి రివ్వున వీచేగాలికి నొసలుమీద వెంట్రుకలు పడి కొట్టుకుంటున్నాయి. తలకు కట్టుకున్న ఎర్రనిగుడ్డ ప్రసన్నకి వింత అందాన్ని చేకూర్చుతుంది

"కిటికీకి కాస్త ఇటు ప్రక్కగా కూర్చో - కంట్లో బొగ్గునలుసులు పడతాయి !!"

ప్రసన్న ప్రక్కనే కూర్చున్న రాఘవయ్య హెచ్చరించాడు అన్యమనస్క అయిన ప్రసన్నకు అతని మాటలు వినిపించలేదు. ఆమె మనసునిండా ఆలోచనలు అడివి తీగెల్లా గజిబిజిగా అల్లుకుంటున్నాయి.

కళ్యాణికి కూడా తెలిసిపోయి ఉంటుంది. కళ్యాణి కూడా తనలానే బాధపడి ఉంటుందా ? - అసలు కళ్యాణి తనను నిజంగానే ప్రేమించిందా ? - ఊరికే చనువుగా ప్రవర్తించిందేమో ? - అలా అయిన పక్షంలో ఆమె బాధపడేందుకు అవకాశం ఏదీ ? - ఇదంతా తన భ్రమేనా ? -

ఛఛ — తనకి సందేహం ఎందుకు కలిగింది ? - తను ఇలా ఆలోచిస్తుందేమిటి ? - కళ్యాణి మనసా వాచా తననే వాంఛిస్తుంది - ఈ వార్త విన్న

కళ్యాణి తనకంటే హెచ్చుగా బాధపడుతుంది కళ్యాణి యిప్పుడు తన దగ్గరికి ఇదివరకటిలా రోజూ వస్తుందో లేదో ?! -

కాలేజీలో కూడా అందరికీ తన విషయం తెలిసిపోయుంటుంది తను అమ్మాయిగా మారితే ఎంతో బావుంటుందని అన్నవాళ్ళంతా నిజంగానే తను ఇలా మారిపోయినందుకు చాల ఆశ్చర్యపడి ఉంటారు అయితే వాళ్ళన్నట్లు ఇప్పుడు కాలేజీ బ్యూటీ తనే నన్నమాట !! - తను ఈ రూపంలో కాలేజీలో మసలగలదా ? - ఇన్నాళ్లూ మగవాడిలా వాళ్ళమధ్యన తిరిగిన తను ఆడ దానిలా తిరగ్గలదా ? -

తనను వేళాకోళం చేయనివాడు ఒక్క చలపతి మాత్రమే - అన్నట్టు చలపతికి కూడా ఈ విషయం తెలిసిపోయుంటుంది — ఇప్పుడు తను చలపతితో ఇదివరకంత చనువుగా ఉండగలదా ? -

ఛఛ — తనవన్నీ పిచ్చి సందేహాలు. కళ్యాణి తనతో చనువుగా ఉండలేదూ ? - అట్లానే చలపతితో ఇదివరకట్లా తను చనువుగా ఎందుకుండ లేదూ ? -

ఇలా ప్రసన్న మనసులో ఎన్నో ఆలోచనలు, సందేహాలు ముసురు కుంటున్నాయి

కిటికిలోంచి దాటిపోయే టెలిఫోన్ స్తంభాలను, దూరంగా తమలో తాము సుడులు తిరుగుతున్న నీలంరంగు కొండలను చూస్తూ గడ్డంక్రింద చెయ్యిపెట్టు కుంది గడ్డం నున్నగా మెత్తగా తగిలింది

తనిప్పుడు గడ్డాలూ, మీసాలూ రాలేదని బెంగపడాల్సిన అవసరం లేదు !! —

ప్రసన్నకుమారి తనలో తనే నవ్వుకుంది

"ప్రసన్నా ! - మన స్టేషను వచ్చేస్తుంది - ఆ బెడ్డింగు చుట్టేయ్ - " అని రాఘవయ్య సీటుక్రిందఉన్న సూట్ కేసు తీసి సర్దసాగాడు.

స్టేషను సమీపించేకొద్దీ ప్రసన్న గుండెలు వేగంగా కొట్టుకోసాగాయి

రైలు ఆగింది !

సూట్ కేసు, బెడ్డింగుపట్టుకుని కంపార్టుమెంటులోంచి కూలీ దిగాడు వెనకాలే రాఘవయ్య, ప్రసన్న దిగారు.

"ఒరేయ్ ప్రసన్నా - ప్రసన్నా — " అంటూ సుందరమ్మ ప్రసన్నవైపు చేతులు చాచింది

ప్రసన్న పరుగున సుందరమ్మ చేతుల్లోవాలి గుండెలమీద తలవాల్చింది మాధవి గుడ్లప్పజెప్పి చూస్తుంది.

అమ్మాయిగా మారిన తన స్నేహితుడిని ఎలా పలకరించాలో తెలియక తికమకపడుతున్నాడు చలపతి.

కళ్యాణి కూడా అదే అవస్థలో ఉంది. ప్రసన్న తనకు అంత దగ్గరిలో ఉన్నా వారి మధ్యన చాలదూరం ఉన్నట్లు అనిపించింది ప్రసన్న ఎవరో కొత్త మనిషి లానే ఆమెకు అనిపించింది

ప్రసన్న కళ్యాణిని ఎలా పలుకరించాలా అని ఆలోచిస్తుంది - తనకంతా అయోమయంగా ఉంది. తెలిసినవాళ్ల దగ్గర ఆమె యిబ్బందిగా ఫీలవుతుంది - కళ్యాణిని పలుకరించడం మాట అటుంచి ఆమెవైపు చూడటానికే భయం వేస్తుంది.

"బావున్నావా ప్రసన్నా ?"

చివరికి ఎట్లాగో గొంతు పెగుల్చుకొని తనే పలుకరించింది కళ్యాణి

జవాబుగా తలఊపింది ప్రసన్న తనవైపు తెల్లబోయిచూస్తున్న మాధవి వైపు చూసి నవ్వింది.

"ఏరా చలపతీ - బావున్నావా ?'' అని మళ్ళీ తనేదో తప్పుచేసినట్లు నాలుక్కరుచుకుంది.

"సారీ" అంది ప్రసన్న

చలపతి నవ్వాడు

"మరేం ఫరవాలేదు ప్రసన్నా ! - నువ్వు అప్పుడూ స్నేహితుడివే - ఇప్పుడూ స్నేహితుడి క్రిందే లెక్క ! - నువ్వు నన్ను ఎలా పిలిచినా అభ్యంతరం లేదు "

"మనం యింటికి వెళ్ళిన తరువాత మాట్లాడుకోవచ్చు - ముందు బయటికి పదండి "

సూట్ కేసు బెడ్డింగుపట్టుకుని నడుస్తున్న కూలీమీద దృష్టి ఉంచి వాళ్ళను కదలమన్నట్లు చేతులతో సైగచేస్తూ రాఘవయ్య అడుగులు వేశాడు అందరూ రాఘవయ్యను అనుసరించారు

* * *

ఒకవారం రోజులపాటు రాఘవయ్య ఇంటికి వాళ్ళూ వీళ్ళూ వస్తూ పోతూనే ఉన్నారు ప్రసన్నను చూడటంకోసం. ఒకరోజైతే కాలేజీ విద్యార్థులు

విద్యార్థినులు అందరూ కలిసి వచ్చేశారు ప్రసన్న తనింక కాలేజి మానేసినట్టు వాళ్ళందరికీ చెప్పేసింది. ప్రసన్న కాలేజి మానేయడం రాఘవయ్యకు యిష్టంలేదు మారిన రూపంతో తను కాలేజీకి వెళ్ళడానికి మనస్కరించడంలేదని ఆ విషయంలో తననింక బలవంతం చేయవద్దని ప్రసన్న తండ్రిని ప్రాదేయపడింది రాఘవయ్య కాదని అనలేకపోయాడు

సుందరమ్మ కూడా

"ఆ ! – ఆడవాళ్ళకు చదువు తప్పనిసరేంకాదు కదా ?" అనేసింది

క్రొత్తలో సుందరమ్మ ప్రసన్నను సంబోధించడంలో పొరబాట్లు చేసేది "ఒరేయ్" అనో "ఒరేయ్ ప్రసన్నా !'' అనో పిలిచేది "వాడు", "వీడు" అని ప్రసన్న నుద్దేశించి అనేది నెమ్మదిగా ఈ వారంరోజులలో ప్రసన్నను అమ్మాయిగా సంబోధించడం నేర్చుకుంది

మాధవికి కూడా "అక్కయ్యా" అని పిలవాలంటే అదోవిధంగా క్రొత్తగా అనిపించింది.

కళ్యాణిలో ఇదివరకటి చలాకీతనంలేదు ప్రసన్నతో మరీ అంత చనువుగా మసలలేకపోతుంది కాని రోజూ ప్రసన్న యింటికి వస్తూనే ఉంది చలపతి కూడా అప్పుడప్పుడు వస్తూ పోతూ ఉన్నాడు

ప్రసన్న రాఘవయ్యలు హైదరాబాదునుండి వచ్చిన నాలుగురోజులకి జానకి దగ్గరనుండి ఉత్తరం వచ్చింది

"ప్రసన్న అమ్మాయిగా మారిన వార్త పేపర్లో చదివాను ఫోటో కూడా చూశాను. ఫోటోలో ఎంత అందంగా ఉన్నాడనీ ? – ఈ వార్త చదివి నిజంగా నేను నమ్మలేకపోయాను – ప్రసన్న ఆరోగ్యం ఎలా ఉంది ? – మా అందరికీ ఎప్పుడెప్పుడు అక్కడికి వచ్చి ప్రసన్నని చూద్దామా అని ఉంది,"

అంటూ ఏమేమో వ్రాసింది

ఆ ఉత్తరం చదివిన రాఘవయ్యకు కృష్ణ గుర్తుకు వచ్చాడు.

ఒక ఆరునెలలు గడిచిపోయాయి !

ఇప్పుడు ప్రసన్నరూపంలో చాల మార్పు వచ్చింది జడ అల్లుకోడానికి వీలుగా జుట్టు పొడుగ్గాపెరిగింది వక్షస్థలంకూడా ఒక పరిపూర్ణమైన ఆకారాన్ని దిద్దుకుంది.

కళ్యాణి బి యస్సి రెండవయేడు పరీక్షలు రాసింది మాధవి స్కూలు ఫైనలు, చలపతి బి. యస్సి మొదటి సంవత్సరం పరీక్షలు రాశారు

అందరికీ వేసవి శలవులు ఇచ్చేశారు శలవులలో చలపతీ, కళ్యాణీ ప్రసన్న యింటికి రోజూ వచ్చి పేకాడుతూనో, కారమ్స్ ఆడుతూనో కాలక్షేపం చేస్తున్నారు

చలపతి అప్పుడప్పుడూ "నీకు నాలాగ సిగరెట్లు కాల్చే అలవాటు లేదుగానీ లేకపోతే ఆ అలవాటును మానుకోలేకా, అమ్మాయిగా సిగరెట్లు కాల్చనూ లేక అవస్థకు గురి అయ్యుండేదానివి ప్రసన్నా !" అంటుండేవాడు మాటల సందర్భంలో

ప్రసన్న అన్నింటికీ నవ్వే సమాధానంగా యిచ్చేది.

ఆ రోజు ఉదయం రాఘవయ్య వరండాలో కూర్చుని న్యూస్ పేపరు చదువుతున్నాడు సుందరమ్మ లోపల వంటపనిలో ఉంది. మధ్యగదిలో ప్రసన్న జుట్టు చిక్కులు తీస్తూ జడఅల్లుతుంది మాధవి

"సార్ !..."

ఎవరో పిలుస్తే తల ఎత్తిచూశాడు రాఘవయ్య.

వరండా మెట్లమీద నిలబడి ఒకవ్యక్తి ఉన్నాడు అతను కట్టుకున్న తెల్లని బట్టల్లో అతని నల్లని శరీరం మరింత నల్లగా మెరుస్తుంది. పొట్టివెంట్రుకలను పైకి ఎగదోసి నవ్వాడు

రాఘవయ్య తనవంక చూడగానే చేతులెత్తి నమస్కరించి తెల్లని పళ్ళను బయటపెట్టి నవ్వాడు. రాఘవయ్య ప్రతినమస్కారం చేశాడు

"కూర్చోండి !"

తన ఎదురుగా ఉన్న కుర్చీని అతనికి చూపించాడు

"నా పేరు నరసింహమూర్తండి - అందరూ నన్ను 'నరసింహం' అని పిలుస్తారండి - నన్ను బాగా ఎరుగున్నవాళ్ళు 'మూర్తీ !' అని పిలుస్తారండి. చిన్నప్పటినుండీ నాతో కలిసి పెరిగిన నా ప్రాణ స్నేహితులేమో 'నర్సిగా' అని అంటారండీ !!" అన్నాడు అనవసరంగా నవ్వుతూ.

"మీరు వచ్చిన పని ?" అడిగాడు రాఘవయ్య అతను తన దగ్గరికి ఏ పని మీద వచ్చి ఉంటాడో అని ఆలోచిస్తూ

"ప్రతీ ఏడులానే ఈ వేసవిలో కూడా 'ఎగ్జిబిషన్' మన ఊళ్ళో పెడుతున్నారు కదండీ ?!"

"అయితే ఏమంటారు.?"

"మాది బట్టల వ్యాపారమండి - ఈ ఊళ్లో 'మూర్తి అండ్ సన్స్' క్లాత్ షాప్ ఉందే - అది మాదేనండి !!"

తను చెపుతున్నది ఆపి రాఘవయ్య వింటున్నాడో లేదోనని చూశాడు. రాఘవయ్య తల ఊపాడు మధ్యగదిలో ఉన్న ప్రసన్న మాధవిలకు కూడా వాళ్ళ మాటలు వినిపిస్తున్నాయి

"ఎగ్జిబిషన్‌లో మా స్టాల్ ఒకటి పెడుతున్నాము."

"ఆరునెలల క్రితం మీ అబ్బాయి అమ్మాయిగా మారిన వార్తవిని మీ దగ్గరికి వచ్చాను"

రాఘవయ్య చటుక్కున వంగి "మీరింతకూ ఎందుకు వచ్చిందీ నాకు అర్థం కావడంలేదు - దానికి ఎగ్జిబిషన్‌లోని మీ స్టాల్‌కీ సంబంధం ఏమిటి ?" అన్నాడు

నరసింహం కుర్చీలో వెనక్కి జారబడి కాలుమీద కాలువేస్తూ ఊగిస్తూ,

"చాల ఉందండీ" అన్నాడు

తలదువ్వుతున్న మాధవి చేయిపట్టుకుని ఆపి శ్రద్ధగా రాఘవయ్య నరసింహం మధ్య సంభాషణను వినసాగింది ప్రసన్న

"మా చీరలకు ఎడ్వర్టైజుమెంటు క్రింద మీ అబ్బాయిని - క్షమించాలి - అమ్మాయిగా మారిన మీ అబ్బాయిని ఉపయోగించుకోవాలని మా అభిప్రాయం - మీకు డబ్బుకూడా బాగానే చెల్లిస్తాం !"

రాఘవయ్యకు అమితంగా కోపం వచ్చింది

"అంటే ?" చురుగ్గా ప్రశ్నించాడు

"మీరేమీ కోపగించుకోవాల్సిన పనిలేదు రాఘవయ్యగారూ - మా షాప్‌లోని రకరకాల చీరలు రోజుకోరకం చొప్పున మీ అమ్మాయికి కట్టబెట్టి నిలబెడతాం- అమ్మాయిగా మారిన మీ అబ్బాయిని చూడడం కోసమైనా మా స్టాల్ మీదకు జనం ఎగబడతారు "

రాఘవయ్య కోపం కట్టలు త్రెంచుకుంది.

"అంటే మా అమ్మాయిని మీ వ్యాపారాభివృద్ధికోసం ఉపయోగించడం కోసం తలబెట్టారా ? - అందుకు నేను పర్మిషన్ ఇవ్వాలా ? నా దగ్గరికి వచ్చి ఇలా మాట్లాడటానికి మీకు ఎన్ని గుండెలున్నాయి ?"

"మీరు అనవసరంగా ఆవేశపడుతున్నారు రాఘవయ్యగారూ! - మీ సహాయానికి ప్రతిఫలం మీకు డబ్బురూపంలో యిస్తాము - అంతేకాకుండా మా



స్టాల్‌లో మీ అమ్మాయికి విడిగా గది ఏర్పాటుచేసి అమెను చూడటానికి టిక్కెట్టు కూడా పెడతాం ! - ఎగ్జిబిషన్ చూడ్డానికి చుట్టుప్రక్కల గ్రామాల నుండి కొన్ని వేలమంది జనం వస్తారు. చాలమంది టిక్కెట్టు కొనుక్కుని ఈ వింతను చూస్తారు - ఆ వచ్చిన డబ్బులో సగం మీకు ముట్టజెపుతాం -"

రాఘవయ్య కుర్చీలోంచి సర్రున లేచాడు

"యూ ఫూల్ ... గెటవుట్ ! ... మా అమ్మాయిని అడ్డుపెట్టుకుని డబ్బు గడిస్తానంటావా ? ... నా ముందే ఈ మాటలు అనడానికి నీకు ఎన్ని గుండెలురా ? !! ... ఇంకా మాట్లాడేవంటే నీ నాలుక చీరేస్తాను ... తక్షణం నువ్వు బయటికి కదులు..."

రాఘవయ్య చిందులు త్రొక్కుతున్నాడు ఈ గొడవకి సుందరమ్మ, వెనకాలే మాధవి బయటకి వచ్చారు నరసింహం బిక్కచచ్చిపోయాడు

"మళ్ళీ ఒకసారి ఆలోచించుకోండి" అని గొణుక్కుంటున్నట్టుగా అనేసి చరాచరా వీధిలోకి వెళ్ళిపోయాడు

రాఘవయ్య చేతిలోని న్యూస్‌పేపరును కోపంగా విసిరిగొట్టి లోపలికి వెళ్ళిపోయాడు వెళ్తూ వెళ్తూ మధ్యగదిలో వెక్కుతున్న ప్రసన్నను గమనించాడు

సుందరమ్మ నిట్టూర్చి వంటగదిలోకి వెళ్ళిపోయింది మాధవి ప్రసన్న దగ్గర కూర్చుని ఆమెను ఎలా ఓదార్చాలో తెలియక తికమక పడుతుంది

* * *

ఏమీ తోచక మంచంమీద వెల్లకిలాపడుకుని ఏదో నవల చదువుతుంది ప్రసన్న మాధవి రేడియో పెట్టుకుని హిందీపాటలు వింటూ కూర్చుంది సుందరమ్మ మధ్యగదిలో జాకెట్టు కుడుతూంది.

"ఒసేవ్ మాధవీ... జాకెట్టు సగంలో ఉండగానే ఈ రంగుదారం అయి పోయింది... కొట్టుకి వెళ్ళి దారం తెచ్చిపెట్టవూ ?"

సుందరమ్మ ఒక చేతిలో కుడుతున్న జాకెట్టు, మరో చేతిలో సూది పట్టుకుని గదిలోకి వచ్చింది

"ఉండవే... పాటలు అయిపోయిన తరువాత వెళ్లి తెస్తాను" అంది మాధవి.

"మళ్ళీ ఆలస్యం అయితే కళ్యాణీ, చలపతి వస్తారు వాళ్లు వచ్చిన తరువాత నువ్వు కదలవు... పాటలు ఎప్పుడూ ఉండేవే!... తర్వగా లేచి వెళ్లు" అంటూ రేడియో కట్టేసింది సుందరమ్మ

మాధవి విసుక్కుంటూ లేచింది.

"డబ్బులు సూట్‌కేసులో ఉన్నాయి."

"సరేలే "

మాధవి డబ్బులు తీసుకుని బయటకి వెళ్లింది. మాధవి అలా వెళ్లగానే కళ్యాణి ఇలా వచ్చింది.

"రా కళ్యాణీ!... ఏం ఈ వేళ ఇంతాలస్యం అయిందేం ?" సుందరమ్మ కళ్యాణిని లోపలికి తీసుకవచ్చింది

"ఈవేళ మా అమ్మకు ఒంట్లో బాగోలేదు అత్తయ్యా... ఇంట్లో పనంతా చేసుకుని భోజనం చేసేటప్పటికి ఈ సమయం అయింది "

ఇద్దరూ ప్రసన్న ఉన్న గదిలోకి వచ్చారు

తను చదువుతున్న పుస్తకాన్ని మూసి ప్రక్కన పెట్టి "రా కళ్యాణీ... నీ కోసమే ఇందాకట్నుంచీ ఎదురుచూస్తున్నా" అంది ప్రసన్న మంచంమీద నుండి సగం లేస్తూ.

మగవాడిగా ఉన్నప్పుడు ప్రసన్న ఇలా అనలేకపోయింది

కళ్యాణీ, మంచందగ్గరికి వెళ్లి ప్రసన్నకు చేరువగా నిలుచుంది

"మీరు మాట్లాడుకుంటూండండి... నేను ఇప్పుడే వస్తాను" అంటూ సుందరమ్మ లోపలికి వెళ్ళిపోయింది

ప్రసన్న కళ్యాణీం మధ్య నిశ్శబ్దం చోటుచేసుకుంది ఇద్దరూ ఏమీ మాట్లాడకుండా మౌనంగా కూర్చున్నారు. ఇద్దరి మనసుల్లో ఏవేవో భావాలు !!

"ఏమైనా మాట్లాడు కళ్యాణీ!" నిశ్శబ్దాన్ని భరించలేక ఏమైనా మాట్లాడాలని ప్రసన్న ప్రయత్నిస్తుంది

అంతవరకూ గంభీరంగా ప్రవహిస్తున్న నదిలా ఉన్న కళ్యాణి మనస్సు ఒక్కసారి విజృంభించిన అలలతో పొంగిపొరలుతున్న నదిలా తయారయ్యింది

" ఏం మాట్లాడను ప్రసన్నా? ... ఏం మాట్లాడను ?? " అంటూ ఒక్కసారిగా ప్రసన్న భుజంమీద వాలిపోయింది తన రెండు చేతులూ ప్రసన్న మెడచుట్టూ పెనవేసి ప్రసన్న గుండెలమీద తల ఆనించి కన్నీళ్లు కార్చసాగింది ప్రసన్న వక్షస్థలం కన్నీళ్లతో తడిసిపోతుంది ఈ హఠాత్పరిణామానికి ప్రసన్న మనసు అల్లకల్లోలం అయింది

కళ్యాణి ప్రసన్న తలను చేతుల్లోకి తీసుకుని తన గుండెలకేసి అదుముకుంది కళ్యాణి వక్షస్థలం ప్రసన్న ముఖానికి మెత్తగా వెచ్చగా వత్తుకుంటుంది ప్రసన్నలో ఏదో చెప్పలేని భావావేశం చోటుచేసుకుంది ప్రసన్న చేతులు కళ్యాణీ నడుము చుట్టూ బలంగా చుట్టుకున్నాయి. కళ్యాణి చేతి వేళ్ళు ప్రసన్న గుండెల మీదికి ప్రాకేయి కళ్యాణి ప్రసన్న చెక్కిలిమీద ముద్దుపెట్టుకుంది కళ్యాణీ ప్రసన్న ఇద్దరూ ఒకరినొకరు గట్టిగా కౌగలించుకుని అలానే సమాధి అవస్థలో ఉండిపోయారు కొన్ని సంవత్సరాలుగా విరహాగ్నిలో దగ్ధం అయిన ప్రేయసీ ప్రియులు మళ్లీ కలుసుకున్నప్పుడు ఉండే గాఢత్వం వారి కౌగిలిలో ఉంది.

"అమ్మా... ఇదిగోనే రంగుదారం."

"ఆ బల్లమీద పెట్టు... కళ్యాణీ వచ్చింది... ఆ గదిలో ఉంది... వెళ్ళు "

మాధవి సుందరమ్మల మాటలు విని ఈ లోకంలో పడ్డారు వాళ్లిద్దరూ- చటుక్కున కౌగిలిలోంచి విడిపోయి దూర దూరంగా కూర్చున్నారు కళ్యాణి చీర చెరగుతో కళ్ళు వత్తుకుంది

మాధవి గదిలోకి వస్తూనే

"హలో కళ్యాణీ... ఎంతసేపైంది వచ్చి ?... అదేవిటి ఇద్దరూ అలా బుద్ధావతారాల్లా కూర్చున్నారు ?" అంది కళ్లెగురవేస్తూ

"ఇప్పుడే వచ్చాను మాధవీ !''

"ఇక్కడ కూర్చుంటే బోరుకొడుతుంది... రండి... వరండాలోకి వెళ్దాము'' అని కళ్యాణి చేయి పట్టుకుని లాగింది మాధవి

ముగ్గురూ వరండాలోకి వెళ్ళి కూర్చున్నారు ప్రసన్న కళ్యాణి మౌనంగా కూర్చున్నారు మాధవే ఏమేమో వాగుతుంది

"ఏమిటీవేళ మీరిద్దరూ ఇలా ఉన్నారు ?... ఇంతసేపటినుండీ నేను వాగుతూన్నా ఒక మాట కూడా మాట్లాడరేం ?"

మాధవి విచిత్రంగా వారిద్దరివైపూ చూస్తూ కూర్చుంది

ఇంతలో చలపతి వచ్చాడు.

"నేను ఇక ఇంటికి వెళ్తాను "

కళ్యాణి లేచి నిలుచుంది. తను ఆమాట ఎవరితో అందో తనకే తెలియదు చలపతి మాధవి ఆమాట కళ్యాణి అందరికీ కలిపి చెప్పిందని అనుకున్నారు ప్రసన్నేమో కళ్యాని తనతోనే చెప్పిందని అనుకుంది

"అదేవిటి... ఇప్పుడే వచ్చి ఇప్పుడే వెళ్ళిపోతానంటావ్ ?... ఇంకా స్సేపు కూర్చో కళ్యాణీ..." మాధవి కళ్యాణి చేయిపట్టుకుని లాగింది

"లేదు... నేను యింటికి వెళ్లిపోవాలి... మా అమ్మకి ఒంట్లో బాగోలేదు" అని మాధవి చేతిలోని తన చేయిని విడిపించుకుని

"వస్తా" అని చెప్పి ఎవరి సమాధానంకోసమూ ఎదురుచూడకుండా మెట్లు గబగబా దిగి వీధిలోకి వెళ్లిపోయింది కళ్యాణి

* * *

ప్రసన్నకు నిద్రనుండి మెలకువ వచ్చింది మంచంమీదనుండి లేవకుండా కాస్సేపు అలాగే బద్ధకంగా పడుకుంది ఉదయం భోజనంచేసి చలపతి కళ్యాణీంకోసం చాలసేపు ఎదురు చూసింది వాళ్లిద్దరూ రాలేదు

ఆవేళ కళ్యాణితో మంచంమీది సంఘటన గుర్తుకు వచ్చింది ప్రసన్నకు

ఆనాడు అలా సీరియస్‌గా వెళ్లిపోయినదగ్గరనుండీ కళ్యాణి కనపడలేదు కళ్యాణి తన దగ్గరకి వచ్చి వారం రోజులైపోయింది. కారణం ఏమై ఉంటుంది?-

తన ప్రవర్త లో ఏమైనా లోపం ఉందా ?... ఎంత ఆలోచించినా తనకు అంతుబట్టడంలేదు

గోడ గడియారం చూసింది సాయంత్రం నాలుగు గంటలైంది!

పోనీ తనే కళ్యాణి యింటికి వెళ్లి చూస్తే!!

ఈ ఆలోచన రాగానే ప్రసన్న మంచంమీదనుండి క్రిందికి ఉరికింది ఒకసారి బద్ధకంగా ఒళ్ళు విరుచుకుని అద్దంలో తన ప్రతిబింబం చూసుకుంది కళ్లు కాస్త ఎర్రగా ఉన్నాయి ప్రక్కకి ఒత్తిగిలి పడుకున్నప్పుడు తలగడమీద మడతలున్నాయేమో ఎడమ చెంపమీద ఎర్రగా చారలు పడ్డాయి జుట్టంతా రేగిపోయి ఉంది అయినా అద్దంలోని తన ప్రతిబింబం అందంగానే కనబడింది

కొన్నాళ్ల క్రితం - తను అబ్బాయిగా ఉన్నప్పటి సంఘటనలు గుర్తుకు వచ్చి నవ్వుకుంది

అప్పుడు తను మాటి మాటికీ మీసాలూ గడ్డాలూ వస్తున్నాయో లేవో నని అద్దంలో చూచుకునేది ఒక్కొక్కరోజు ఏమీ లేనట్టే అనిపించేది ఒకోరోజైతే మీసాలు కొద్ది కొద్దిగా మొలుస్తున్నట్లు భ్రమ కలిగేది

గోడమేకునుండి అద్దం బయటకు తీసి రెండుచేతుల్లో అద్దాన్ని పట్టుకుని తన అందమైన రూపాన్ని తనివితీరా చూచుకుంది చెంపలమీద జీరాడుతున్న వెంట్రుకలను సరిజేసుకునే నిమిత్తం ఎడమచేత్తో అద్దాన్ని పట్టుకుని కుడిచేత్తో ముంగురులు దిద్దుకునే సమయంలో పొరబాటున చేయిజారి అద్దం క్రిందపడి ఒక మూలనుండి ఇంకొక మూలకు పగిలిపోయింది

ఆ శబ్దం విని సుందరమ్మ పరుగున వచ్చింది

"నిక్షేపంలాంటి అద్దం పగులగొట్టేశావే... నాకు తెలుసు... నువ్వే ఎప్పుడో ఆ అద్దం పగులగొట్టేస్తావని... లేకపోతే ఎప్పుడూ అద్దంలో చూచుకునే పనేనా ?" అంటూ విసుక్కుని క్రిందపడిన అద్దాన్ని తీసి మళ్ళీ మేకుకు తగిలించింది సుందరమ్మ

"అన్నట్లు ఇందాక నువ్వు నిద్రపోతున్నప్పుడు కళ్యాణి వచ్చింది"

"ఆ!.. కళ్యాణి వచ్చిందా ?... మరి నన్ను లేపలేదేం ?... ఇన్నాళ్లూ ఎందుకు రాలేదంట ?" ప్రసన్న కుతూహలంగా ప్రశ్నించింది

"నిన్ను లేపుదామనుకుంటే అదే వద్దంది... తను అర్జంటుగా వెళ్ళిపోవాలనీ- ఇంకా చాలిళ్ళకి శుభలేఖలు యివ్వాలని వెళ్ళిపోయింది"

"శుభలేఖలా — ఎవరి పెళ్లి శుభలేఖలు?" ప్రసన్న మనసు రెపరెప లాడింది

"ఇంకెవరిది కళ్యాణిదే!! పెళ్లికొడుకు డాక్టరంట!- కట్నం ఇరవై అయిదు వేలిస్తున్నారట!! బాగా స్థితిమంతుడేనంట-" సుందరమ్మ ఏమేమో చెప్పుకుపోతుంది

ప్రసన్నకు ఆమె మాటలేమీ వినబడడంలేదు తన కాళ్ల క్రింది భూమి తెరుచుకుని తను లోయలోకి పడిపోతున్నట్లు ఫీలయింది

"మాధవీ!- అలమారులో కళ్యాణి ఇచ్చిన శుభలేఖ ఉంది- ఇలా పట్టుకురా!!" చెప్తున్న విశేషాలు ఆపి కేకవేసి మళ్ళీ చెప్పడం మొదలుబెట్టింది సుందరమ్మ

మాధవి శుభలేఖ ప్రసన్న చేతికి ఇచ్చింది ప్రసన్న శిలాప్రతిమలా నిలుచుని ఉంది ఆమె కళ్లనుండి నీళ్లు చిందాయి సుందరమ్మ తను చెప్తున్నది ఆపి ప్రసన్న ముఖం వైపు చూసింది ఆమె యింతవరకూ ప్రసన్న ముఖంలో మారే రంగులను గమనించలేదు ఇప్పుడు తను చేసిన తప్పేమిటో ఆమె తెలుసుకుంది

"వంట మొదలుబెట్టాలి— వంటింట్లో పనుంది రావే" అంటూ అక్కడినుంచి మాధవిని లాక్కెళ్లిపోయింది సుందరమ్మ

ప్రసన్న కళ్లల్లో యిందాక చిందిన నీళ్లు అలానే ఇంకిపోయాయి బాధను దిగమింగుకోడానికి ప్రయత్నిస్తుంది అంతకంటే ఏంచేస్తుంది? తను కళ్యాణి గురించి కన్న కలలన్నీ గుర్తుకువచ్చి దుఃఖం వెల్లుబుకుతుంది కాని పరిస్థితులకు తల ఒగ్గక తప్పదు

ఆనాడు కళ్యాణి తనను గట్టిగా కౌగలించుకుని కన్నీళ్లు కార్చడం, తనను ముద్దుపెట్టుకోవడం ఇద్దరూ గాఢాలింగనంలో కాస్సేపు ఒళ్లు మరిచిపోవడం ప్రసన్నకు గుర్తుకువచ్చింది పెళ్లి పత్రికను చూడకూడదని అనుకుని బల్లమీద పెట్టేసింది మళ్ళీ కుతూహలం పట్టలేక వణికే చేతులతో తీసి చదివింది కళ్యాణి పెళ్లి ఇంకొక వారంరోజులలోనే జరగబోతుంది

కిటికీలోంచి రివ్వున గాలి వీచి ప్రసన్న చేతిలోని శుభలేఖను ఎగరగొట్టేసింది ప్రసన్నకు ఎదురుగా ఉన్న అద్దంలో ఆమె ముఖం రెండుగా చీలి వికృతంగా ఉంది

* * *

ఆ రోజే కళ్యాణి పెళ్ళి !

రాత్రి తొమ్మిది గంటలైంది పెళ్ళికి రాఘవయ్య, సుందరమ్మ, మాధవి వెళ్లారు ప్రసన్న తనకు ఒంట్లో బాగోలేదని, తను పెళ్ళికి రాలేనని తను రానందుకు కళ్యాణిని క్షమించమని అడగమని వాళ్లతో చెప్పింది ప్రసన్నకి ఒంట్లో బాగుండకపోవడం అబద్ధమని వాళ్ళ ముగ్గురికీ తెలుసు ప్రసన్నను రమ్మని బలవంతం చేయకుండా ముగ్గురూ పెళ్ళికి వెళ్ళిపోయారు

ఆ క్షణంలో ప్రసన్న భయంకరమైన ఆ ఒంటరితనాన్ని భరించలేక పోయింది

ప్రసన్న మనసునిండా ఏవేవో ఆలోచనలు

తనే అమ్మాయిగా మారకుండా ఉండి ఉంటే ?– ఈవేళ కళ్యాణి వేరే వ్యక్తి ప్రక్కన పెళ్లికూతురుగా కూర్చుని ఉండేదికాదు తను చేసిన పాపం ఏమిటి ?–

ఆడదానిగా మారిపోవడమేనా ?

కళ్యాణి మగవాడిగా మారిపోతే ఎంత బావుండేది ?!

మనసులో పెళ్లికూతురు రూపంతో కళ్యాణి వేరే వ్యక్తి ప్రక్కన కూర్చున్నట్లు ఊహించుకుంటూ ప్రసన్న బాధను అనుభవిస్తుంది

ఈ రోజునుండి కళ్యాణి పరాయిసొత్తు ! ఇన్నాళ్లూ కనిపించనైనా కనిపించేది ఇప్పుడు అత్తవారింటికి వెళ్ళిపోతే తనకు ఆమెను చూచి తృప్తిపడే అవకాశం కూడా ఉండదు

ఇలా ఆ రాత్రంతా ఆలోచనలతో కంటిమీద కునుకులేకుండా మంచంమీద పొర్లింది ప్రసన్న

* * *

కళ్యాణి అత్తవారింటికి వెళ్ళిపోయింది మాధవి స్కూల్ఫైనల్ పాసయిపోయి కాలేజీలోకి వెళ్తుంది చలపతికూడా కాలేజీకి వెళుతున్నాడు యిప్పుడు ప్రసన్న ఒక్కర్తె యింట్లో వుంటుంది తన సమయాన్ని పుస్తకాలు చదువుతూనో ఏమైనా కుట్టుకుంటూనో, యింటిపనులేమైనా చేస్తూనో గడుపుతూంది కాలక్రమేణా కళ్యాణి వియోగంనుండి అనుభవిస్తున్న బాధ నెమ్మదినెమ్మదిగా తగ్గుముఖం పట్టింది

చలపతి ప్రసన్నదగ్గరికి అప్పుడప్పుడూ సాయంత్రంపూటగాని లేదా ఆదివారాల్లోనో వస్తున్నాడు

ప్రసన్న యిప్పుడు పరిపూర్ణ యవ్వనవతి అయింది రాఘవయ్య సుందరమ్మలు ప్రసన్నకు త్వరలోనే వివాహం చేయ నిశ్చయించుకున్నారు

రాఘవయ్యకు తన చెల్లెలు జానకి కొడుకు కృష్ణమీద దృష్టివుంది సుందరమ్మకు తన అన్నయ్య వెంకట్రావు కొడుకు రామంమీద ఉంది

"ఏమండీ మన ప్రసన్న విషయం మా అన్నయ్యకు ఉత్తరం రాయకూడదూ?" అంది సుందరమ్మ ఒకరోజు

"జానకి కొడుకు కృష్ణకి ఏం తక్కువైందే వాడైతే ప్రసన్నకి ఈడూ, జోడూ బాగానే వుంటుంది ఏమంటావ్?" అన్నాడు రాఘవయ్య

"ఏ ఒక్కనాడైనా నా మాట విన్నారు గనుకనా? పోనిలెండి మీకెలా యిష్టమైతే అలానే చెయ్యండి మన ప్రసన్నకు నచ్చడం ముఖ్యంగానీ మనకు కాదుకదా" అంది మూతి ముడుచుకుంటూ

సుందరమ్మది త్వరగా సర్దుకుపోయే స్వభావం రాఘవయ్య ప్రసన్నను గురించి జానకికి ఉత్తరం రాశాడు ప్రసన్న అమ్మాయి అయ్యిందే కృష్ణకు జోడీ సరిపోతుందని అన్నావుకదా? ఇప్పుడు అదే జరిగింది ప్రసన్న అమ్మాయిగా ఉన్న ఫోటో కూడా పంపుతున్నాను నీకు తప్పకుండా నచ్చుతుందని అనుకుంటున్నాను వీలైతే వచ్చే వేసవిలోనే ముహూర్తం పెట్టిద్దామని ఉత్తరం రాశాడు

జానకి దగ్గిరనుండి ఒక నెలరోజులకి సమాధానం వచ్చింది

తనకు ప్రసన్నను కోడలుగా చేసుకోవడం యిష్టమేననీ కాని కృష్ణకే యిష్టం లేదనీ వాడి మనసు మాధవిమీద ఉందనీ అంతేకాకుండా తనభర్తకి ప్రసన్న విషయంలో ఎన్నో సందేహాలు ఉన్నాయని జానకి ఉత్తరం రాసింది మాధవికి కృష్ణకు వేసవిలోనే పెళ్ళి చేసేద్దామనికూడా రాసింది

చెల్లెలు ఉత్తరం చూసి రాఘవయ్య ఎంతో నిరాశపడ్డాడు ఆమె ఉత్తరంలో తప్పించుకునే ధోరణి కనబడింది

ప్రసన్న విషయంలో వాళ్లకు సందేహాలు ఉన్నట్లు ఉత్తరంబట్టి తెలుస్తూనే ఉంది ఎవరికైనా అటువంటి సందేహాలుండడం సహజమే! ప్రసన్న సంసారానికి పనికిరాని పక్షంలో జానకిని మోసంచేసి కృష్ణకు ఇచ్చి తను వివాహం ఎలానూ జరిపించడు!! అయినా తనను అనుమానించిందే!!!

ప్రసన్నకి పెళ్ళికానిదే మాధవికి చేసే ఉద్దేశం లేదని అంతేకుండా మాధవికి

కృష్ణ నచ్చిన పక్షంలోనే ఆమె వివాహం కృష్ణతో జరుగుతుందని రాఘ వయ్య ఘాటుగా జానకికి ఉత్తరం రాశాడు

"మా వెంకట్రావు అన్నయ్యకి ఉత్తరం రాయమంటే రాశావుకాదు" అంటూ సుందరమ్మ దెప్పిపొడిచింది

తన బాపగారికి ఉత్తరం రాయడంలో ప్రయోజనం లేదని తెలిసికూడా భార్య సంతృప్తికోసం రాఘవయ్య వెంకట్రావుకి ప్రసన్నవిషయం గురించి ఉత్తరం రాసాడు

అక్కడినుండి అసలు జవాబే రాలేదు సుందరమ్మ పోరడంతో మళ్ళీ ఒకసారి రాశాడు

ఎప్పుడైతే తన అన్నయ్య దగ్గరనుండి ఉత్తరం రాలేదో అప్పుడే సుంద రమ్మ నమ్మకం సడలిపోయింది అయినా ఆశతో అన్నగారి ఉత్తరంకోసం ఎదురుచూడసాగింది

వెంకట్రావుదగ్గరనుండి ఎదురుచూస్తున్న ఉత్తరం రానేవచ్చింది వెంక ట్రావు చాలా ఘాటుగా ఉత్తరం రాశాడు

"అసలు మీ కీ ఊహ ఎలా కలిగింది? నన్ను మోసం చెయ్యగలరని ఎలా అనుకున్నారు? అమ్మాయిగా మారిన మీ అబ్బాయిని చేసుకోడానికి మా వాడే మంత పనికిరానివాడుకాదే? మీరు వేరే అమాయికులను వెతుక్కోవలసింది" అన్న భావం వచ్చేట్టు ఉత్తరం రాశాడు

ఆ ఉత్తరం చదివిన రాఘవయ్య కోపంపట్టలేక సుందరమ్మమీద నన్రున లేచాడు

"అసలు నువ్వు పోరబట్టే వాడికి ఉత్తరం రాశాను మన ప్రసన్నకేం తక్కువని, అంతకంటే మంచి సంబంధాలు రాకపోవు," అన్నాడు

పైకి అలా అయితే అన్నాడుగానీ స్వంత మనుమలే ప్రసన్నను చేసుకో డానికి సందేహిస్తుంటే పరాయివాళ్ళు ఎలా ముందుకు రాగలరు అన్నసందేహం మనసులో పీకుతూనేఉంది

ప్రసన్న పెళ్లి విషయం ఆ దంపతులకు పెద్ద సమస్యక్రింద కనపడసాగింది

కిటికీలోంచి చలిగాలి రివ్వున వస్తుంది ప్రసన్న చలికి కొంగు నెవులమీద నుండి తలమీద కొంగు కప్పుకొని కిటికీదగ్గరికి వెళ్ళి తలుపులు మూసింది వీధి తలుపులు కూడా మూసి గదిలోనికి వచ్చింది బయట ఆకాశం అంతా మేఘా

యు

వృతమై ఉంది ఉదయంనుండీ అలా మబ్బుగా నేఉంది ఏ క్షణంలోనో కుంభ వృష్టి కురిసేట్టుంది ఎప్పుడప్పుడూ ఆకాశం ఉరుముతుంది

తలుపు లన్నీ మూసి ఉండడంచేత గదిలో చీకటిగాఉంది ప్రసన్న స్విచ్ వేసింది గదంతా వెలుగుతో నిండిపోయింది తను క్రితంరోజు సగం చదివి వదిలేసిన నవలే అలమారులోంచి తీసి చదువుదామని టేబుల్ముందు కూర్చుంటుండంగా గోడకు ఉన్న విరిగిన అద్దంలో తన ముఖం కనబడి ఆగిపోయింది ప్రసన్న

అప్పుడు ప్రసన్న ఒక్కర్తే ఇంట్లోఉంది రాఘవయ్య ఆఫీసుకు, మాధవి కాలేజీకి వెళ్ళిపోయారు సుందరమ్మ ఏమీ తోచక ప్రక్కింటికి పేత్తనానికి వెళ్ళింది అప్పుడు సమయం మధ్యాహ్నం పన్నెండైంది

తలుపు తట్టిన శబ్దం అయింది

ప్రసన ఈ లోకంలో పడింది

ఇప్పుడు వెళ్ళి అప్పుడే అమ్మ వచ్చేసిందే అనుకుంది

అద్దంలో చివరిసారిగా తన ముఖం చూసుకొని తలుపు తీయడానికి వెళ్ళింది

ప్రసన్న తలుపులు తీసింది

ఎదురుగా చంపతి చిరునవ్వుతో నిలుచుని ఉన్నాడు

"రా రా చంపతీ! ఏమీ తోచక చస్తున్నాను సరియైన సమయంలో వచ్చావు" అంది ప్రసన్న లోపలికి దారితీస్తూ

"వీధి తలుపులు వేసిరా లేకపోతే అవి ఈ ఈదురుగాలికి తెగ కొట్టుకుంటాయి అంది

చంపతి వీధి తలుపులు గడియవేసి ప్రసన్నను అనుసరించాడు

"ఈవేళ కాలేజీకి వెళ్లలేదూ?"

మంచంమీద కూర్చుంటూ అడిగింది ప్రసన్న

"లేదు బద్ధకంగా ఉండి వెళ్లాలనిపించలేదు ఈ వాతావరణంలో ఎక్కడికీ వెళ్ళబుద్ధికూడా కాదు కాని యింట్లో ఉంటే ఏసతేమీ తోచలేదు అందుకనే ఇలా కొట్టుకవచ్చాను అన్నట్లు మీ యింట్లో ఎవరూ లేనట్టున్నారే?"

మాధవి కాలేజికి వెళ్ళిపోయింది అమ్మ ప్రక్కింటికి యిప్పుడే అయిదు నిమిషాల క్రితం వెళ్ళింది నువ్వలా నిలబడిపోయే ఉన్నావేం? చూర్చో?"

చంపతి కుర్చీని మంచందగ్గరగా జరుపుకుని కూర్చున్నాడు

ప్రసన్న చెవులమీదనుండి చెంగును సర్దుకుంటూ కూచుంది అవునన్నట్లు తలఊపింది ఎర్రని చీర ముసుగులో ప్రసన్న ముఖం వెలిగిపోతుంది

"ఈ అందాన్ని చూడటానికి రెండుకళ్ళు చాలవు" అనుకున్నాడు చలపతి

"ఏమిటి చలపతీ - అలా చూస్తున్నావ్ ?" ప్రసన్న కాస్త సిగ్గుపడుతూ అడిగింది

"నీ అందాన్ని - నిజంగా దేవతలు ఎలా ఉంటారో తెలియదుగానీ నిన్ను చూస్తుంటే నీలాగ ఉంటారేమో అనిపిస్తుంది "

"చాల్లే పొగడ్తలు" అంటూ అతని మోకాలుమీద చేతితో తట్టింది

చలపతి ముఖంలో వికారపు నీడ నల్లగా కదిలింది

ప్రసన్న లేచి లోపలికి వెళ్ళబోయింది

"ఎక్కడికి వెళ్తున్నావు ?"

"కాఫీ కాచి పట్టుకవస్తాను "

"వద్దు ప్రసన్నా - యిప్పుడెందుకు అనవసరమైన శ్రమ ?"

"ఇందులో శ్రమేముంది ? - అయినా ఈ చలిలో వేడి వేడి కాఫీ త్రాగుతే బావుంటుంది - యిప్పుడే వస్తాను" అని వంటింట్లోకి వెళ్ళింది

చలపతి వెనకనుండి నడకకు అనుగుణంగా కదిలే ప్రసన్న పిరుదులను గమనించి చలించాడు టేబులుమీద ఉన్న నవల తీసుకుని అందులోని పేజీలు తిరగవేయసాగాడు

కాస్సేపటికి ప్రసన్న రెండు గ్లాసులతో వేడి వేడి కాఫీ పట్టుకొచ్చింది

చలపతి నవలను టేబులుమీద ఉంచి కాఫీ గ్లాసు అందుకోబోయాడు కాఫీ గ్లాసు అందుకుంటుండగా అతని చేయి వణికి కాఫీ చొక్కామీద చేతిమీద ఒలికింది

"అరెరె - చొక్కామీద కాఫీ ఒలికిందే !" అంటూ తన చేతిలోని రెండవ గ్లాసును టేబిలుమీద ఉంచి చలపతి చేతిలోంచి గ్లాసు తీసుకుని దాన్ని కూడా టేబిలుమీద ఉంచి తన కొంగుతో కాఫీ పడినచోట వత్తసాగింది చలపతి ముందు తాను ఆడదాన్నన్న విషయమే ప్రసన్న మర్చిపోతుంది తను యిది వరకు చలపతితో ఎలా ప్రవర్తించేదో యిప్పుడూ అమ్మాయిగా మారిన తరువాత కూడా అలానే ప్రవర్తిస్తుంది అలా ప్రవర్తించడంవల్ల చలపతిలో కలిగే రియాక్షన్ను ప్రసన్న ఎప్పుడూ గమనించలేదు

"ఏదీ - ఆ చేయి ఇలా చాపు ! - ఆ చేతిమీద కూడా కాస్త ఒలికింది "

పైటతో చేతిమీదపడిన కాఫీని అద్దసాగింది ఆమె పైటతో తుడుస్తున్నప్పుడు ఆచ్ఛాదనలేని ఆమె గుండ్రని వక్షాలు లయానుగుణంగా ఊగుతున్నాయి జాకెట్టుకీ, చీరకీ మధ్యనున్న భాగం పచ్చగా, నున్నగా పనసతొనలాగుంది

బయట చల్లనిగాలి రివ్వున వీస్తుంది

చలపతి నుదుట స్వేదబిందువులు ఏర్పడ్డాయి ; కర్ణపుటాలు భారంగా శ్వాసను పీలుస్తున్నాయి

ఆకాశం భీకరంగా గర్జించింది

ఉలిక్కిపడిన ప్రసన్న చలపతి ఒళ్ళోపడింది చలపతి చేతులు ప్రసన్నను చుట్టుకున్నాయి

టేబులుమీద ఉన్న గ్లాసుల్లోని కాఫీ చప్పగా చల్లారిపోయింది

చలపతి లేచి వీధితలుపులు తీసుకుని బయటికి వెళ్ళిపోయాడు

* * *

రాఘవయ్యకు ప్రసన్న పెళ్ళిసంబంధాల గురించి తిరిగి తిరిగి విసుగెత్తిపోయింది వచ్చిన సంబంధాలన్నీ తప్పిపోతున్నాయి ఆ రోజు ప్రసన్నను చూడడానికి ఎవరో వస్తున్నారు

"అక్కయ్యా ! - అమ్మ నిన్ను త్వరగా తయారయ్యి రెడీగా ఉండమంటుంది" అంది మాధవి గదిలోకి వస్తూ

ప్రసన్న ఒకసారి తలెత్తి మాధవ వంకచూసి ఏమీ మాట్లాడకుండా మంచంమీద బోర్లాపడుకుంది మాధవి అక్కడినుండి వెళ్ళిపోయింది

అమ్మాయిగా మారిన తరువాత తను ఎన్నో ఊహించుకుంది తన అందం చూసి తన చుట్టూ అబ్బాయిలు తిరుగుతారనీ - తనను కట్నంలేకుండా చేసుకోవడానికి బోలెడంతమంది ఎగబడతారనీ వాళ్ళలో నచ్చినవాడిని తను చేసుకోవచ్చనీ, ఇంకా ఇలా చాల అనుకుంది

కాని యిప్పుడేమయింది ? — తన యింటిముందునుండి అబ్బాయిలు చాలమంది ఆశగా యింటివైపు తన కడగంటి చూపులకోసం చూస్తూ వెళ్తున్నారు కాని అందులో ఒక్కడికీ తనను వివాహం చేసుకునే ధైర్యంలేదు అందరికీ తనను గురించి సందేహమే ! పెళ్ళిచేసుకున్న తరువాత మళ్ళీ మగవాడిగా మారిపోతానని వాళ్ళ భయమేమో ? -

ప్రసన్న విరక్తిగా నవ్వుకుంది

మరి తన యింటిముందునుండి ఆల్లా పచార్లు మాత్రం ఎందుకు చెయ్యాలి ·




ఈ వయసులోని మహత్యమే ఆ ఆకర్షణ కాబోలు !! –

వెంటనే ప్రసన్నకు తను పి యు సి చదివేరోజుల్లో కిటికీముందు కూర్చుని ఎదురింటి అమ్మాయి కనిపిస్తుందేమోనని దొంగచూపులు చూస్తూ ఎదురు చూడటం గుర్తుకు వచ్చింది తను ఆ అమ్మాయిని ప్రేమించలేదు ! – కాని ఎందుకనో ఆ అమ్మాయిని మాత్రం ప్రతిరోజు చూడాలనిపించేది అదో వింత ఆకర్షణ !!

ఆలానే ఈ పెళ్ళికొడుకులంతా తన అందానికి ఆకర్షితులౌతున్నారు కాని తనను వివాహం చేసుకోడానికి వాళ్ళకి ధైర్యం చాలడంలేదు ఆ పరిస్థితి తనకు ఎదురైనా అంతేనేమో !! –

ఇంక తనకు పెళ్ళయ్యే అవకాశం లేదేమో ? !! - తన జీవితం యిలా ఎగురించిన మోడులా ఉండిపోవలసిందేనా ? -

ప్రసన్నకు చంపతి గుర్తుకు వచ్చాడు

"ఒసేవ్ ! - నువ్వింకా మంచం వదల్లేదూ ? - వాళ్ళు వచ్చేటైమైంది. త్వరగా లే"

సుందరమ్మ తుఫానులా గదిలో ప్రవేశించి ప్రసన్నను హడావిడి పెట్టేసింది

ప్రసన్న మంచంమీదనుండి లేచి ఒళ్ళు బద్ధకంగా విరుచుకుని బాత్రూము వైపు దారితీసింది

ప్రసన్నను సుందరమ్మ, మాధవి కలిసి తయారుచేశారు పట్టుచీరలో, ఆ అలంకరణలో ప్రసన్నను ప్రవరాఖ్యుడు చూసినా మతి పోగొట్టుకుంటాడు

పెళ్ళివారు మధ్యగదిలో కూర్చున ఉన్నారు పెళ్ళికొడుకు అతని తల్లి దండ్రులు, అతని అక్కయ్య నలుగురు వచ్చారు రాఘవయ్య వాళ్ళతో ఆ మాటా ఈ మాటా మాట్లాడుతూ కూర్చున్నాడు

సుందరమ్మ, మాధవి తలవాల్చుకుని ఉన్న ప్రసన్నను నెమ్మదిగా నడిపించు కుంటూ వచ్చి కూర్చోబెట్టారు

పెళ్ళికొడుకు కళ్ళు తిరిగిపోయాయి ప్రక్కన తన తల్లిదండ్రులున్నా విన్న విషయం కూడా మర్చిపోయి రెప్పవాల్చకుండా ప్రసన్నవంక మాడ సాగాడు

పెళ్ళికొడుకు తల్లిదండ్రులు అక్కయ్య ప్రసన్నను ఏమేమో ప్రశ్నలువేసి విసిగించారు పెళ్ళిచూపులనేది ఆడపిల్లలకు ఎంత బాధాకరమైన సంఘటనో ప్రసన్న గ్రహించింది

పెళ్ళికొడుకు ప్రసన్నను ఏమీ ప్రశ్నించలేదు ప్రసన్నను చూడగానే ఇంక ఆమెను గురించి ఏమీ అడగాల్సిన అవసరం లేదనిపించింది అతనికి తన తల్లిదండ్రులు ఈ సంబంధం ఎక్కడ కాదని అంటారోనన్న భయం అతనికి కలిగినమాట వాస్తవం

మంచిరోజు చూసుకొని తాంబూలాలు పుచ్చుకోడానికి మళ్ళీవస్తామని వాళ్ళు వెళ్ళిపోయారు

రాఘవయ్య ఆనందానికి అంతేలేదు వాళ్ళ మాటలుబట్టి చూస్తే వాళ్ళకు

కట్నం గురించిన ఆశ కూడా అంతగా లేనట్లుంది యింత సులభంగా ప్రసన్న పెళ్లి కుదిరిపోతుందని అతను ఊహించలేదు

ప్రసన్న తేలికగా ఊపిరి పీల్చుకుంది మరుక్షణం ఆమెకు చలపతి గుర్తుకు వచ్చాడు ఆమె హృదయం బాధతో మూలిగింది

ఒకవారం రోజుల తరువాత పెళ్లివారి దగ్గరనుండి ఉత్తరం వచ్చింది

"మీ అమ్మాయి యిదివరకు అబ్బాయనీ - ఈ మధ్యనే అమ్మాయిగా మారిందని తెలిసింది — అందుచేత మా అబ్బాయి ఈ వివాహం చేసుకోడానికి అంగీకరించడంలేదు - మీ చిన్న అమ్మాయి కూడా మాకు నచ్చింది - మీ చిన్నమ్మాయిని మావాడికి చేసుకోడానికి మాకు ఎటువంటి అభ్యంతరమూ లేదు - మీ అభిప్రాయం రాయండి" అని ఉత్తరంలో ఉంది

ఆ ఉత్తరం చదివి రాఘవయ్య నీరు కారిపోయాడు

"దీనికి చస్తే పెళ్ళికాదు - యిది మనకు శనిలా దాపురించింది", అంటూ విసుక్కున్నాడు కూడా

ప్రసన్నకు ఏడుపొచ్చింది తనకు పెళ్లికాదన్నభావంవల్లకాదు - తనను వాళ్ళు విసుక్కుంటున్నందుకు ?

ఆ రోజు రాత్రి ఎవ్వరికీ భోజనం చేయబుద్ధికాలేదు అందరూ ముభావంగా ఉన్నారు

రోజులు యధాప్రకారంగా గడిచిపోతున్నాయి చలపతి ప్రసన్న వాళ్లింటికి రావడం పూర్తిగా మానేశాడు కళ్యాణికూడా ఉత్తరాలు ఏమంతగా వ్రాయడం లేదు

రాఘవయ్య సుందరమ్మలకు ప్రసన్న విషయంలో చాల బెంగపట్టుకుంది అప్పుడప్పుడు ప్రసన్నమీద విసుక్కుంటున్నారు కూడా వాళ్ళలా తనమీద విసుక్కోడం ప్రసన్నకు చాల బాధను కలిగించేది ఒంటరిగా తలగడలో ముఖం దాచుకుని నిశ్శబ్దంగా రోధించేది

తనేం పాపం చేసింది ? - బుద్ధిపూర్వకంగా తనేమీ ఆ విధంగా మారలేదు కదా ? - మరి తనమీద ఎందుకలా విసుక్కుంటారు ?? - తను మరణిస్తే పిల్ల సమస్యలన్నీ తగ్గుతాయేమో ? -

ఇలా రకరకాలుగా ఆలోచిస్తుంటుంది

ఒకరోజు న్యూస్‌పేపరులో ఒక కంపెనీలో క్లర్కు పోస్టుకు ప్రకటన పడింది దానికి స్యూటుపైనలు అర్హత చాలు

తను ఊరికినే కూర్చుని ఏంచేస్తుంది ? — ఉద్యోగంలో చేరితే ? ;; అనుకుంది.

అనుకోడమేమిటి ? – వెంటనే రాఘవయ్యను అడిగింది.

"ఏమిటీ ? — నువ్వు ఉద్యోగం చేస్తావా ? ; " అంటూ ఆశ్చర్యపోయా డాయన.

"అవును నాన్నగారూ ! – నేను యింట్లో ఊరికే కూర్చుని ఏంచెయ్యాలి గనుక ?"

"ఆడపిల్లలు ఉద్యోగం చెయ్యడం మన ఇంటా వంటా లేదు" అంది సుందరమ్మ.

"అసలు ఉద్యోగం చేస్తే తప్పేమిటంట ? – ఎంతమంది ఆడపిల్లలు ఈ రోజుల్లో ఉద్యోగాలు చేయడంలేదూ ? – అయినా అక్కయ్య యింట్లో కూర్చుని చేసే పనేముంది ?" అంటూ ప్రసన్నను సపోర్టుచేసింది మాధవి.

"సరే — ముందు అప్లయి చెయ్యి – వచ్చిన తరువాత చూద్దాం" అన్నాడు రాఘవయ్య

ప్రసన్న సంబరపడిపోయింది.

"అదేమిటండీ – మీకేమైనా మతిపోయిందా ? – యిప్పుడు అది ఉద్యోగం చెయ్యకపోతే వచ్చిన నష్టం ఏమిటి ?"

సుందరమ్మ రాఘవయ్యను నిలదీసింది.

"నీకు తెలీదు లేవే ! – ఇలా రా చెప్తాను."

రాఘవయ్య సుందరమ్మను లోపలి గదిలోనికి తీసుకువెళ్ళాడు.

ప్రసన్నకు యేమీ తోచటంలేదు. ఉద్యోగంచేస్తే బాగుంటుందనిపిస్తోంది. ఈ ముక్కే తండ్రితో చెప్పింది.

"అది ఆఫీసులో పనిచేస్తుంటే అక్కడివాడే ఎవడైనా దీన్నిచూసి యిష్టపడి పెళ్ళిచేసుకుంటాడు – మన సమస్య అలా తీరినా తీరవచ్చు" అని రాఘవయ్య అన్నమాటలను సుందరమ్మ అంగీకరించింది.

ప్రసన్న ఆ రోజే క్లర్కు ఉద్యోగానికి అప్లయిచేసింది.

ఒక రెండువారాల్లోనే యింటర్వ్యూకి పిలుస్తూ ఉత్తరం వచ్చింది. ఇంటర్వ్యూ ముందు జనరల్ నాలెడ్జి మొదలైనవి చదువుకుని ఇంటర్వ్యూకి తయారైంది ప్రసన్న.

ఆ రోజే ప్రసన్నకు ఇంటర్వ్యూ !

ఇంటర్వ్యూ సమయం ఉదయం పదిగంటలు. తొమ్మిదికి ఉడికీ ఉడకని పదార్థాలు గబగబ ఇంత తిని కంపెనీకి బయలుదేరింది.

బస్సు స్టాపుకు వెళ్ళేదారిలో,

"చూడరా - ఆ అమ్మాయి ఎవరో ? - మగవాడిలా ఆ నడక - ఆ వాలకం - రోజులు మారిపోయాయి" అంటున్నారు ప్రసన్న నుద్దేశించి ఎవరో.

వాళ్ళ మాటలు విని తన నడక జోరు చేతులు విసురుగా ఊపడం తగ్గించింది ప్రసన్న.

తన రూపమైతే మారిందిగాని చేష్టలు ఎలా మారతాయి ? తను అబ్బాయిగా ఉన్నప్పుడు అమ్మాయిలా ఉన్నావని అన్నారు - యిప్పుడేమో అబ్బాయిలా ప్రవర్తిస్తున్నానని అంటున్నారు.

ప్రసన్న ఆలోచిస్తూ బస్సుస్టాపు చేరుకుంది బస్సుస్టాపులో అందరి కళ్ళూ ప్రసన్న మీదనే ఉన్నాయి కొందరేమో ప్రసన్నను చూచి గుసగుసలు మొదలు బెట్టారు ప్రసన్న ఇదివరకు అబ్బాయన్న విషయం వాళ్ళకు తెలిసి ఉండాలి. ప్రసన్నకు తెలిసినవాళ్లు కూడా కొందరు బస్సుస్టాపులో ఉన్నారు. కాని ప్రసన్నను వాళ్ళు గుర్తించలేదు ప్రసన్న కూడా వాళ్ళను పలుకరించలేదు. వాళ్లకు తన ముఖం కనబడకుండా ప్రక్కకు తిప్పుకుంది.

కాస్సేపటికి బస్సువచ్చింది. అక్కడ ఉన్న అందరూ బస్సుమీదకు ఎగబడ్డారు

"ఈ ఆడపిల్లలు మగవాళ్ళను మించిపోతున్నారు - యిష్టం వచ్చినట్టు అలా తోసుకుని బస్సు ఎక్కేయడమే ? !! "

ఎవరో ముసలాయన ప్రసన్న మీద విసుక్కున్నాడు.

తను ఒకప్పుడు అబ్బాయే అని ఈయనకేం తెలుసు ? అనుకుంది ప్రసన్న.

యింకా నయం - తనకు సిగరెట్లు కాల్చడం అలవాటులేదు - అటువంటి అలవాట్లుంటే మానుకోవడం కష్టం - చాటుగా సిగరెట్లు కాల్చవలని వచ్చేది.

తన ఆలోచనలకు తనే నవ్వుకుంది.

"టిక్కెట్ ప్లీజ్."

కండక్టరు పిలుపుతో ఈ లోకంలోకి వచ్చింది. టిక్కెట్టు తీసుకుంది.

"టిక్కెట్ ప్లీజ్ - టిక్కెట్."

కండక్టరు ముందుకు కదిలాడు.

ప్రసన్న మళ్ళీ తన ఆలోచనల్లో మునిగిపోయింది. తనకు ఉద్యోగం వచ్చినట్టూ, తన మొదటి జీతంతో అందరికీ బట్టలూ కొన్నట్టూ, సుందరమ్మ తనను మెచ్చుకుంటున్నట్టూ ఇంకా ఏమేమో కలను బస్సులోనే కనేస్తుంది.

తన పాదాన్ని ఎవరిదో కాలు తొక్కుతుండడంచేత ఆమె ఆలోచనలకు అంతరాయం కలిగింది.

ప్రసన్న తలత్రిప్పి ప్రక్కకు చూసింది. అంతసేపూ ప్రసన్ననే చూస్తున్న అతను తన ముఖం ప్రక్కకు త్రిప్పేసుకున్నాడు.

అతను నల్లగా ఉన్నాడు. ముఖంమీద వెంట్రుకలు జీరాడుతున్నాయి. ముఖం జిడ్డోడుతూంది. ఇందాకట్నుంచీ అతనే ప్రసన్న పాదాన్ని తొక్కుతున్నాడు. బస్సు కుదిపినప్పుడల్లా అవకాశాన్ని జారవిడవకుండా తన శరీరాన్ని ప్రసన్న శరీరానికి తగిలిస్తున్నాడు.

ప్రసన్నకు అతనిమీద అసహ్యం పుట్టుకొచ్చింది.

చదువుకున్నవాడిలా ఉన్నాడు – ఇలాంటి పనులు చేయడానికి బుద్ధెలా పుడుతుందో మరి ? – తన కళ్లల్లో కళ్ళుకూడా పెట్టి చూడలేని వెధవ అనుకుని అతనికి దూరంగా నిలుచుంది.

తను దిగాల్సిన స్టాపు వచ్చేసింది. ప్రసన్న బస్సు దిగేసింది. అప్పుడు సమయం తొమ్మిదిన్నరైంది. గబగబ కంపెనీవైపు అడుగులు వేసింది ప్రసన్న.

ఇంటర్వ్యూకి ప్రసన్నకాక ఇంకా చాలామంది వచ్చారు. ఒక అయిదుగురు అమ్మాయిలుకూడా వచ్చారు. ప్రసన్న వాళ్ళతోపాటు బెంచీమీద కూర్చుంది.

ఇంటర్వ్యూలు మొదలయ్యాయి. ఒక్కొక్కరే హృదయం బదులు ఆశల మూటను తమలో పెట్టుకొని లోపలికి వెళ్ళొస్తున్నారు.

ప్రసన్న వంతు వచ్చింది.

అదిరే గుండెలతో తడబడే నడకతో ఆఫీసరు గదిలోకి అడుగుపెట్టింది ప్రసన్న.

"కూర్చోండి."

ఆఫీసరు గొంతు మృదువుగా పలికింది. ప్రసన్న బొమ్మలా కూర్చుంది.

ముదురు నీలంరంగు చీరలో ప్రసన్న శరీరం పచ్చగా మెరిసిపోతుంది. పంకా గాలికి ముంగురులు నొసలుమీద మెల్లగా కదులుతున్నాయి. ఆమె పెద్ద

వైన కళ్ళు బెదురుచూపులు చూస్తున్నాయి ప్రసన్న అందం తిలకించడంలో అమెను ఇంటర్వ్యూ చేయాల్సిన విషయం మర్చిపోయాడు ఆ ఆఫీసరు

ప్రసన్న తనను ఏమీ ప్రశ్నించకుండా గుడ్లప్పజెప్పి చూస్తున్న ఆఫీసరు వంక చూసింది ఆయనకు దగ్గర దగ్గర యాభైయేళ్ళుండవచ్చు పూర్తిగా బట్ట తల వచ్చేసింది ఫ్రెంచ్ కట్ మీసంలో అతనిముఖం గమ్మత్తుగా ఉంది అతన్ని చూస్తే ప్రసన్నకు నవ్వువచ్చింది అనుకోకుండా చిరునవ్వు ఒకటి ప్రసన్న ఎర్రని పెదాలమీద మెరిసింది

ప్రసన్న చిరునవ్వు నవ్వడం గమనించి ఆయన తబ్బిబ్బయ్యాడు ఇంత వరకూ మౌనంగా కూర్చుని తను చేసిన తప్పును గ్రహించాడు

"సారీ! మిమ్మల్ని ఇంతకుముందు ఎక్కడో చూసినట్టనిపిస్తే ఎక్కడ చూశానా అని ఆలోచిస్తూ కూర్చుండిపోయాను" అని తన తప్పును దిద్దుకున్నాడు

ప్రసన్న కంగారుపడింది

కొంపతీసి తను అబ్బాయిగా ఉన్నప్పుడుగాని చూడలేదుకదా? లేకపోతే తను అమ్మాయిగ మారినప్పుడు తన ఫోటోను పేపర్లలో వేశారుగా, అప్పుడు గానీ చూశాడేమో?

"మీ పేరు ప్రసన్న కదూ?"

"అవునండీ" ఆమె గొంతు తీయగా అపస్వరం లేని రాగంతో పలికింది

"మీ నాన్నగారు ఏంచేస్తుంటారు?"

ప్రసన్న చెప్పింది

"ఈ ఉద్యోగం మీకిస్తే ఒళ్లు దాచుకోకుండా పనిచేస్తారా?" ఆఫీసరు నవ్వాడు

"తప్పకుండా చేస్తానండీ" ప్రసన్న వినయంగా సమాధానం చెప్పింది

"నాకెందుకో ఎందుకో మిమ్మల్ని చూస్తుంటే ఈ ఉద్యోగం మీకే ఇవ్వాలనిపిస్తుంది"

"చాలా థాంక్సండీ మీ మేలు ఎన్నటికీ మరువలేను"

"మీ పనినిబట్టి త్వరలోనే మీకు ప్రమోషన కూడా యిస్తాను"

"తప్పకుండా మీరు నా పనిని మెచ్చుకుంటారు" ప్రసన్న దృఢంగా పలికింది

"వెరీగుడ్ మీమీద నాకు నమ్మకం కలుగుతూంది సరేగాని ఈవేళ

ప్రాయంత్రం ఆరుగంటలకు ఒకసారి మా యింటికి రా అడ్రసు చెపుతాను నోట్ చేసుకో "

"ఎందుకండీ ?"

ప్రసన్న ముఖంలోని అమాయకత్వాన్ని చూసి నవ్వాడు ఆఫీసరు తన సీట్లోంచి లేచి చుట్టూ తిరిగి ప్రసన్న కూర్చున్న కుర్చీదగ్గరకు వచ్చి నిలుచున్నాడు ప్రసన్నకూడా లేచి నిలుచున్నది

"అర్ధంకాలేదా? నీకు ఉద్యోగం ఇచ్చి కొద్దిరోజుల్లోనే ప్రమోషనిస్తానంటే ఊరికినే ఇస్తానా ?" ఆఫీసరు విషపునవ్వొకటి నవ్వి ప్రసన్నమీదకు వస్తున్నాడు

ప్రసన్నకు అతని మనసులోని చెడు ఆలోచన అర్థం అయింది

ఆయన చటుక్కున ప్రసన్న చేయిపట్టుకుని

"ఏదీ? ప్రస్తుతానికి ఒక్కముద్దు " అంటూ ప్రసన్న ముఖంమీదకు తన ముఖాన్ని దగ్గరగా తెచ్చాడు

ప్రసన్న తన రెండవ చేత్తో గోళ్ళతో ఆయన ముఖంమీద బలంగా రక్కింది ఆయన ముఖంమీది చర్మంలేచి ది

"అమ్మో !" అని ప్రసన్న చేయి వదిలేసి చెంపలు తడుముకున్నాడు

వెంటనే ప్రసన్న బలాన్నంతా ఉపయోగించి ఆయన గుండెలమీద చేతులు పెట్టి ఒక్క తోపు తోసింది పాపం ! ఆ ముసలాయన తివాచీమీద వెల్లకితలా పడ్డాడు

ప్రసన్న స్వింగ్ డోర్స్ తెరచుకొని అతి వేగంగా బయటికి వెళ్ళిపోయింది బయటవున్న ప్యూను తరవాత ఎవరిని పిలవాలో అడగడంకోసం ఆఫీసరు గదిలోకి అడుగుపెట్టి అక్కడి దృశ్యం చూసి తికమకపడ్డాడు

ఇంటర్వ్యూకోసం బయట ఉన్నవాళ్ళందరికీ ఆఫీసరు ప్యూనుమీద గట్టిగా కేకలువేయడం వినిపించింది కాస్సేపటికి ప్యూను బయటికివచ్చి

"ఈవేళ ఇంటర్వ్యూలు కాన్సిల్ అయిపోయాయి మళ్ళీ ఎప్పుడుండేదీ మీకు ఉత్తరాలద్వారా తెలియజేస్తారు మీరిక వెళ్ళవచ్చు" అని చెప్పాడు

వాళ్ళందరూ బిలబిల బయటికి వెళ్ళిపోయారు

ప్రసన్న ను ఇంట్లోవాళ్ళు ఇంటర్వ్యూ గురించి అడిగితే తాను సరిగా చేయలేదని చెప్పింది

ఆనాడు జరిగిన స ఘటనతో ప్రసన్న "పూర్వజన్మలో పాపం చేసుకుంటే ఈ జన్మలో ఆడవై పుడతారు" అనుకుంది

*  *  *

'ఒంట్లో బాగోపోతే ఒకసారి డాక్టరు దగ్గరికి వెళ్ళరాకూడదూ?"

ప్రొద్దున లేచినప్పటినుండి ఈ మాటలు కనీసం ఒక ఇరవైసార్లన్నా సుందరమ్మ ప్రసన్నతో అంది

ప్రసన్న సుందరమ్మవైపు చూసింది

"ఇప్పుడు ఫర్వాలేదులేవే! ఇందాక కాస్త కళ్లు తిరిగాయి అంతే!!"

"డాక్టరు దగ్గరకు వెళ్ళిరమ్మంటే నీకొచ్చిందా?— ఏవిటా అశ్రద్ధ!!"

రాఘవయ్య ప్రసన్నమీద విసుక్కున్నాడు ప్రసన్నకు ఏమాత్రం ఒంట్లో బాగోలేదని అన్నా వాళ్ళందరికీ భయంవేస్తుంది మళ్ళీఏం ముంచుకొస్తుందోనని

సుందరమ్మ రాఘవయ్యల బలవంతంతో ప్రసన్న ఆసుపత్రికి వెళ్ళింది,

ఒక అరగంటకు వాడిపోయిన ముఖంతో ఆసుపత్రినుండి తిరిగి వచ్చింది ప్రసన్న ముఖంచూసి తల్లిదండ్రులు భయపడ్డారు, మళ్ళీ ఏంజరిగిందోనని

"డాక్టరేమన్నాడు?" ఇద్దరూ ప్రసన్నను ఆతృతగా అడిగారు

"ఏమీ లేదని అన్నాడు నాకు కొంచెం నీరసంగా ఉంది అంతే,"! అని భోజనం చేయకుండా మంచంమీద అలానే పడుకుంది

ఏడ్చి ఏడ్చి ప్రసన్న ముఖం ఉబ్బిపోయింది కళ్లు ఎర్రగా మందార పువ్వుల్లా ఉన్నాయి తలగడ కన్నీళ్ళతో తడిసిపోయింది భయాందోళనలతో ఆమె మనసు రెపరెపలాడుతోంది అతిగా ఆలోచించడంవల్ల మెదడు మొద్దుబారిపోయింది

మాటిమాటికి డాక్టరు తనతో అన్నమాటలు ప్రసన్నకు గుర్తుకు వస్తున్నాయి తను ఇంకా ఎందుకు బ్రతికిఉందో ప్రసన్నకి అర్థంకాలేదు

ఈ సృష్టిలో ప్రతి పదార్థమువల్ల ఏదో ఒక ప్రయోజనము ఉంటుంది కానీ తనవల్ల ఏమీ ఉపయోగంలేదు తను జీవించడమే వృథా! తననుండి తల్లిదండ్రులకి మానసిక క్లేశం తప్పితే ఇంకోటి లభించదు

ఆరోజంతా పిచ్చిపిచ్చి ఆలోచనలతో గడిపివేసింది, ప్రసన్న రాత్రికూడా భోజనం చేయలేదు ప్రసన్న ప్రవర్తన రాఘవయ్య సుందరమ్మ మాధవిలకు చాల ఆందోళన కలిగించింది

మర్నాడు సాయంకాలం ఒకసిర్ణయానికి వచ్చి ప్రసన్న యింట్లోంచి బయలు దేరింది

"ఎక్కడికి వెళ్తున్నావే?" సుందరమ్మ గుమ్మంలోంచి కేకవేసింది

"ఇప్పుడే ఒక్క అయిదు నిమిషాల్లో వచ్చేస్తాను" అంటూ వెనక్కి తిరిగి చూడకుండా వెళ్ళిపోయింది

గేటులోంచి లోపలికి వస్తున్న ప్రసన్నను చూసి చలపతి ఆశ్చర్యపోయాడు

"రా రా కూర్చో ప్రసన్నా!"

చలపతి కుర్చీ తెచ్చి వేశాడు

"నీతో పనుంది అలా బయిటికి రా వెళ్దాం"

కుర్చీలో కూర్చోకుండా నిలబడే ఆ మాటలను అన్నది ప్రసన్న

"నాతో పనా?!"

ఆమె మాటలధోరణి చలపతికి ఆశ్చర్యాన్ని కలిగించింది

"నీతో ఒక ముఖ్యమైన విషయం గురించి మాట్లాడాలి"

ప్రసన్న ముఖంలోకి ఒకసారి చూసి

"కూర్చో! ఒక్క నిముషంలో వచ్చేస్తాను" అంటూ లోపలికి వెళ్లి బట్టలు మార్చుకుని వచ్చాడు చలపతి

"పద వెళ్దాం!"

ఇద్దరూ పార్కుకి వెళ్లారు పార్కులో జనం ఎక్కువగా లేనిచోట ఒక మూలగా యిద్దరూ కూర్చున్నారు దూరంగా పిల్లల అల్లరి, అమ్ముకునేవాళ్ల కేకలు వినిపిస్తున్నాయి యిద్దరూ కాస్సేపు మౌనంగా కూర్చున్నారు ప్రసన్న మాట్లాడే విషయం ఏమై ఉంటుందా అని చలపతి ఆలోచిస్తూ కూర్చున్నాడు ప్రసన్న అసలు విషయాన్ని ఎలా మొదలుబెట్టాలో తెలియక సతమత మౌతుంది

"నాతో ఒక ముఖ్యమైన విషయం మాట్లాడాలని అన్నావు - ఏమిటది?" చివరికి చలపతే విషయాన్ని కదిపాడు

ప్రసన్న చెప్పిన విషయం విని ఉలిక్కిపడ్డాడు కాస్సేపటివరకూ ఏమీ మాట్లాడలేకపోయాడు

"నువ్వు చెప్తున్నది నిజమేనా?" అన్నాడు చివరికి

యిటువంటి విషయంలో అబద్ధం చెప్తానని ఎలా అనుకున్నావు?"

"అయితే ఇప్పుడు నన్నేం చేయమంటావు?"



"అది నేను చెప్తేగాని నీకు తెలియదా ?"

"నువ్వనేదేమిటో నాకు అర్థంకావడంలేదు."

"నువ్వు నన్ను పెళ్ళిచేసుకో !"

చలపతి ఆశ్చర్యంగా ప్రసన్న ముఖంలోకి చూశాడు. మళ్ళీ ఆమె చూపుల తీక్షణతకు తట్టుకోలేక ముఖం ప్రక్కకి తిప్పేసుకున్నాడు.

"ప్లీజ్ !... నన్ను పెళ్ళిచేసుకోవూ ?"

"అంతలోనే దీనంగా అర్థించింది ప్రసన్న.

"నిన్ను పెళ్ళిచేసుకుంటానని ఎలా అనుకున్నావు ?"

ప్రసన్న దెబ్బతిన్నట్టు చలపతివంక చూసింది.

"మరి అట్లాగయితే అలా ఎందుకు చేశావు ?" వాణికి పెదాలను పళ్ళతో నొక్కిపట్టింది.

"నేనేం చేశాను?" చలపతి నొసలు చిట్లించాడు.

''నా శీలాన్ని అపహరించి యింకా ఏంచేశానని అడుగుతున్నావా?'' ప్రసన్న ఆవేశంగా అడిగింది. ఆమె మనసులోని ఆవేశానికి నిదర్శనంగా ఆమె చేతులు గడ్డిపరకలను పెరికి తుంపులు చేస్తున్నాయి

"నేను మామూలుగానే ఉండేవాడిని... నువ్వు నామీదపడి నన్ను రెచ్చగొట్టేదానివి!"

"నువ్వు చిన్నప్పటినుండీ నా స్నేహితుడివని నీతో చనువుగా ఉండేదాన్ని- ఆడదానిగా మారిన తరువాత కూడా అదే చనువుతో ఉన్నాను... అది రెచ్చగొట్టడమెలా అవుతుంది?"

"ఏది ఏమైనా ఆడదానిగా మారిన తరువాత నీ జాగ్రత్తలో నువ్వుంకాల్సింది నువ్వు నాతో ప్రవర్తించినట్టు మరే యితర మగవాడితో ప్రవర్తించినా ఉద్రిక్తుడయి తీరతాడు... ఇందులో నా తప్పేమీలేదు."

ప్రసన్న కళ్లల్లో నీళ్లు తిరిగాయి.

"పోనీలే చలపతీ జరిగిపోయిందేదో జరిగిపోయింది... తప్పు నాదేనని ఒప్పుకుంటున్నాను. నన్ను మాత్రం అన్యాయం చెయ్యకు."

"ఇందులో నేను చెయ్యగలిగినదేమీలేదు" చలపతి నిక్కచ్చిగా జవాబు ఇచ్చాడు.

"నువ్వలా నిరాకరిస్తే ఎలా చలపతీ?- నాలో ఏం లోపం ఉందని నిరాకరిస్తున్నావు?'

"నీలో ఏ లోపం ఉందని నీ బావలిద్దరూ నిన్ను చేసుకోడానికి నిరాకరించారు?"

చలపతి ఎదురుప్రశ్న వేశాడు.

''ఇదివరకు మగవాడిగా ఉన్నదానివి— నిన్నెలా పెళ్ళిచేసుకోను?''

"యిప్పుడు ఆడదాన్నేగా?"

"ఏమో?- పెళ్లయిన తరువాత ఎలా ఉంటుందో?!!"

చలపతి అంత కఠినంగా మాట్లాడడం ప్రసన్నకు ఆశ్చర్యం కలిగించింది.

''నా జీవితాన్నిలా అన్యాయం చేస్తావా?" ప్రసన్న దీనంగా ప్రశ్నించింది.

''నేనేం అన్యాయం చేశాను?- నేనేమీ నిన్ను బలవంతంగా అనుభవించలేదే?- అయినా తప్పేదేం ముంచుకుపోయింది గనుక? ఎబార్షన్ చేయించు

కుని ఎవడినైనా కట్టుకో !" చలపతి విసురుగా అన్నాడు చలపతి ఇటువంటి మనిషని ప్రసన్న ఊహించలేకపోయింది

చలపతి మాటలకు ప్రసన్న తోక తొక్కిన త్రాచులా బుసలుకొడుతూ లేచింది ఆమెలో సహనం పూర్తిగా నశించింది చలపతిని యిష్టం వచ్చినట్టు దుర్భాషలాడింది

"నువ్వేం ఇటువంటి సలహాలు యివ్వక్కరలేదు ! నువ్వెంత నీచుడివో ఈనాడే తెలిసింది నీ ముఖం చూస్తేనే మహా పాపం ఛీ" అంటూ విసురుగా పార్కు బయటికి నడిచిపోయింది

చలపతి తేలికగా ఊపిరి పీల్చుకున్నాడు

* * *

ప్రసన్న చెప్పిన విషయం విని సుందరమ్మ ప్రక్కలో బాంబు పేలినట్టు అదిరిపడింది

"ఏమిటే నువ్వంటున్నది ! నువ్వు చెప్పేది నిజమేనా ? ."

ఏడుస్తున్న ప్రసన్న భుజాలు పట్టి కుదిపింది సుందరమ్మ

"మొన్న ఆసుపత్రిలో పరీక్షించి చెప్పారు "

ప్రసన్న భుజాల వదిలేసి మతిలేనిదానిలా చూసింది సుందరమ్మ ప్రసన్న వెక్కి వెక్కి ఏడుస్తుంది

"ఇంతకీ ఎవడే వాడు ?" హీనస్వరంతో ప్రశ్నించింది

"చలపతి !" వెక్కుతూ సమాధానం చెప్పింది సుందరమ్మ

"సిగ్గుమాలిన పనిచేసి యింకా ఏడుస్తున్నావెందుకే ?. ఇప్పటికే నీవల్ల సగం చచ్చి ఉన్నాము యిప్పుడు పరువు పూర్తిగా తీసేశావు నువ్వు పుట్టినప్పుడే చచ్చి ఉంటే మాకీ బాధలు ఉండేవికాదు" సుందరమ్మ కుమిలిపోతూ అంది

ప్రసన్న మోకాళ్ళ మధ్య ముఖాన్ని దాచుకుంది

"నాన్నగారికి విషయం తెలిస్తే ఏమైనా ఉందా ? నీ చర్మం నా చర్మం వలిచేస్తారు వాడిని మంటికి మాట మాటికి రానిచ్చినందుకు నామీద యింతెత్తున లేస్తారు ఇప్పుడు మనం వెళ్ళి చలపతిగారి కాళ్లమీద పడాలి కాబోలు !"

ప్రసన్న దేనికీ జవాబు చెప్పకుండా ఏడుస్తుంది

'ఇంతకీ వాడికీ విషయం తెలుసా ?"

ప్రసన్న తెలుసునన్నట్టు తల ఊపింది

"ఏమంటాడూ ?" ఆతురతగా అడింగింది సుందరమ్మ

"" తలెత్తి సుందరమ్మ ముఖంలోకి చూసింది ఆమె కళ్లు ఎర్రగా ఉన్నాయి పెదాలు ఒణుకుతున్నాయి

నిన్న వాళ్ళింటికి వెళ్ళి జరిగింది చెప్పి పెళ్ళి పెళ్ళి చేసుకోమని అడిగాను."

"ఆ ఆ ఏమన్నాడూ ?"

ప్రసన్న భుజాలు పట్టుకుని కుదుపుతూ ఆతంగా అడిగింది సుందరమ్మ

ప్రసన్న మోకాళ్లలో తల దాచుకుని సన్నగా మూలుగుతూ ఏడ్వడం మొదలుబెట్టింది

సుందరమ్మకు చలపతి యిచ్చిన సమాధానం ఏమిటో అవగతం అయిపోయింది కాస్సేపు విధిని, కాస్సేపు ప్రసన్నని మరికొంతసేపు చలపతిని జానకిని, వెంకట్రావుని అందర్నీ వరసబెట్టి తిట్టిపోసి విసురుగా వేరే గది లోనికి వెళ్ళిపోయింది

ప్రసన్న సాయంత్రంవరకూ మంచం వదలలేదు సాయంత్రం మాధవి కాలేజీనుండి రాఘవయ్య ఆఫీసనుండి వచ్చారు సుందరమ్మ వాళ్ళిద్దరికీ ఏమీ చెప్పలేదు సుందరమ్మ చెప్పేవరకూ తనకు బెదురుగనే ఉంటుంది- తర్వాగా ఈ విషయం చెప్పేస్తే బావుండునని ప్రసన్న అనుకుంది

రాత్రి భోజనాల దగ్గరకూడా సుందరమ్మ ప్రసన్నలు మౌనంగా ఉన్నారు భోజనం అయిన వెంటనే ముసుగు కప్పుకుని పడుకుంది ప్రసన్న రాత్రి చాల సేపటివరకూ ప్రసన్నకు నిద్రపట్టలేదు

రాత్రి పది దాటిన తరువాత సుందరమ్మ రాఘవయ్య మాట్లాడుకోడం ప్రసన్నకు అస్పష్టంగా వినిపించింది మధ్య మధ్య రాఘవయ్య సుందరమ్మను కోపగించుకుంటున్నట్లు అనిపించింది వాళ్ళిద్దరూ తన గురించే మాట్లాడుకుంటున్నారని అనుకుంది

తెల్లారితే చెలరేగే తుఫాను గురించి ఆలోచిస్తూ పక్కమీద పొర్లుతుంది ప్రసన్న ప్రసన్నకు ఏ అర్థరాత్రో నిద్రపట్టింది

ఆ మర్నాడు రాఘవయ్య—

"ఏవిటమ్మా యిలా చేశావ్ ?" అన్నాడు ప్రసన్నతో అంతకు మించి పన్నెతి ఒక్కమాట అనలేదు ప్రసన్న ఏమేమో ఊహించింది ఆయన తన మీద ఇంతెత్తున లేస్తాడని అనుకుంది

రాఘవయ్య ఏమీ అనకపోవడం ప్రసన్నను మరింత బాధించింది నిజానికి

రాఘవయ్య తనను తిట్టిపోసి లాగి ఒక్క లెంపకాయ కొట్టినా తనకు అంత బాధనిపించకపోవును అనుకుంది ప్రసన్న.

రాఘవయ్య బయటికి వెళ్ళిపోయాడు. అతని మాటలనుబట్టి చలపతి యింటికి వెళ్తున్నాడని ప్రసన్న ఊహించింది. చలపతి తండ్రితో రాఘవయ్య మాట్లాడిన తరువాత ఫలితం ఏమైనా కనబడవచ్చునన్న ఆశ మళ్లీ ప్రసన్నలో చోటుచేసుకుంది.

మాధవి ఆ రోజు ఉదయంనుండీ ప్రసన్న దగ్గరికి వెళ్లలేదు. ప్రసన్నకి దూరం దూరంగా ఉంటుంది. ప్రసన్నవైపు చూసినా ఎవరినో క్రొత్తవాళ్లను చూసినట్టు చూస్తుంది. సుందరమ్మ గురించి చెప్పనే అక్కరలేదు.

మాధవికి కూడా తనవిషయం తెలిసిపోయింది అనుకుంది ప్రసన్న.

వెళ్లిన గంటకల్లా చలపతి యింటినుండి రాఘవయ్య తిరిగివచ్చేశాడు. వేలాడేసిన అతని ముఖం చూస్తే వెళ్లిన పనేమైందని అడగాల్సిన పనిలేదు. ప్రసన్నలో మొలకెత్తిన చిన్న ఆశకూడా మాడి మసైపోయింది.

ఆ పరిస్థితుల్లో ఆ ఊళ్లో ఉండడం అంత మంచిది కాదని, ముందు ముందు మాధవికి కూడా పెళ్ళికావాలసి అందుచేత ఆ ఊరు వదలి వెళ్ళిపోవడానికి నిర్ణయించుకున్నారు, రాఘవయ్య సుందరమ్మలు. రాఘవయ్య స్నేహితుడు వామనాధానికి మంచి పలుకుబడి ఉంది. అతని సహాయంతో గట్టి ప్రయత్నం చేసి విజయవాడకు బదిలీ చేయించుకున్నాడు రాఘవయ్య. వాళ్లు గుట్టు చప్పుడు కాకుండా విజయవాడ చేరుకున్నారు.

విజయవాడలో చుట్టుప్రక్కలవాళ్లకి ప్రసన్న విధవని, ఆ మధ్యనే ప్రసన్న గర్భం ధరించిన తరువాత ఆమె భర్త మరణించినట్టూ కట్టు కథలు అల్లి చెప్పారు. విజయవాడలో ప్రసన్న విధవ క్రింద చలామణీ అవుతూంది. తెల్ల చీర కట్టుకుని ఒకమూల కూర్చుని ఉండేది. ఇరవై ఏళ్ల వయసులోనే అరవై ఏళ్ల ముసలి కుండాల్సిన అనుభవం ప్రసన్నకి వచ్చింది. ఎప్పుడూ విరాగినిలా ఉండే ప్రసన్నను చూస్తుండే రాఘవయ్య సుందరమ్మ కడుపులు తరుక్కుపోయేవి. చుట్టు ప్రక్కల వాళ్ళుకూడా ప్రసన్నమీద అంతులేని సానుభూతి చూపించేవారు.

రోజు రోజుకి ప్రసన్నలోని మాంసంముద్ద రూపుదిద్దుకుని ప్రాణం పోసుకుంటుంది.

ప్రసన్నకు తన గతజీవితం అంతా ఒక కలలా అనిపిస్తుంది. తను చిన్నప్పుడు ఎంత స్వేచ్ఛగా హాయిగా గడిపింది!... ఆ రోజుల్లో బాధ్యత

అంటే ఏమిటో తెలియదు... అప్పుడు చలపతే తనకు మంచి స్నేహితుడు... తనూ చలపతీ చేలగట్లమ్మట కలిసి తిరిగేవారు. ఈతకాయలు, తాటి ముంజెలు కొట్టుకుని తినేవారు. కాలేజికి వచ్చాక కూడా చలపతే తన ఏకైక మిత్రుడు. అందరూ తనను హేళనచేసేవారే!... చలపతి మాత్రం తనను ఏమీ అనేవాడు కాదు... అటువంటి చలపతే తన జీవితం నాశనం కావటానికి కారకు డౌతాడని తనేనాడైనా ఊహించిందా ?...

కళ్యాణి మాత్రం తనకు దూరం అవుతుందని అనుకుందా ?... తను అమ్మాయిగా మారకపోయుంటే ఇప్పటి తన జీవితం స్వర్గంలో ఉండి ఉండేది! తను పూర్వజన్మలో ఏం పాపం చేసుకుందో ?... లేకపోతే ఊహించని విధంగా తను ఇలా మారిపోవడమేమిటి ?– చలపతి తనను దగా చేయడ మేమిటి !–

తను అమ్మాయిగా మారితే చాల బాగుంటుందని అందరూ అన్నారు– ఏం బావుందీ ?– తను అన్ని విధాలా పనికిరాకుండా పోయింది– బాగుండడ మంటే ఇలా తెల్లచీర కట్టుకుని ఒక మూల పడుండడమేనా ?– తను అమ్మాయిగా మారితే బావుంటుందన్న వాళ్ళు తను మారిన తరువాత తనకు దూరం అయిపోయారు– ఆఖరికి అత్తయ్యకూడా తన కొడుక్కి చేసుకోడానికి భయపడింది– అమ్మాయిగా మారితే తన అందానికి వరులు క్యూలో తన యింటిముందు నిలబడితే తను అందులో నచ్చినవాడిని వివాహం చేసుకో వచ్చని– అలా మారినా తన భవిష్యత్తు ఏమీ చెడిపోదని అనుకుంది– కాని తన ఊహలన్నీ తారుమారైనాయి. ఎందుకూ పనికిరాని పిచ్చిమొక్కకు పూసిన పూవైంది తన జీవితం తన జీవితం మళ్ళీ చిగురిస్తుందన్న ఆశ యింకలేదు.

ఇలా రాత్రింబగళ్లూ ఆలోచిస్తూ కూర్చునేది ప్రసన్న.

ప్రసన్నకు పూర్తిగా తొమ్మిది నెలలూ నిండాయి.

ఆ రోజు ఉదయం హఠాత్తుగా ప్రసన్నకు నొప్పులు ప్రారంభం అయినాయి.

"అమ్మా – నేను బ్రతకనే – ఈ బాధ భరించలేనే !"

ప్రసన్న మెలికలు తిరిగిపోతుంది. కాలేజికి బయలుదేరిన మాధవి పుస్తకాలు బల్లమీద పడేసింది. రాఘవయ్య ఆఫీసుకు శలవు పెట్టాడు

ప్రసన్నను టాక్సీలో ఆసుపత్రికి తీసుకెళ్ళారు రాఘవయ్య సుందరమ్మలు.

ప్రసన్నకు పురిటి సమయం దగ్గరికి వచ్చింది. ప్రసన్న స్పృహకోల్పో యింది. సుందరమ్మ ప్రసన్న దగ్గరే ఉంది.

గదిలోనికి కంగారుగా పరుగెత్తుతున్న నర్సుని ఆపి,

"ప్రమాదమేమీలేదు కదా నర్స్ ?" అని అడిగాడు రాఘవయ్య.

"కాన్పు చాల కష్టం అవుతుందండీ - బిడ్డ అడ్డం తిరిగింది- ఆపరేషను చేయాల్సి ఉంటుంది" అని చెప్పి పరుగున లోపలికి వెళ్ళిపోయింది.

రాఘవయ్య నవనాడులూ కృంగిపోయాయి.

ప్రసన్నను ఆపరేషను థియేటరులోనికి తీసుకువెళ్లారు.

బయట కూర్చున్న సుందరమ్మ రాఘవయ్యల గుండెలు పీచుపీచు మంటున్నాయి. అన్నాళ్లూ ప్రసన్నవల్ల తాము అనుభవించిన బాధలన్నీ వాళ్ళిద్దరూ ఆ క్షణంలో మర్చిపోయారు. ప్రసన్న ప్రాణం రక్షించమని వేయి దేవుళ్లకు మ్రొక్కుకున్నారు.

కన్నకడుపు తీపి అటువంటిది.

డాక్టరు మొహాన్ని గుడ్డతో తుడుచుకుంటూ ఆపరేషను థియేటరులోంచి బయటికి వచ్చాడు.

"ఆపరేషను అయిపోయిందా ? — బిడ్డను బయటికి తీశారా ??" అంటూ ఆత్రంగా అడిగాడు రాఘవయ్య.

"ఆ - మగపిల్లవాడు !" అన్నాడు.

"మా అమ్మాయికి మరేం వరవాలేదు కదా ?" సుందరమ్మ ప్రశ్నించింది.

"నన్ను క్షమించమ్మా !"

డాక్టరు తలవాల్చుకున్నాడు.

సుందరమ్మ ఘొల్లుమంది. రాఘవయ్య కళ్లల్లో నీళ్ళు తిరిగాయి. ఇద్దరూ ఆపరేషను థియేటరులోకి వెళ్ళారు. ప్రసన్నమీద నిండుగా తెల్లని దుప్పటి కప్పబడి ఉంది. రాఘవయ్య ప్రసన్న ముఖంమీది గుడ్డ తొలగించాడు. సుందరమ్మ భోరున ఏడుస్తూ ప్రసన్న శవంమీద పడింది.

ప్రసన్న ముఖం ఎంతో ప్రశాంతంగా ఉంది. ఆమె పెదాలమీది చిరునవ్వు తాలూకు రంగు ఇంకా వెలిసిపోలేదు. మరణించి కొద్దిసేపే అవడంవల్ల ఇంకా జీవకళ తొలగిపోలేదు.

ప్రసన్న రూపం పుణికిపుచ్చుకున్న ఆ నూతన జీవి తను పడిన లోకం అర్థంకాక, అంతా అయోమయంగా ఉండి గోలగోలగా ఏడుస్తున్నాడు.

సుందరమ్మ వణికేచేతులతో ఆ కసికందును ఎత్తుకుని "నా ప్రసన్నా ! - అంటూ గుండెలకు హత్తుకుంది.

రాఘవయ్య కళ్ళు వత్తుకున్నాడు.



# ఇదో రకం పాతిగత్నం

గుమ్మల భాస్కరరావు

ఆ రోజే ఫస్టు.

నెల మొదటిరోజు.

స్టేట్ బ్యాంక్ కిటకిట లాడిపోతూంది. కరెన్సీనోట్ల లెక్కింపు రెపరెపలతో టకటకమనే ముద్రల శబ్దాలతో కికర కాకర కబుర్లతో బాంకు నిండిపోయింది. ముఖ్యంగా గవర్నమెంటు ఆఫీసులు జీతాల చెక్కులు మార్చుకుంటున్నాయి.

బాంకు సన్‌గ్లాసు కౌంటర్ మీద- ఆఫీసు ప్యూన్ గురవయ్య సాయంతో ఐదువేలు ఒకటికి పదిసార్లు లెక్కపెట్టుకొని ఆఫీసు కాష్‌బాగ్ అనబడే నల్లటి తోలుసంచిలో భద్రంగా ఉంచి బెల్టు బిగించి — బైటపడ్డాడు హెడ్ క్లర్కు సర్వేశలింగం.

కరెంటు కొరతవల్ల ఉక్కలోంచి జన ప్రవాహంలోంచి-దాదాపు చీకట్లోంచి బైటపడ్డ సర్వేశలింగానికి బైటగాలి పైరుగాలిలా తలిగి హాయిమనిపించింది. తన హస్తగతం కాబోతున్న ఆఫీసు

కాష్ ఐమవేలు- అతని హాయికి మరో కారణమయింది.

సరాసరి బస్స్టాండుకు వెళ్ళి రూట్ బస్ అందుకుంటే సరిగ్గా అరగంట ప్రయాణం- సైట్ చేరుకోడానికి. సైట్‌లో పన్నెండుమంది సబ్ డివిజన్ సిబ్బంది తనకోసం తను తెచ్చే జీతాల కోసం ఆంగలారుస్తూ ఎదురుచూస్తూంటారు. ఫస్టు తారీఖున వాళ్ళు పని చెయ్యరు. జీతాలకోసం ఎదురు చూడ్డంతో- తీరా పుచ్చుకున్నాక పప్పు బెల్లాలా ఊరిమీద పంచిపెట్టడంతో ఆ రోజు సరి. ముప్ఫై రోజులు పడి గాపులు పడ్డవాళ్ళు ఆరోజు ఏమాత్రం ఆలస్యం భరించలేరు. అవి జీతాలు కావు. నెలరోజుల హాహాకారాలు. ఆర్తనాదాలు.

సర్వేశలింగం బాంకు దాటి వడివడిగా అడుగులేసాడు. అతని అడుగుల్లో అడుగులు వేస్తూ ప్యూన్ గురవయ్య అనుసరించాడు. 'పీడాకడు మధ్య' అనిపించింది. భద్రతకోసం రక్షణకోసం తనని గురవయ్య ఎస్కార్టు చేస్తుంటే- సర్వేశలింగానికి తనమీద నిఘాకోసం వేసిన సి ఐ డి పోలీసులా అవుపి స్తుంటాడు.

బస్స్టాండు చేరుకోవాలంటే యిలాంటి నడక యింకా పదినిమిషాలు సాగించాలి. నిజానికి రిక్షా అలవెన్సు చెరో రూపాయి ముడుతుంది. కానీ దాన్ని కడుపున కట్టి కాళ్ళకి బుద్ధిచెప్పి బస్స్టాండు చేరుకోడం అలవాటు.

బాగ్ బరువులేకపోయినా సర్వేశ లింగం ప్రతి నిమిషానికి చేతులు మార్చు కున్నాడు. నడుస్తున్నాడన్న మాటే గానీ దృష్టి గురవయ్యమీదే ఉంది

ఆఫీసు సిబ్బంది జీతాల సొమ్ము అతి లాఘవంగా కాజెయ్యాలని సర్వేశ లింగం కొంతకాలంగా కలలు కంటూ వచ్చాడు. అందుకోసం అతని ఆలో చనల్లో ఒక ప్రణాళిక సిద్ధంగా ఉంది. పరులకి తెలియనిది ప్రమాదం లేనిది అదేనని అతని నమ్మకం.

పారని ఈ పథకాన్ని ప్రతి ఫస్టుకీ జీతాలు డ్రా చేసినప్పుడల్లా పాటిస్తూ వచ్చాడు. యిన్నాళ్ళూ అది ఫలించ లేదు. ఏనాటికో ఒకనాటికి అది పారి తీరుతుందని డబ్బు తన పరమౌతుందని అతని విశ్వాసం.

ఈ పథకానికి పట్టుకొమ్మ - ఆ వూరి బస్స్టాండు. ఆంధ్రదేశంలోకెల్లా— ఛాలెంజీ దొంగతనాల బస్స్టాండుగా పేరు పొందింది. పాసింజర్లు బస్సెక్కేముందు నిండు జేబులతో ఉన్నవాళ్ళు - తీరా బస్సెక్కింతరవాత ఏనుగు ఊదిన వెలగపళ్ళలా ఖాళీ అయికూర్చుంటారు. అంత పకడ్బందీగా జరుగుతాయి దొంగతనాలు.

తనెరిగిన కేసుల్లో ఒకావిడ వడ్డాణం చిత్రంగా కత్తిరించబడింది. చంకలో

ఉన్న పపిపాప సిగ్గు బిళ్ళ స్థానభ్రంశమయింది. మరొకాయన బనీను లోపలి జేబులో ఉంచిన మూడువేల కాష్ హుష్‌కాకీ అయిపోయింది. ఉంగరాలు, వాచీలు, గాజులు, మంగళసూత్రాలు చంద్రహారాలు, చేతిసంచులు సూట్‌కేసులు — ఎన్నో - ఎన్నెన్నో-రెక్కలొచ్చి ఎగిరిపోయాయి

తన ప్లాను ప్రకారం గురవయ్యను ఏమార్చి దార్లో కాష్‌బాగ్‌లో నోట్లకట్టలు తీసి పాంటుజేబులో కుక్కుతాడు. చంకలో ఖాళీ బాగ్ ఉంటుంది. గురవయ్య దృష్టిలో అది ఖాళీదికాదు. కాష్ ఉన్న బాగ్.

బస్టాండ్లో-బస్సు వచ్చిరావడంతోటే దానికోసం తనూ, గురవయ్యా ఎగబడతారు మామూలుగా జనం తేనెటీగల్లా మునురుతారు. ఒకర్నొకరు కుమ్ముకుంటారు. తోసుకుంటారు తొక్కుకుంటారు.

ఈ సందట్లో మామూలుగా జరగబోయే దొంగతనాల్లో తన కాష్ బాగ్ ఒకటి. ఖాళీ బాగ్ కృష్ణార్పణం అవుతుంది. తను దిక్కులు పిక్కటిల్లేలా కేకలువేస్తాడు. 'బాగ్ బాబోయ్ నా కాష్ బాగ్. ఆఫీసు డబ్బు ఐదువేలు బాబోయ్' అని గొంతు చించుకుంటాడు.

యింకెక్కడ కాష్ బాగ్? అది కొట్టేసినవాడు సామాన్యుడా! ఘటికుడు. మహామేధావి. ఒంటిమీద స్పృహ ఉన్న స్త్రీ వడ్డాణం కొట్టినవాడూ చంటిపిల్ల సిగ్గుబిళ్ళ ఎగరేసుకుపోయినవాడూ నిండు చూలాల్లాంటి జేబుల్ని రహస్యంగా తొలిచి అబార్షన్ చేయించగలవాడూ - అపార ప్రజ్ఞాశాలి ఆ కాష్‌బాగ్ పట్టుకు వేళ్ళడతాడా? అంత తెలివి తక్కువవాడా? జనం గోలచేసేలోగా చేతులు మార్చి తీసుకుపోడూ?... పాపం బీద వెధవ! అది ఖాళీ బాగ్ అని తెలిసి షాక్ తినడానికి కొంత టైంపడుతుంది. అదలా ఉంచితే- పదిలంగా పాంటుజేబులో దాచుకున్న నోట్లకట్టలు తన సొంతమవుతాయి. గురవయ్య—బస్టాండులో జనం సాయంతో సానుభూతి వాక్యాలతో సాక్ష్యాధారాలతో ఎటూ తేలని పోలీసు కేసై తనకి కొంతంత రక్షణ కల్పిస్తుంది.

కొంచెం లోతుకి పోతే ఒక అనుమానం కలుక్కుమనేది ఒకవేళ పోలీసులు తనని సోదాచేస్తే - సొమ్ము పాంటు జేబులో దొరికితే - తన గతి? అదా? అసలు ఖాళీ కాష్ బాగ్ దొంగతనం జరగాలే గానీ - డబ్బు ఏదో విధంగా గస్మిన్ చెయ్యవచ్చు. ఇదీ పథకం

కాని ఏవిటి ప్రయోజనం?

తు చ. తప్పకుండా పది నెంట్నుంచి పాటిస్తూ వచ్చాడు. దొంగ వెధవలు! ఒక్కడు - ఒక్కడు కూడా




తన బాగ్ జోలికి రావడంలేదు అక్కడికీ బస్‌కోసం వేచి ఉన్నంత సేపూ బాగ్‌లో ఎంతో డబ్బున్నట్టూ దాన్ని ప్రాణప్రదంగా చూసుకుంటున్నట్టు ప్రవర్తిస్తున్నాడు వరైనా ఖాతా ఖాసీలోకి ఒంపితే మాటల్లో బాగ్‌లో కాష్ ఉన్నట్టు. అది పోతే తన ఉద్యోగం ఖాళీ అని అందరికీ వినబడేలా చెబుతూ వచ్చాడు.

"సార్"

తక్కున ఆగిపోయాడు సర్వేశలింగం

వెనక గురవయ్య నోట్లో వేలుంచుకొని 'చిన్న విన్నపం' అన్న భావంతో నిలబడ్డాడు

"ఏమిటోయ్ "

"కొత్తపేటలో మా బామ్మర్ది కలుసుకొస్తా సార్."

సర్వేశలింగానికి ఒళ్ళు పులకించింది. దాన్ని కప్పిపుచ్చుకొని "నిన్ను నా కూడా పంపేది ఎందుకు ? అటూ యిటూ తిరిగి నీ పనులు చూసుకోడానికా ? ఈ డబ్బు పోతే నా దెంత బాధ్యతో నీదీ అంతే. తెలుసా ?" అన్నాడు.

"నాకు తెలీదా సార్ ? ఒకేళ మీ యంతట మీరు మింగేసినా - నేనూ ములుగుతాకద సార్" అన్నాడు నవ్వుతూ.

ఓరి వీడి తెలివి తూట్లుపడా. ఎంత మాట అనేశాడు వెర్రిబాగుల వెధవ.

"సరి సరి. మరి త్వరగా వచ్చెయ్యాలి సుమా ఆలస్యం అయితే బస్సు దాటిపోతూంది."

"ఎంత సార్ ? నిమిషాల్లో వస్తా

తవరు స్టాండింగ్‌లో ఉండండి." అని అడ్డదారి అందుకున్నాడు గురవయ్య.

చక్కటి రిలీఫ్ చిక్కి సర్వేశ లింగం జేబురుమాలుతో ఒక రౌండు మొహం తుడుచుకున్నాడు. అటు యిటు చూసి హుషారుగా 'ఏయ్ రిక్షా' అని అరిచాడు అందుబాటులో ఉన్న రిక్షా ఒకటి ఆత్రంగా ముందుకొచ్చింది. ఎక్కి 'బస్‌స్టాండుకి పోనియ్' అని ధీమాగా వెనక్కి వాలాడు. రిక్షా కదిలింది.

కాష్ బాగ్ విప్పి నోట్ల కట్టల్ని పరి శీలించాడు. తళతళలాడే సరికొత్త నోట్లు. అపుడే వెచ్చగా ప్రెస్‌లోంచి వెలువడ్డాయనిపించే నోట్లు.

అంతా పోగుజేసి ఐదువేలు. ఈ రోజుల్లో యిదో పెద్ద మొత్తం కాదు - చెప్పుకోతగ్గ దొంగతనం కాదు. కీలక మైనవాళ్ళు కుంభస్థలాలు కొడ్తున్న ఈ కాలంలో లక్షలు లక్షలు దోచేసి దాచేసుకుంటూ దీపం ఉండగానే యిల్లు చక్కపెట్టుకుంటున్న వాతావరణంలో- తను ఏ అవకాశాలు లేక వెలవెల పోతూ-అనుభవించేవాళ్ళని తల్చుకొని కడుపు మాడిపోతూన్న మామూలు హెడ్ గుమాస్తా.

ఆఫీసు ఎకౌంట్లలో దొంగరాతలకి విశృంఖలంగా జరిగే శుభకోణాలకి - తను గుటకలు మింగుతూ పాస్ ఆర్డర్లు వేస్తూ సంతకాలకి పుటప్‌చేస్తూ ఎంత సొమ్ము ఆఫీసరు జేబు చేరుతుందో అంచనా వేస్తుంటే ... ఒళ్ళు జలదరి స్తుంది. ఇదీ ఒక జీవితమేనా అని పిస్తుంది-తన స్థితి గుర్తొచ్చి.

కంట్రాక్టర్ల కొలువులో - పై అధికార్ల అండదండలతో - పైపై అధికార్ల ఆశీ ర్వచనాలతో ఆఫీసర్ జతిపే బాగో తాలు, జేబులు నింపుకొనే వేషాలు - విందులు, వినోదాలు, విలాసాలు - అనుభవం మాట అటుంచి తన ఊహ కందనివి. పాయసం పోసిన పళ్లెంలాంటి డిపార్టుమెంటులో - తనది కొంగ పాత్ర. పాయసం అందదు. అందుకోనేవాళ్లని చూసి గుండెలు బాదుకుని 'లంబోదరా! మాలాంటి వాళ్ళకి జీవితంలో ఛాన్సులే ఉండవా. ఒక్కరోజైనా అటువంటి వైభవం ప్రసాదించవా' అని బోరుమని విలపించేవాడు.

ఆ తిళ్ళు - తాగుళ్ళు - తిరుగుళ్ళు తుళ్ళింతలు - చూస్తూ సర్వేశలింగానికి అనిపించేది-ఒక ఫైన్ మార్నింగ్ ఆఫీసు సొమ్ము కాజేసి జీవితంలో ఒకసారి ఝుఃఝుం చెయ్యాలని. డబ్బులు పుచ్చు కొని పరారీ అవ్వడం తన ఉద్దేశ్యం కాదు. అది ఉద్యోగానికే ఎసరు పెడు తుంది. అందుకే...ఈ ప్రణాళిక...

సర్వేశలింగం నోట్లకట్టలమీద జేబు రుమాలుకప్పి ఎవరూ చూడకుండా పాంటు జేబులో కుక్కుకున్నాడు. మళ్లీ మామూలుగా బాగ్ బిగించేసాడు.



ఒక్క క్షణం కళ్ళుమూసుకొని యిష్ట దైవమైన ఒక 'బాబా'ని ఆత్మస్థైర్యం ప్రసాదించమని వేడుకున్నాడు.

రిక్షా బస్‌స్టాండు చేరింది. జేబులోంచి స్త్వరున ఒక రూపాయి తీసి రిక్షావాడి మొహంమీద పారేసి 'మిగిలిన చిల్లర యివ్వనక్కర్లేదే' దన్నట్లు తలఊపి వెళ్ళాడు. రిక్షావాడు రూపాయి కళ్ళకద్దుకొని వెళ్ళిపోయాడు.

బస్‌స్టాండు ఎక్కడ్నలేని జనంతో ఒకటే రొదగా ఉంది. 'వీళ్ళంతా పాసింజర్లే ?' అని ఆశ్చర్యపోయి 'కాదు, సగంమంది దొంగలు' అని సరిపెట్టుకున్నాడు. ఖాళీ కాష్ బాగ్ తస్కరించి తనకో కొత్త వెలుగు ప్రసాదించే మహానుభావుడున్నాడు వీళ్ళలో' అని భావించాడు.

సైట్‌లో ఆఫీసు సిబ్బంది జీతాల మీద మమకారాలు పెంచుకొని ఎదురు చూస్తున్న దృశ్యం అతని కళ్లముందు

కదిలింది. యింకెక్కడి జీతాలు. ఈ నెలకి అందుకో నోచుకోలేని వాళ్లు.

అరగంటలో గురవయ్య తయారయ్యాడు తన బావమరదితో. "ఈరేరా అయ్యగారు. నమస్కారం చెయ్" అన్నాడు. అతను సర్వేశలింగానికి వంకర టింకర పళ్లతో మర్యాదపూర్వకమైన నవ్వు వెలిబుచ్చి దణ్ణం పెట్టాడు. సర్వేశలింగం దర్జాగా నమస్కారం అందుకుని "ఏమయ్యో ఏంచేస్తున్నావ్" అన్నాడు.

"యదవ. గాలికి తిరుగుతున్నాడండి. అందుకే మీ దగ్గరకి తీసుకొచ్చానండి. ఎలాగైనాసరే తమరు పెద్దయ్యగారికి సెప్పి సైట్లో పనేయించాలి సార్. మీ పేరు సెప్పుకుని బతుకుతాడు," అన్నాడు గురవయ్య.

" అదెంతమాట ! చూద్దాంలే " అన్నాడు 'అదెంత పని' అనలేని సర్వేశలింగం.

ఉన్నట్టుండి బస్సు రివ్వుమని వచ్చి స్టాండులో ఆగడంతో సంభాషణ తెగిపోయింది. సన్నివేశం మారిపోయింది.

జనం హోలోమని ఎగబడి — ఊరు విడిచి భయంతో పారిపోతున్నవాళ్లలా పరుగెత్తి బస్సుద్వారానికి కద్దంపడ్డారు. రెట్టింపయిన ఉత్సాహంతో సర్వేశలింగం బాగ్ పుచ్చుకొని జనంలో ఉరకబడిపోయాడు. 'దబ్బు జాగర్త సార్' అని హెచ్చరించి గురవయ్య కూడా రంగంలోకి దిగాడు. జనప్రవాహంలో ప్రతివాడు మునక ఈతకొట్టాలని ప్రయత్నిస్తున్నవాడే అంటే జనంలో మునిగి బస్సులో తేలాలని ప్రతి ఒక్కడి వాంఛ. క్యూలు నచ్చని జనం తొక్కిసలాటలో ఎంతో కొంత ఆనందం అనుభవిస్తూ కుమ్ముకుంటున్నారు. బలవంతులు బస్సులోకి దొమ్ముకుపోతూంటే అర్భకులు చెరకు పిప్పిలా వెలుపలికి విసిరివెయ్యబడుతున్నారు.

చివరికి...

సర్వేశలింగం బస్సులో ప్రవేశించగలిగాడు.

కానీ ఎప్పటి మాదిరిగానే దురదృష్టం వెక్కిరించింది. నిర్లక్ష్యంగా వదులుగా పట్టుకున్నా కాష్ బాగ్ బంకలా అంటుకుని చేతుల్లో ఉంది.

వెనగ్గా ఎవరివో కేకలు.

"ఏమయ్యోయ్. నీ పాంటు జేబు చూసుకో. ఎవడో కోసేసాడు."

సర్వేశలింగం గుండెల్లో అణు ప్రేలుడు జరిగింది.

"అబ్బ ఏం తెలివిగా కోసాడండీ పాపం ఎంత పోయిందో ?"

అప్రయత్నంగా పాంటుజేబులోకి చెయ్యిపోనిస్తే... బైటకి తన్నుకొచ్చింది. పొడుగ్గా చీరేసిన వైనం బయవేలు గల్లంతు.




"యింకా నయం. జేబుకొట్టి ఊరుకున్నాడు. చేతిలో కాష్ బాగ్ పోలేదు. అదృష్టం" ఎవరివో సానుభూతి వచనాలు.

'జేబు దొంగతనానికి కాష్ బాగ్‌లో డబ్బు గల్లంతుకీ సంబంధం ఏవిటి ? బాగ్‌లో సొమ్ము జేబులోకి రావాల్సిన అవసరం ఏవిటి ? రకరకాల ఆరాలు ! సస్పెన్షన్ ... తరువాత రికవరీ...లేక ఉద్యోగానికి ఉద్వాసన !...' సర్వేశలింగం యిక ఆలోచించలేక కేకలు వెయ్యక - వెయ్యలేక కక్కలేక మింగలేక కుప్పలా కూలిపోయాడు

గబుక్కున కూలిపోకుండా పట్టుకుని సమయానికి ఆదుకున్నాడు- ఐదువేలూ బావమరిది ద్వారా దాటవేయించిన ఆఫీసుప్యూన్ గురవయ్య-సర్వేశలింగం నాడి కనిపెట్టి అవకాశంకోసం ఎదురు చూస్తూన్న గురవయ్య,







# మేం చేసిన తప్పు మీరూ చేస్తారా?

అవసరాల రామకృష్ణారావు

(గత సంచిక తరువాయి)

## 11

మర్నాటి సాయంకాలం అతని ఆఫీసుకి వచ్చి, కిరణ్‌తో అన్ని విషయాలూ డిస్కస్‌చేసి ఆఖర్ని యిలా అంది యాలిన్.

"ఈ విషయాన్ని యిన్నేళ్ళుగా ఆలోచిస్తూ, యిదే ఆశతో బతుకుతూ, యిప్పటికి నా లీగల్ పొజిషన్ నాకే క్లియర్‌గా లేకపోవడం చాలా దురదృష్ట కరంగా తోస్తోంది కిరణ్! తలుచుకున్నకొద్దీ మరింత అట్టడుగుకు వెళిపోతున్నట్టు తోచి రాత్రి రాత్రంతా అలా మెలుకువగానే ఉండిపోయాను."

"ఎంతో సెల్ఫ్‌హెల్డ్ అనుకున్నాను, మీరే ఇలా హెల్ప్‌లెస్‌గా ఫీలయితే ఎలా యాలిన్? ఒక్క మనిషి – ఎవరి నుంచీ ఎటువంటి సాయమూ ఆశించకుండా నిగ్రహించుకు వచ్చారు ఇన్నేళ్ల పాటు. మీరే ఇలా డీలాపడిపోతే ఎలా?"

"ఒక్క ముక్క చెప్పండి చాలు, నా వేణుగోపాల్ నాకు దక్కుతాడంటావా?"

'తప్పకుండా ప్రయత్నం చేద్దాం. ఇన్నాళ్లు ఓపిక పట్టారు ఇప్పుడు తొందరపడిపోతారా?'

'పోనీ మరో సంగతి చెప్పండి. ఆ రాఘవయ్య ఎలాంటివాడు?"

"అతన్ని ఇష్టమైతే పెట్టుకుందాం. లేకపోతే మానేద్దాము, అతనుఎలాంటివాడైతే మనకెందుకు? మనమేం చెయ్యగలమో

ఆలోచిద్దాం. ఫ్లాస్కులో వేడి కాఫీ ఉంది తీసుకు తాగండి కొంచెం విశ్రాంతి తీసుకోండి. తర్వాత నేను కొన్ని విషయాలడుగుతాను. జ్ఞాపకం తెచ్చుకొని జవాబు చెప్పడానికి ట్రై చెయ్యండి."

అతని మాటా మర్యాదా చూసి చాల హోప్ఫుల్‌గా ఫీలయ్యింది యాలిన్. వేడి కాఫీ తాగి ఫేన్‌కింద ఓ రెండు నిమిషాలు కళ్ళుమూసుకుని కూచున్నాక ఆమె కొంచెం రిఫ్రెష్డ్‌గా ఫీలయ్యింది.

"మీరు మొట్టమొదట మదన్‌ని కలుసుకున్న సాయంకాలం గుర్తు తెచ్చుకోండి. మీరిద్దరూ కారులో ఎక్కడం మీ నైట్ వాచరు చూశాడని మీ రన్నట్టు గుర్తు అవునా? అతను సాక్ష్యమివ్వగలడా?"

"వాడా, పైకిజెర్రిపోతులా వుంటాడు గాని ఆ భాస్కర్ విలియమ్సు గాడు ఉత్తి వెర్రి వెధవండీ...ఆ రోజు ఓ అర గంట మెయిన్‌గేటు వదిలిపెట్టి, పెళ్ళం జబ్బు మనిషికదూ, కేకేస్తే సర్వెంట్ క్వార్టర్స్‌కి వెళ్ళినట్టున్నాడు. అలా డ్యూటీ వదిలి వెళ్ళటంతప్పు. ఆ సంగతి తెలిస్తే మేట్రన్ ఊరుకునేదా? అది సాక్ష్యంగా ఇస్తే వాడి ఉద్యోగం ఉంటుందా? అదీగాక వాడు దూరంనుంచి నేను మరొక మగాడితో కారు ఎక్కడం చూశాడు. ఆ రెండో మనిషి ఎవరని వాడు సాక్ష్యమిస్తాడు! అయినా వాడి ఉద్యోగం ఊడిపోయే సాక్ష్యం, అది ఎంత ముఖ్యమైనదైతే మాత్రం నే నెలా అంగీకరించగలను!"

"ఈ మధ్య రెండుసార్లు నేను మీ ఆర్ఫనేజ్‌కి వెళ్లొచ్చా, తెలుసా?" యాలిన్ ఆశ్చర్యంగా చూస్తుండగా కిరణ్ చెప్పుకొచ్చాడు.

ఆమె తరపున తనంతట తానే-ముందుగా ఎంగేజ్‌మెంట్ ఫిక్స్ చేసుకొని మార్గరెట్‌ని వెళ్ళి కలుసుకున్నాడు కిరణ్.

యాలిన్ అప్పుడని తెలిశాక, అన్నీ విన్నాక ఆమె అతన్ని చాల ఆదరించింది. వంచనకు గురి అయినా మంచివాళ్ల పంచన చేరినందుకు ఆమె ఆ ప్రభువుకు కృతజ్ఞతలు అందజేసింది.

"పాపం ఎంతో ఉత్తమురాలు. అనవసరంగా గోతిలోకి దిగింది," అని కళ్లు నీళ్ళు పెట్టుకుందట

"మెట్రిక్ పాసవగానే అక్కడివాళ్లకి ఉద్యోగంకూడా ఇప్పించే ప్రయత్నాలు చేస్తారటగా? ఏ మాత్రం అవకాశముంటున్నా క్రైస్తవ సంస్థలన్నీ వీళ్ళని తీసుకుంటాయి. ముందు ఉద్యోగంలోనూ, తర్వాత సంసార జీవితంలోనూ ఎంతో మంది స్థిరపడిపోయారు కూడాను..."

ఈ విషయాలన్నీ చెప్పి -

"మొదట్నుంచీ చెడు ప్రవర్తన ఉన్నవాళ్ళని ఆ దేవుడయినా రక్షించలేడు. మేమెంత కట్టుబాట్లలో ఉంచాలని ప్రయత్నించినా స్వయంకృత

దోషాలవల్ల వ్యసనాలకి లోనై బంగారం లాంటి జీవితాలని చేజేతులా బూడిద పాలు చేసుకున్న అమ్మాయిలు కూడా లేకపోలేదు. అలాంటివాళ్లు ఏ లాడ్జింగ్ హౌసెస్‌లోనో స్థిరపడి, గుర్తించలేనంతగా ఉబ్బిపడి ఎప్పుడైనా అరుదుగా కనబడుతూ వుంటారు. అయ్యో వాళ్ల తల్లీ దండ్రీ బతికుండి శ్రద్ధ తీసుకుని పెంచి పెద్దచేసివుంటే ఇలా తయారయ్యే వారు కాదేమో! మా పెంపకంలోనే ఏదేని లోపం ఉందేమో!- అని మనస్సు చివుక్కుమంటుంది. వాళ్ళ అవస్థ చూస్తే మళ్ళీ ఒక్కొక్కప్పుడనిపిస్తుంది ఎవరింట్లో పెరిగినా, ఏ సంస్థ తీర్చిదిద్దినా ఏ వ్యక్తికి ఆ వ్యక్తి స్వయంగా ఎదిగి తన మటుకు తను మంచీ చెడూ తెలుసుకో గలగాలి. ఒక ఇంట్లో ఒక సంస్థ ఆవరణలో ఎవరైనా ఎన్నాళ్లు ఉండగలరు బయటి ప్రపంచం ఎలావుందో తెలుసుకోవాలి. దాని మెరమెచ్చుల ఉచ్చులలో చిక్కుకోకూడదు.

ఇలా కొంతసేపు మాట్లాడిన తర్వాత మార్గరెట్ అంది. 'పోసీ అలాంటి నీచపు లక్షణాలు ఉన్నాయేమో అనుకుంటే వెతికినా వెకిలితనం కనిపించేది కాదండీ ఆ అమ్మాయిలో, తన జీవితమంతటి లోను దురదృష్టపు రాత్రి అని చెప్పుకో వలసిన ఆ సమయంలో కూడా చివరిదాక నాతో మాట్లాడుతూ ఉన్నట్టె గుర్తు. ఎప్పుడు వెళ్ళిందో..,ఎప్పుడు, కారులో కూచుందో...కడుపున పుట్టిన బిడ్డనైనా ఉంచుకోనిస్తే దాన్ని చూసైనా బతుకును

మార్గరెట్ మాటలు కిరణ్ ద్వారా విని యాలిస్ అంది కళ్లు ఒత్తుకుంటూ "ఎన్నేళ్లు గడిచినా, నిన్నా మొన్నా జరిగినట్టు ఎంత గుర్తుపెట్టుకున్నారు పెద్ద దొరసానమ్మగారు! నేనే స్వార్థపరురాల్ని, అందర్నీ మరచిపోయాను. నే నొక్కర్తెనే ఏదో ఉద్ధరించగల నను కొని అహంకరించాను." తర్వాత తను అన్నది, కిరణ్ చెప్పాడు.

"అభిమానంతో ఇన్నిరక్షణలు మీరు కల్పించినా ఆమె అంత మోసానికి గురి కావడం కేవలం దురదృష్టం. ఒంటరిగా దైన్యమైన జీవితం గడుపుతోంది. ఇప్పుడు తనకు ఆ బిడ్డను తిరిగి అప్పజెప్పించేస్తే అంతకన్న ఆ జీవికి మనం ఇవ్వగల సుఖశాంతులుండవని మీరే అంటున్నారు. ఇంతగా ఇప్పటికీ ఆమెని ప్రేమిస్తున్న మీరు తిరిగి ఆమెలో జీవి తేచ్చ నెలకొల్పాలంటే ఏమైనా చేయగలరని ఆశించవచ్చునా!"

"చెప్పండి, నాకు వీలైనది తప్పకుండా చేస్తాను. ఏది కావాలి? ఏదైనా ధనసహాయమా?"

"నో....నో...అదేంకాదు. అలాంటిది ఆమె కోరిఉంటే ఎప్పుడో మేము చేసి ఉండేవాళ్ళం. చాలా ఆత్మాభిమానం గల వ్యక్తి యాలిస్. కోర్టు ఖర్చులు కనీస అవసరాల కయినా ఉంటాయని

ఏళ్ళతరబడి కష్టపడి అయిదువేలు పోగు చేసిందంటే ఆమె పట్టుదల ఎలాంటిదో..."

"అయిదు వేలే ? ! "

"ఏమనుకున్నారు మరి తను కూడ బెట్టిన దాన్తోనే తన కొడుకుని తెచ్చుకోవాలని ఆమె నిశ్చయం.

"అయితే నేను చేయగల సాయం ఏమిటంటారు ?"

కిరణ్ ఒక్కనిమిషం ఆగి మొదలు పెట్టాడు.

"మొట్టమొదట్నుంచీ యాలిస్ సాట్ లెన్ కాంటక్ట్ మీకు తెలుసు. ఎప్పటి కప్పుడు అన్నీ పంక్చ్యువల్‌గా రికార్డుచేసే సంస్థ మీది. యాలిస్ పేరున రికార్డు ఒక టుంది కదా, అందులో ఎన్ని బ్లాకు మార్క్సు పడ్డాయో కొంచెం చూసి చెబుతారా ?"

"ఒక్కటీ పడలేదని నాకు స్పష్టంగా తెలుసుగనక వెరిఫై చెయ్యడం అనవసరం. తనదన్నది ఏమీ మిగుల్చుకోక ఎవరికెప్పుడేం సహాయం చేద్దామా అని ఎప్పుడూ ఎదురుచూసే ఆ పెద్దకళ్ళ అమ్మాయి సత్ప్రవర్తన ఇక్కడ ప్రతి ఒక్కరి మనసులోను ఏనాడో రికార్డు అయిపోయింది. ఈ శరణాలయం ఆవరణలో ఏ చిన్న పిచిక నడిగినా ఏ గడ్డి పరక నడిగినా అమాయకమైన ఆమె నవ్వు ప్రతిధ్వనించి చూపగలదు.

"అంత ఉత్తమురాలు గనుకనే మనమందరం కలిసి తిరిగి ఎలాగైనా ఆ స్వచ్ఛమైన నవ్వుని పునః ప్రతిష్ఠాపించవలసి వుంది. ఈ కొద్దిఏళ్ల పరిచయంతోనే మేమెంతో ప్రభావితుల మయ్యాం చిన్నప్పట్నుంచీ పెంచి పెద్ద చేసిన ఇన్నాళ్ళ మీ బాంధవ్యం అదెంత బలీయమైనదో మేమే ఎవరైనా ఎలా చెప్పగలరు !" మార్గరెట్ కళ్లజోడు ఎడంచేత్తో పట్టుకుని రుమాలుతో కళ్ళు తుడుచుకుంది.

"నా గురించి మీకు ముందే చెప్పేగా ... ఎప్పట్నుంచో ఎంతో యింట్రస్టుతో ఈ కేసు స్టడీ చేస్తున్నాను లీగల్ కాంప్లికేషన్స్ అన్నీ దృష్టిలో పెట్టుకునే మీతో మాట్లాడ్డానికి వచ్చాను. ఆమె తన బాబుని తిరిగి తను తెచ్చుకోవాలంటే మీ సాక్ష్యం ఒక్కటే ముఖ్యాధారం. ఆమెను మళ్ళీ మనిషిని చెయ్యాలంటే మీ సహాయం ఒక్కటే అతి ముఖ్యం...ఏమంటారు ?"

మార్గరెట్ ఏమీ అనలేదు. "చెప్పండి" అన్నట్టు సంజ్ఞ చేసింది. "శరణాలయం మొత్తంమీద, యాలిస్ మాట అలా ఉంచండి. మదన్‌ని చూసిన వాళ్ళు వాచ్‌మెన్ ఖాన్కర్ విలియమ్స్ కాక మీరొక్కరే దీనికంతటికీ మీరే పెద్ద. ఎప్పటికప్పుడు యాలిస్ ఏమీ దాచకుండా మీతో చెప్పింది. ఆనాడు మీ సంస్థ యానివర్సరీ ఫంక్షన్ జరుగుతున్ననాడు, యాలిస్‌ని మదన్‌తో

పంపేసే ఏర్పాటుచేసింది మీరే. యాలిన్‌ని కారెక్కించేముందు - వాచ్ మెన్ సమక్షంలోనే అనుకుంటాను - మదన్‌తో చెప్పవలసిన నాలుగు ముక్కలూ గట్టిగా చెప్పగలిగింది కూడా మీరే, అవునా, కాదా?"

"అయితే ?"

"మీకు తెలిసిన యీ నిజాలు - మీకు తెలిసిన ఓ అమాయకురాల్ని రక్షించడంకోసం - కోర్టులో చెప్పడానికి మీకే మభ్యంతరం ?" యాలిన్ కిరణ్ చేతిని అభిమానంతో పట్టుకుంది.

"నేనంటే మీకెంత అభిమానం ! నా మనసులో ఉన్నది - నేను మనస్సా కోరుకున్నది — నేను తిరస్కారభావంతో చూసినా — మీకు మీరై నా పట్ల పనిచేస్తున్నారు. నేను మీకే మౌతాను !"

"ఎప్పటికైనా మా ప్రభూని పెళ్లాడి వదిన కాగలరనే ఆశే నాచేత ఇంత పని చేయించింది!" ఆమె వెంటనే అతని చేతిని వదిలేసింది. ఉన్నట్టుండి ఆమె మొహం సీరియస్‌గా మారిపోయింది. అంతవరకు సలసల మరుగుతున్న పాలలో ఒక్క ఉప్పురాయి పడ్డట్టు ఆమె మనస్సు విరిగిపోయింది. మళ్ళీ మామూలుస్థితికి రాడానికి ఆమె చాలా ప్రయత్నించవలసివచ్చింది అంతవరకు వేచి ఉన్నాడు కిరణ్.

"కిరణ్ ! పిచ్చి, ప్రేమలోపడి మీ స్నేహితుడికయితే మతిపోయి ఉండొచ్చు. ఇదెంత అసందర్భమో మీకేం బోధపడ్డం లేదా ? శోకంపోకడ మీరూ గమనిస్తున్నారు. కేసులు నడుపుతున్నారు. కొంత అనుభవం గడించారు, ఇది జరగని విషయమని ఆమాత్రమూ మీకు తట్టలేదా ? ప్రభూ అయితే వ్యామోహాంధకారంలో పడి ఉండొచ్చు..."

"ఆగండి అక్కడికి...మిమ్మల్నెలా అర్థంచేసుకోనాలో ఇప్పటికీ బోధపడి చావడంలేదు. అయితే వాడిచ్చిన ఉత్తరం మీరు చదవనే లేదన్నమాట !"

"చదివానే !"

"చదివి కూడా వ్యామోహాంధకారం అని మీలాంటివారంటే నేనింకేం చెప్పగలను ! వాడి మనస్సంతా అందులో పెట్టేడు. ప్రతీ ముక్కా నాకు చదివి వినిపించాడు. ఇంక అతని గురించి నేను మీకేమైనా చెప్పడం కేవలం చర్విత చర్వణం. అయినా ఒకే ఒక ముక్క చెప్పకుండా ఉండలేను. మీకు తోచిన సందేహాలే నేనూ వెలిబుచ్చితే వాడేమన్నాడో కాస్త వినండి, చాలు."

ఆ విషయం చెప్పుకొచ్చేడు కిరణ్.

"ఒరే ప్రభూ ! ఆవిడ గురించి అంతా తెలిశాక కూడా ఇంకా నీ అభిప్రాయం మార్చుకోకపోడం చాలా ఆశ్చర్యంగా ఉందిరా ! ఈ సంఘంలో నువ్వూ, నేనే కాదురా ఉన్నది, పీళ్ళం




దరికీ జవాబు చెప్పుకోవలసిన బాధ్యత ఉంది."

"ఓరి కిరణ్! మళ్ళీ లా ప్యాసయి ప్రాక్టీసు వెలిగిస్తున్నావ్, ఇంత చిన్న విషయమే నీకూ తెలీదూ! శీతాకాలంలో కట్టుకునే బట్టలు మరిమూడునెలలు అయే సరికే వెగటు అయిపోతాయి. టీ సీ. నాటి భావాలు ఇప్పుడెందుకురా ? ఏం మీ పెద్దన్నయ్య మొదటి భార్యపోతే నలుగురు పిల్లలతో నెలయినా దాటకుండా మళ్ళీ రెండో పెళ్ళి చేసుకోలేదూ, అప్పు డిచ్చి చూడకపోయారా నువ్వూ, మీ సంఘమూ ఈ సలహా ? ప్రసవ వేదన ఒకటేకాకుండా శీలమనేది కూడా ఆడ దానికే పరిమితమా ఏమిట్రా! పోతులా పోతుటీగలా ఇన్నేళ్ళయి తిరుగు తున్నాను. ఇంతవరకూ ఏ ఆడదాని తోటీ నిద్రచెయ్యలేదని నా మొహాన్ని మాత్రం ఎక్కడుందిరా ముద్ర!"

స్త్రీలోకంపట్ల ప్రభుదాసు సాను భూతికి జోహారులర్పించింది యాలిస్. ఆమె కళ్ళు స్రవించాయి.

"ఒక్కమాట చెబుతానన్నాను కదూ, ఇదే. మీరే ఆలోచించుకుని ఓ నిర్ణయానికి రండి. ఒకరివల్ల మీ జీవితం నాశనమయిందని మీరు భావిస్తున్నారు. మీ వల్ల మరొకరి జీవితం నాశనం కాకుండా చూసుకోండి, అంతే చాలు!"

ఆ మాట సూదిగా గుండెలకు గుచ్చుకుంది ఆమెకి. ఎంతసేపు ఆలో చించినా ఏం జవాబు చెప్పాలో ఆమెకి తోచలేదు. టాపిక్ మార్చేయడంతప్ప ఆమెకి గత్యంతరం కనబడలేదు.

"పెద్ద దొరసానమ్మగారు ప్రేమ స్వరూపిణి. ఆమె స్వయంగా రంగం లోకి దిగితే యిక నాకు అపజయ మేముంది! ఇంతకీ మీకీ సంగతి అడగ్గానే ఆమె ఏమన్నారు - ఇంకే

మంటారు, నాకోసం ఏమైనా చేస్తారు... ఎక్కడికైనా వస్తారు!"

"నేనింతగా ప్రభు గురించి చెప్పినా - అలాగే, ఆలోచిస్తాను - అనేనా మీరు నాకు మాట ఇవ్వలేదు. ఇది గుర్తించలేనంత గుడ్డివాణ్ణి అని మాత్రం అనుకోకండి - తిరిగి మీ విషయంలోకే జొరబడ్డారు. కాని య్యండి. ఎవరి చేష్టల ఫలితాలు వారు అనుభవించవలసిందే - ఒక్కటిమాత్రం మిమ్మల్ని ముందుగా హెచ్చరించి చెప్పడం అవసరం. ఈ విషయంలో కూడా మీ అంచనా పూర్తిగా పొరపాటు."

"ఏ విషయంలో, పెద్దదొరసానమ్మ గారి విషయంలోనా ?"

"అవును !"

యాలిస్ ముందుకు పడిపోబోయి, బల్లను పట్టుకుంది.

"ఉద్రేకపడకండి. జరిగింది సరిగా వినండి. మరోసారి కాఫీ తాగుతారా ?"

ఆమె వద్దని తలఊపింది. అతను మాత్రం మరో అరకప్పుతాగి, చెప్పేడు.

"యాలిస్, మదన్‌ల సంబంధం గురించి మీకు తెలిసిన విషయాల్ని కోర్టులో చెప్పడానికి మీకేం అభ్యంతరం లేదు కదూ మార్గరెట్ ?"

"అభ్యంతరమే !"

"అదేం ?"

"అందువల్ల ఎవరికేం లాభం ?"

"అదేమిటి, ఆమె కొడుకుని పొంద డానికి అదొక్కటేకదా ఆధారం !"

"ఇంకెక్కడి కొడుకు ! ఆమె సంగ తులు ఎప్పటికప్పుడు నేను కను క్కోడం లేదనుకుంటున్నారా. మీనా మెటర్నిటీ హోమ్‌లో ఆమెకు పుట్టిన కొడుకు చచ్చిపోయినట్టు రికార్డు అయింది ఇంతకీ "ఆమె" ఎవరను కున్నారు ? హోటల్ చంచల్‌లో ఆరు నెలలపైగా గడిపిన జాస్మిన్ అనే అమ్మాయి ! మోహన్ అనే అతని కజిన్ సిస్టర్ !" యాలిస్ కళ్ళు చీకట్లు కమ్మేయి.

"అయితే యాలిస్ అనే అమ్మాయి ఏమయిపోయింది ?"

కిరణ్ ప్రశ్నకు మార్గరెట్ చెప్పిన జవాబు అంతకన్న విచిత్రమైనది.

"ఆమెకి చెడ్డపేరురాకుండా ఉండేం దుకు - నేను చేసింది ఒకటే. మా ఆర్ఫనేజ్ రికార్డులో యాలిస్ పేరుకి ఎదురుగా "షేరీడ్ ఎండ్ సెటిల్డ్" అని రాసి, నేనే సంతకంపెట్టి అక్కడికా రికార్డు క్లోజ్ చేయించేశాను !"

పిడుగులాంటి ఆ వార్త విని యాలిస్‌కి మిగిలింది వెర్రి నవ్వే మాత్రమే !

"నే ఉన్నా చచ్చినా లోకానికెంత చక్కని రికార్డు దొరికింది ! అవివాహిత నయినా నాకు పెళ్ళయిపోయింది ! పుట్టిన నా కొడుకు నిక్షేపంలా బతుకు




తున్నా, వాడు ఏనాడో భూస్థాపితమైనట్టు లెక్క. ఇదంతా అఫీషియల్ ఎండ్ రిజిన్ రికార్డు!! వీధిన పడిన ఆడదాని బతుకు ఎంత హాస్యాస్పదం!"

"ఉద్రేకపడక ఆమె అభిప్రాయం ఏమిటో సరిగ్గా వినండి యాలిస్" అని కిరణ్ యిలా పూర్తిచేశాడు:

"కేవలం ఆమెకి చెడ్డపేరు రాకుండా ఉండేందుకే కాదు. నేనిలా రికార్డు చేసింది. మా సంస్థకి కూడా మచ్చ రాకూడదుగా? వీటన్నిటి వెనకా ఏ మతమూ ఎలాంటి న్యాయమూ సహించని "ఒక కన్య ఒక వివాహితుడితో అక్రమ సంబంధం పెట్టుకుంది" అనే అపరాధం ఉండనే ఉంది. అదిగాక మదన్ మా ఆవరణలోకి ప్రవేశించి అత్యాచారంచేస్తే ఆ సంగతి వేరు, మేం శిక్షగరుపుతున్న కన్య ఒకతే తనంతట తాను, కట్టుబాట్లు దాటి, బయటకు వెళ్ళి తనంతట తాను వ్యభిచారానికి లోనైందంటే అది ఆ బాలికకే కాదు, ఆ సంస్థ మర్యాదనే సవాలు చేసే విషయం. బాలికలను సుశీలవంతురాళ్ళను చేసే పవిత్రాశయంతో, కచ్చితమైన క్రమశిక్షణతో నడిచే ఒక సంస్థకి ముఖ్యురాల్ని నేను. నేను సాక్ష్యం ఇస్తే ఆమెకు జరిగే మేలు ఏమీ లేకపోగా సంస్థ పేరునే అనవసరంగా బోను ఎక్కించడం కాదా! యాలిస్‌పట్ల ప్రేమలేదని నేనెలా అనను. కాని సంస్థపట్ల నా కర్తవ్యం ముఖ్యం కాదా!"

కిరణ్ తలఎత్తి చూసేసరికి — అసహాయస్థితికి నిలబడలేక కాబోలు — అనుకున్న ప్రతి ఆశా నేలకలిసి పోడంచేత కాబోలు — యాలిస్ వెక్కి వెక్కి ఏడుస్తూండడం కనిపించింది.

ఇంతలో బల్లమీద ఫోన్ మ్రోగింది. కిరణ్ మాట్లాడేడు

"క్షమించండి. ముఖ్యమైక రివ రెన్సు ఒకటి వెంటనే వంపవలసిన అవసరం వచ్చింది. ఓ పావుగంటలో మళ్ళీ వస్తాను అనవసరంగా మీరు అధైర్యపడకండి. మేడమీద లైబ్రరీకి వెళ్ళి వీలైనంత తొందర్లో వచ్చేస్తాను. మేగజైన్సు ఉన్నాయి. చూస్తూండండి ఏం కావలసినా బెల్ నొక్కండి. బాయ్ వస్తాడు. మరి నేను వెళ్ళనా? ఇక్కడున్నట్టు వచ్చేస్తాగా?" అని గబగబ వెళ్ళిపోయాడు.

తన పని పూర్తిచేసుకుని కిందకి వచ్చేసరికి ఎంతలేదన్నా కిరణ్‌కి ఇరవై నిముషాలు పైగా పట్టింది.

గదిలో యాలిన్ లేదు!

ఆమె బదులు పేపర్ వెయిట్‌కింద కాగితం ఉంది.

కిరణ్ ఆతృతతో దాన్ని తీసి ఇలా చదివాడు.

మిస్టర్ కిరణ్,

నా పట్ల మీరు చూపిన శ్రద్ధకి కృతజ్ఞురాల్ని.

లోకంలో మదన్‌లాంటి మోసగాళ్ళు ఎక్కడోగాని ఉండరనుకున్నాను కాని ప్రతి క్షణం అలాంటివాళ్లని చూస్తూనే ఉన్నాను. ఎప్పటికప్పుడు చివరికే గ్రహించగలగడం నా దురదృష్టం. అయినా ఎప్పటికో ఒకప్పటికి నిజం తెలుసుకోగలుగుతున్నందుకు నన్ను నేను అభినందించుకోకుండా ఉండలేను.

దయామయిగారికి - నేను తన కూతురు మెర్సీ రూపంలో ప్రేమ అందించడం కావాలి.

మార్గరెట్‌గారికి - నేను చచ్చినా బతికినా తన సంస్థ పచ్చగా ఉండడం కావాలి.

వీళ్ళెవరికీ నా కొడుకుని నేను తెచ్చుకుని - నా తల్లి కడుపు చల్ల బడడం ఎవరికీ అక్కర్లేదు!

ఇక తమకి? తమ స్నేహితుకి కోరిక తీరడం ముఖ్యం. అందుకని నా కొడుకు నాకు దగ్గరకాకుండా, ఎంత దూరంగా ఉంటే అంత సంతోషం. ఉత్తరాల్లో, సందేశాల్లో మగవాళ్ళు ఎంత మెత్తని భావాలయినా వెల్లడించ గలరు. వాళ్ల అవసరం తీర్చుకోడానికి ఎంతటి నాటకమైనా ఆడగలరు ఇవన్నీ నమ్మాలని ఎక్కడుంది!

యాలిన్ చచ్చిపోయిందని నిజంగా రికార్డు అయేదాకా నా ప్రయత్నం వదలను. నా మార్గం నాకు తెలుసు. మీరెవరూ నాకింకేమీ సాయం చెయ్యక పోడమే నాకు చేయగల గొప్ప సాయం. నన్నిలా బతకనివ్వండి. లేదా చావ నిచ్చినా సరే!

-యాలిన్

(సశేషం)

# ఇప్పటికీ భూమి గుండ్రంగానే ఉంది



## బులుసు-జీ-ప్రకాష్

"ఏమోయ్ సిద్ధాంతీ! ఎక్కడికి బయల్దేరేవేమిటి? వివరాలన్నీ చెప్పవయ్యా!"

"ఓహో అవధాన్లా! శేన్నాళ్లకి దర్శనం. విశేషాలేమిటోయ్? ఇద్దరం విజయనగరంలో కలిశామే! ఇది జంక్షన్ కదా! నువ్వే ట్రెయిన్‌లో దిగేవు. ఎక్కడికి వెళుతున్నావు ఏమిటి కథ?"

"గజపతినగరంనుంచి విశాఖ పట్నం వెళుతూ కాఫీచుక్క తాగుదామని ప్లాటుఫారంమీద దిగేనోయ్! ఇంతట్లో నువ్వు కనబడ్డావ్! నిన్ను చూడగానే నేను కాఫీ తాగేసినట్లే అయింది. ఆఁ! ఇక నువ్వెక్కడికి వెళుతున్నావో కాస్త విడమర్చి చెప్పు."

"నువ్వు గజపతినగరంలో బయల్దేరి విశాఖపట్నం వెళుతూంటే, నేను విశాఖ పట్నంలో బయల్దేరి, గజపతినగరం పోతున్నాను ఇంతే మనిద్దరికీ తేడా! ఏదీ చిన్న పొడుంపట్టు."

"ఇదుగో కానీ,- హాయిగా పట్నంలో ఉండక, మా పల్లెటూరు వెళుతున్నావేమిటయ్యా?"

"ఆ మాత్రం తెలీదూ సిద్ధాంతీ! నాకు పట్నవాసం అంటే విసుగు! నేను ప్రతిరోజూ రేడియో వినడం, బీచి కెళ్లడం, సినిమా చూడ్డం మొదలైన ఎన్నోవిధాల విలాస జీవితానికి అల వాటు పడ్డాను. కానీ రాను రాను ఆ బతుకు నాకు అసహ్యం వేసిందయ్యా! ఇరుకైన ఇంట్లో బస. అందుతోను నేనున్నది ఒకే ఒక గదిలో! అద్దె మాటంటావా? యాభై రూపాయలు మాత్రమే! మునిసిపాలిటీవాళ్లు మన పాలిటి యమదూతలనుకో! వాళ్ల చెత్తంతా అక్కడే స్టాకుంటుంది. కంపు భరించలేక ముక్కు బద్దలైపోతోంది. నేనున్న యింట్లో మరో వాటాలో మా ఇంటి యజమాని సకుటుంబ సమేతంగా ఉంటున్నాడు. అతని కిద్దరాడపిల్లలు. రాత్రి పదిగంటలకి శయనిద్దామంటే. అమ్మాయిలిద్దరూ డ్యాన్సులు ప్రారంభిస్తారు. అంచేత నా పవళింపుసేవ మానుకుని, తెల్లవార్లూ జాగరణసేవ చెయ్యవలసి వస్తోంది. ఏమైనా పల్లెల్లో ఉన్న సుఖాలు పట్నాల్లో ఉండవయ్యా! పల్లెటూరి వాతావరణం అత్యంతా రోగ్యకరం. నాల్రోజుల పాటు ఏటొడ్డు నైనా పడుకోవచ్చు. ఒక్కణ్నే కదా! రెణ్ణెల్లు సెలవుపెట్టి గజపతి నగరం పోతున్నాను. రెండు నెలలూ గడిచేక మళ్ళీ పట్నం వస్తే వస్తాను. లేకపోతే అక్కడే సెటిల్ అయి పోతాను. మాటల సందర్భంలో నీ సంగతి అడగడం మరచాను. ఇంతకీ నువ్వేపనిమీద విశాఖపట్నం వెళు తున్నావో చెప్పేవుకావు?"

"అదేమిటవధాన్లూ! పల్లెటూళ్లలో పరిస్థితులు బావులేక, అంతమందీ పట్నాలు జేరుతూంటే, ఎందుకంటా వేమిటి? ఏదో స్వర్గం అనుకున్నావ్ కాబోలు గజపతినగరం. ఒకటో నంబర్ నరకం! అక్కడుండే ఇరుగు పొరుగుల పశువులు సరిగా మా యింటి వాకిట్లోనే పేడకుప్ప వేస్తాయ్! వాళ్లు పశువుల విషయంలో రవంతైనా శ్రద్ధ వహించరు. ఒట్టి పశువులు! ఏమైనా అంటే కొట్టడానికి సిద్ధమౌతారు. మనం అక్కడ తెల్లగా బట్టకడితే చాలు, రాత్రి కల్లా ఆ బట్ట మాయం! గిన్నెలూ ముంతలూ మా యింట్లోంచి ఎన్ని కొట్టేశారో చెప్పలేను. చెప్తే నమ్మవు గానీ అవధాన్లూ! దుక్కలాంటి ఇత్తడి చెంబు పట్టుకుని దొడ్లోకెళ్లానోయ్! వెనకనుంచి ఏ చోరశేఖరుడు వచ్చాడో గాని, అందులో సిళ్లాంపేసి, చెంబు తస్కరించాడు. ఇక యిండ్లకి తలుపు లుంటేగా ధైర్యంగా వుండడానికి? లేవు కదా అని వేయిస్తే, ఆ తలుపులు రాత్రికి రాత్రే ఎవరో మస్కా కొట్టేశారు. నేను పడుకునే వేళకి, ప్రక్కవాళ్ల ఆవు మూలుగు ప్రారంభిస్తుంది. దాని కేదో రోగం. రోగంతో బాధపడుతున్న

అవు దావడం లేదుగాని మధ్య నేను చస్తున్నాను ! అంచేత నీలాగే నాకూ అసహ్యంవేసి, విశాఖపట్నం పోయి ఏదైనా బ్రాహ్మణార్థం చేసుకుంటూ, హాయిగా బీచిలో సాయంకాలంవేళ విశ్రాంతి తీసుకుందామని వుంది పట్నం లోని సుఖం వుండస్మీ ! వెధవ పల్లెటూళ్ల సంగతి నాకు జ్ఞాపకం చేయకు ! డోకొస్తుంది... అదట్లా వుంచు నువ్వు మా ఊరు పోతానంటున్నావే ? అక్కడ నీ కెవరున్నారు ? ఏ యింట్లో బస ? వివరంగా తెలియజెయ్యి."

"మా బావమరది ఒకడున్నాడయ్యా! అతని కుత్తరం వ్రాశాను. గజపతి నగరంలో తిష్ఠవేసేందుకేమైనా వీలుంటుందా అని. ఆ వూళ్ళో వెంకన్న పంతులుగారిల్లుట. ఆ యింట్లో ఒకాయన కొద్దిరోజులుండి, ఏదో వంకపెట్టి ఎక్కడికో పోతున్నాట్ట. అంచేత ఆ యింట్లో నువ్వుందువుగాని రమ్మని మా బావమరది ఉత్తరం వ్రాశాడు సరేనని బయల్దేరా ఇంతకీ విశాఖపట్నంలో నువ్వెక్కడుందామనుకుంటున్నావ్ ?- అదేమిటయ్యా అలా నవ్వుతావ్ :"

"ఏమీలేదు. విశాఖపట్నం మహారాణీపేటలో సోమనాథశాస్త్రి గారని ఒకాయనున్నాడు చూడు ! అతను మాకు చుట్టం. ఆయనకా వీధిలో ఒక స్వంతిల్లుంది. ఆ యింట్లో ఇన్నాళ్లూ ఒకాయనుండేవాడట. ఆయనక్కూడా నాలాగే చిరాకేసిందో ఏమిటో ? ఇల్లు విడిచి రెణ్నెల్లపాటు సెలవుపెట్టి ఊరాయించాట్ట. అంచేత ఆ యింట్లో నన్నుండమని ఆ యజమాని ఉత్తరం వ్రాశాడు అక్కడికి పోతున్నాను. అదేమిటోయ్ అలా నవ్వుతావ్? నీకేమైనా నవ్వు రోగం పుట్టిందా ?"

"ఓరి చచ్చుదద్దమ్మా ! ఆ వీధిలో సోమనాథశాస్త్రిగారింట్లో వుంటున్నది నేనేనయ్యా ! గొప్ప టోపీలో పడ్డావే ! ఇక నువ్వు తిన్నగా మీ ఊరికి దారి తియ్యి. ఇద్దరం కలిసేపోవచ్చు !"

"ఓరి వెర్రి వెంగళప్పా ! నువ్వు చెప్పిన వెంకన్న పంతులుగారింట్లో ఉంటున్నది నేనేనయ్యా! ఇక తిన్నగా విశాఖపట్నం దయచెయ్యి. సరే టిక్కెట్లు మార్చేసుకుందాం. నీ దిట్లా పారెయ్ !''



# జాక్ సిఫార్సు

వాణిశ్రీ



"నీకీసారి జాబ్ రావడం ఖాయంరా."

అన్నాడు చంద్రయ్య వస్తూనే. పడక్కుర్చీలో కూర్చుని పేపరు చదువుతున్న శేఖర్ లేచి నిలబడి ఏమిటి విశేషం అన్నట్లు తండ్రిముఖంలోకి చూశాడు.

చంద్రయ్య చాలా ఆనందంగా వున్నాడు. అప్పుడే కొడుక్కి ఉద్యోగం వచ్చినంత సంబరపడిపోతున్నాడు.

"నీకు ఇంటర్వ్యూ వచ్చిన కంపెనీ మేనేజింగ్ డైరెక్టరూనూ, మనవెంకయ్యనాయుడూ క్లాస్‌మేట్లట. 'నేను రేపు ఎటూ హైదరాబాద్ వెళ్తున్నా. మీ కుర్రాడ్ని నాతో పంపించు' అన్నారు నాయుడుగారు."

శేఖర్ చాలా సంతోషించాడు. వెంకయ్యనాయుడుగారు ధనవంతుడు. మంచి పలుకుబడి గలవాడూనూ. ఆయన తల్చుకోవాలేగాని తనకి జాబ్ రావటం ఎంతసేపు అనుకున్నాడు

"నాయుడుగారు సామాన్యంగా ఎవరికీ మాట ఇవ్వడు ఇచ్చాడో ఇకధోకా లేదు."

"నిజమే!" అన్నాడు శేఖర్. అతనికి వెంకయ్యనాయుడుగారి రికమండేషన్ దొరకటం ఏదో పెన్నిధి లభించినట్లుంది.

"అన్నట్లు నీ ఇంటర్వ్యూ ఎల్లుండి ఉదయం పదింటికి కదూ!"

"అవును"

"నాయుడుగారు రేపు సాయంత్రం కార్లో వెళ్తారు ఆయనతోపాటు వెళ్ళు చార్జీలుకూడా కలిసివస్తున్నాయి, శుభ సూచకం. అని తృప్తిగా నవ్వాడు చంద్రయ్య.

మర్నాడు శేఖర్ వెంకయ్యనాయుడు గారి వెంట బయల్దేరాడు.

"నువ్వు చంద్రయ్య కొడుకువా?" అని మాత్రం అన్నారు నాయుడుగారు

అవునన్నట్లు తలవూపాడు శేఖర్.

తర్వాత ఇంకేమీ మాట్లాడలేదు. ఆయన వెనకసీట్లో కూర్చుని ఏదో ఆలోచనలో పడ్డారు. శేఖర్ ముందు కూర్చున్నాడు,

బెజవాడ వెళ్ళేసరికి చీకటిపడింది.

"మీటింగ్ అయ్యాక బయల్దేరుదాం." అని ఆయన మీటింగ్ హాల్లోకి వెళ్ళారు.

గంటయింది రెండు గంటలయింది. శేఖర్ నడుం నెప్పిపుట్టి కారు దిగి అటూ ఇటూ పచార్లు చేశాడు. వాచీ చూసుకున్నాడు. ఎనిమిది దాటింది.

ఆకలి మొదలయింది.

డ్రైవర్ హాల్లోకి వెళ్ళివచ్చి "భోజనం చేసి రమ్మన్నారండీ. ఎక్కండి" అన్నాడు స్టీరింగ్ముందు కూర్చుని. ఇద్దరూ హోటల్లో భోజనంచేసి వచ్చారు

పది దాటింది.

నాయుడుగారి జాడలేదు.

మరో గంట దాటేసరికి శేఖర్ కి నిద్ర ముంచుకువచ్చింది. ఆవులించాడు.

"వెనక సీట్లో పడుకోండి బాబూ! ఆయ నవస్తే లేపుతాను." అన్నాడు డ్రైవర్ శేఖర్ అవస్థ గమనించి.

శేఖర్ నిద్రపోయాడు.

మెలుకువ వచ్చేసరికి తూర్పున తెల్లవారింది.

ఉలిక్కిపడి లేచాడు శేఖర్. ఇంటర్వ్యూ ఆ రోజే. ఇంకా బెజవాడలోనే ఉన్నాడ. నాయుడుగారు ఇంకా రాలేదు ఎలా?" అనుకొని కంగారు పడ్డాడు.

దగ్గరలో ఉన్న చిన్న హోటల్లో ముఖం కడుక్కొని కాఫీ త్రాగాడు.

ఎనిమిదింటికి నాయుడుగారు వస్తూనే శేఖర్ని చూసి భుజంతట్టి "అనుకోకుండా ఆలస్యం జరిగిపోయిందోయ్! మనం హైదరాబాద్ వెళ్లేసరికి భోజనంవేళ అవుతుందనుకుంటూ. అన్నట్టు నీ క్వాలిఫికేషన్స్?" అన్నారు.

"బి కామ్. సార్," అన్నాడు శేఖర్ వినయంగా.

"ఉద్యోగంవస్తే ఆ కంపెనీలో జీతం ఎంత?"

"మూడు వందలు సార్."

"ముష్టి మూడొందలు అక్కడేం సరిపోతాయ్! బ్యాంకిలో అయితే ఆరు వందలు జీతం. ఈసారి ఖాళీలు వచ్చినప్పుడు ఇప్పిస్తా! సరేనా? ఇక నువ్వు బస్సెక్కి ఇంటికి వెళ్ళు. అప్పుడప్పుడూ కనిపిస్తూండేం. మర్చిపోకు." అంటూనే కార్లో ఎక్కి కూర్చుని డోర్ వేసుకున్నారు.

శేఖర్ నోరుతెరుచుకుని చూస్తూనే వున్నాడు. కారు లేపిన దుమ్ము అతని నోట్లో పడింది.

# సక్షయం



(మొదటి భాగం)

ఇంకా పూర్తిగా తెల్లవారలేదు. ఉదయ సంధ్య కారుచీకట్లని పారద్రోలటానికి ప్రయత్నిస్తూ వుంది. అప్పుడే లేచిన కొన్ని కాకులు 'కా–కా' అంటూ అరుస్తూ ఎగుర్తూ పోతూవున్నాయి. తలార స్నానంచేసిన సీత జారుముడి వేసుకుని కలియంపి చల్లిన వాకిట్లో ముగ్గులు దిద్దుతూవుంది అప్పుడే నిద్రలేచిన సుబ్బమ్మ కళ్ళు నులుముకుంటూ వాకిట్లోకి వచ్చింది.

"ఇంకా ముగ్గుల్లోనే వున్నావటే అమ్మాయి!" అంటూ పలకరించింది కూతుర్ని.

"అయిపోయిందమ్మా."

"పాలవాడు వచ్చి వెళ్ళేడా?"

"ఆఁ పాలు పోయించుకొని వంట గదిలో పెట్టేను."

"సర్లే త్వరగా ముగించి వచ్చి కాఫీ చెయ్యి. మళ్ళీ రాజుగాని వస్తే కాఫీ అని చిందులు తొక్కుతాడు. ఈలోగా నా మొహంపని కానిచ్చుకొని వస్తాను" అంటూ లోపలికి వెళ్ళింది సుబ్బమ్మ.

వేసిన ముగ్గుల్ని తృప్తిగా ఒకసారి చూసుకుని చెంగున లోపలికి నడిచింది సీత. పొయ్యితో కుస్తీపట్టి వెలిగించి, డికాషన్ కలిపి గ్లాసుల్లో కాఫీ తయారు

చేసిందో లేదో 'కాఫీ' అంటూ అరిచాడు రాజు. కాఫీ గ్లాసు తీసుకుని గదిలోకి వెళ్ళింది సీత. కళ్ళుమూసుకునే నిద్ర బద్ధకంలో ఆవలిస్తున్నాడు రాజు.

''ఇదిగో, కాఫీ.''

రాజు కళ్ళు విప్పిచూసాడు. "ఇంతా లస్యం అయిందేం ఇవాళ ?" నిష్ఠురిస్తున్నట్లు అడిగాడు. సీత మెదలకుండా గ్లాసు అందించింది. కాఫీ తాగి గ్లాసు క్రిందపెట్టి, "మాట్లాడవేంటి, నోరు లేదా?" అన్నాడు.

"ఏంలేదు."

"ఏంలేకపోవటమేమిటి ?"

"ఇవాళ పాలవాడు గొడవచేసాడు. అతనిది క్రితం నెల డబ్బు ఇంకా ఇవ్వలేదు. ఇక పొయ్యనని అన్నాడు. ఎలాగో సర్దిచెప్పితే పాలుపోసి వెళ్ళాడు."

"ఏం ? అతని పైసలు ఎందుకు ఇవ్వలేదు ?"

"ఆ డబ్బులు నీకే ఏదో ఫీజుకంటే ఇచ్చానుగా."

"ఆహా ! మెడకి వేస్తే కాలికి, కాలికి వేస్తే మెడకి. చివరికి నన్నే దోషిగా చేసావన్నమాట."

"అదిగాదన్నయ్యా..."

"సర్లే, సర్లే. అదంతా నా కనవసరం" అంటూ విసుక్కున్నాడు రాజు. ఖాళీ గ్లాసు తీసుకుని, తిరిగి వచ్చేస్తోంటే వెనక్కి పిల్చి గుసగుస అన్నాడు. ''అవునుగాని డబ్బులేవన్నా వుంటే ఇవ్వరాదూ ? అర్జంటు పని వచ్చి పడింది !"

లేవన్నట్లు తలాడించింది.

"ఎంతో వద్దు. ఓ రెన్నుంటే చాలు."

"వ్చ్" అంది.

"పోనీ ఓ ఫైవన్నా..."

"ఊహూం."

"నాకు తెలియమా. నువ్వసలే పిసినిగొట్టువి. అందుకే నువ్వంటే నాకు కోపం!" అంటూ చిటచిట్లాడాడు రాజు. నవ్వి ఇవతలకి వచ్చేంది సీత.

అప్పటికే వంటగదిలో పీటమీద కూర్చుని కాఫీ తాగుతూ ఆపసోపాలు పడుతూ వుంది సుబ్బమ్మ.

"లలితకి కాఫీ ఇచ్చేవటే ?"

"ఇంకా అది లేవలేదమ్మా."

"లేవలేదూ ! పోనీ నువ్వన్నా నిద్ర లేపకపోయావ్ ? కాఫీ చల్లారితే అదసలే ముట్టుకోదు. అసలే అర్భనాకారిపిల్ల" తప్పంతా సీతదే అన్నట్టు నిర్ధారించింది ఆవిడ.

లలిత ఇంకా ముసుగుతన్ని కలలు కంటూనే వుంది.

సీత తనని నిద్రలేపేటప్పటికి కస్సుమంది, లలిత.

"ఏం కొంప మునిగిపోయిందని నిద్ర చెడగొట్టేవ్ ?" అంటూ చిందులు తొక్కింది. నోట్లో అటు ఇటు బ్రష్షు

ఆడించి వచ్చి కూర్చుని గారాలుపోతూ కాఫీ తాగింది. ఈలోగా బాయిలర్ ముట్టించి
వచ్చింది సీత.

"అమ్మా" గారాలు పడుతున్నూవుంది లలిత. లలితను ఒళ్లో కూర్చోబెట్టుకుని తలకి నూనె రాస్తూ,?

"నీళ్లు కాగాయటే?" అంటూ సీతని అడుగుతూ వుండింది సుబ్బమ్మ.

"కాగుతున్నాయమ్మా."

"అమ్మోవ్!" అంటూ గావుకేక పెట్టింది లలిత.

"ఏమిటే తల్లీ."

"ఒక మాట చెప్పనా?"

"చెప్పుమరి" అంటూ కూతురి తల నిమిరింది. ఆమె ఆప్యాయంగా.

"డబ్బులు కావాలే!"

"ఎందుకే? ఎంత కావాలి?"

"ఎంతోనా? పాతిక మా ఫ్రెండ్సంతా కలిసి పార్టీ ఎరేంజ్ చేసుకుంటున్నాం" 'రమణి' లేదూ? ఆర్డివో గారమ్మాయి. ఆయనకి హైదరాబాదు ట్రాన్స్ఫరయింది. ఆ అమ్మాయి వెళ్ళిపోతుంది. అందుకనీ,

"పాతికా?! నా దగ్గరెక్కడుంది? నాన్ననడుగు."

"ఆయనకసలే కోపం నేనడుగను బాబూ! ఐనా ఆయన నాకు దొరకద్దూ?"

"మరేంచేస్తావు?"

"ఏవో! నువ్వే ఇవ్వాలి?", అంటూ తీర్మానించి బుంగమూతిపెట్టింది లలిత.

"డబ్బు డబ్బు అని ప్రాణాలు తోడుతారు. అందరికీ డబ్బుకావాలి. ఎక్కడ్నుంచి తేనే? ఇది సంసారంకాదు దీన్ని ఇక నేను ఈదలేను. 'ఆ మనిషి' బాధ్యత పట్టకుండా తిరుగుతారు. ఆ శ్రీరామచంద్రమూర్తికి నా మీద దయలేదు...!

"ప్రొద్దున్నే ఎందుకమ్మా అటువంటి మాటలు!" అంది సీత, నిట్టూర్చి. కన్నుమంది సుబ్బమ్మ.

"అవునే నీకేం? ఎన్నయినా చెపుతావు. నా బరువు నువ్వు మొయ్యి. తెలుస్తుంది. ఒద్దునుంటే నేనుకూడా ఎన్ని నీతులైనా చెపుతాను."

"సర్లే వూరుకో అమ్మా" అంది సీత.

"దానమ్మకడుపు మాడ. వూరుకో వూరుకో అని అందరూ నా నోరు మూయించేవాళ్ళే. సరే నోర్మూసుకుంటాను. ఇప్పుడిది డబ్బో అని నా ప్రాణాలు కొరికేస్తూవుంది. ఏంచేస్తావో చెయ్యి"

"అమ్మా! ఆ సంగతి నాకొదులు నువ్వు నిశ్చింతగా వుండు. అసలే బ్లడ్ ప్రెషర్ మనిషివి."

"అక్కడికి నేను రోగిష్టినీ, ఈ సంసారాన్ని పీడించుకు తింటున్నదాన్ని అనేగా నీ వుద్దేశ్యం?"

"ఉద్దేశ్యాలదాకా ఎందుకులే తల్లీ. అసలు నాదే తప్పు. అవసరంకొద్దీ ఏదో

అడిగితే ఇంత రాద్ధాంతం చేశావు?! రా అక్కా." అంటూ లేచింది లలిత.

"నేను రాద్ధాంతం చేసేనుటే?!" అంటూ నోరు వెళ్ళబెటింది సుబ్బమ్మ.

"ఆఁ. అక్షరాలా. ఇకనయినా ఈ రాద్ధాంతం చాలించు." అంటూ సీతని చెయ్యిపట్టుకుని విసవిసలాక్కుపోయింది లలిత. లాక్కుపోయి—

"అక్కా మరి నా మాట" అంది.

"లలితా పార్టీతప్పకుండా ఇవ్వాలా? పోనీ నువ్వు మానేయకూడదూ?" అంది అనునయంగా సీత.

"అదుగో ఆటువంటి మాటలంటేనే నాకు మంట." అంటున్న లలిత మొహం ఎర్రబడింది.

"సర్లే యిప్పుడు ఏంచేద్దామంటావు?" నీరుగారిపోతూ అంది.

"ఏంచేస్తావో నాకు తెలీదు మాటి చ్చావు?"

"ఇప్పుడు నా దగ్గర అంత పైకం లేదు. బాకీలు అలాగే వున్నాయి. రోజూ వాళ్లు పీడించుకు తింటున్నారు. ఇంట్లో అన్నీ నిండుకున్నాయి. నెల గడ వాలి..."

"అక్కా!" తీవ్రంగా అంది లలిత సీత నిశ్చేష్ట అయింది.

మరల లలితేఅందుకుని "నాకు కథలు చెప్పబాకు. అవన్నీ వినే ఓపిక నాకు లేదు."అంది.

సర్లే ఆఫీసులో ఎవర్నయినా అప్పు అడుగుతాను. ఎప్పట్లోగా కావాలి నీకు?

నువ్వేంచేస్తావో నాకు తెలీదు రేపు సాయంత్రంలోగా పైకం కావాలి. నే నప్పుడే పేరు ఇచ్చేస్తాను." అంటూ స్నానానికి వెళ్ళింది లలిత,"

సీత గుండెల్లోంచి బరువుగా నిట్టూర్పు వెలువడింది.

అప్పటికే స్నానం ముగించి చొక్కా గుండీలు పెట్టుకుంటూ వచ్చాడు రాజు.

"మైడియర్ చెల్లాయ్!" అంటూ స్వీట్‌గా పిలిచేడు. తలెత్తి చూసింది సీత. ఎవరికయినా అంత కఠినత్వం పనికిరాదమ్మాయ్, నేనడిగింది ఏం చేసావ్? నువు ఎంతయినా ఉద్యోగస్తు రాలివి. నువ్వు తల్చుకుంటే పదిరూపా యలు అంత లెక్కలోది గాదు. ఎందు లోంచయినా సేవింగ్సుని ఇటు సర్దా వచ్చు. అవతల ప్రాణం పొయ్యేపని తగలడిందన్నాను గదా?"

సీత కళ్ళు వప్పచెప్పి చూస్తూ వుండి పోయింది.

"లలితలాగే నేనూ నీ తోడబుట్టిన వాణ్ణే. అంతలోనే అంత పక్షపాతం పనికిరాదమ్మాయ్. దేవుడూరుకోడు. కనక 'దాంతో' పాటే నాకూ ఓ ఇంత సర్దు. కావాలంటే లెక్కరాసుకో. ఏదీ-ఈ చదువయి వుద్యోగస్తుణ్ణయ్యాక వడ్డీతోసహా తీరుస్తాను. ఇంకా అను మానమయితే కాగితం రాసిస్తాను.

నువ్వు 'వూ' అను మరి" అంటూ గడ్డం పుచ్చుకొని బ్రతిమాలాడు.

చివరికి సీత చేత 'వూ' అన్పించుకుని వెళ్ళేడు, విలాసంగా.

"ఏం చేస్తున్నావే, అమ్మాయీ!" అంటూ లోపల్నుంచి గావుకేక వేసింది సుబ్బమ్మ.

అంతలో కాలు ఎగరేసుకుంటూ శశిధర్ వచ్చాడు.

"ఎక్కడికి వెళ్లేవురా?" అప్యాయంగా అడిగింది, సీత.

"ఇక్కడికేలే, నే నెక్కడికెళ్తే ఎవరిగ్గావాలి! ఆకరాడ్ని, కుంటివాడ్ని."

"అట్లా అనకు బాబూ! తప్పు. మొహం కడుక్కురా. త్వరగా రావాలి."

"కడిగేసాలే."

"అయితే రా, కాఫీ తాగుదుగాని."

"నా కాఫీ అయిపోయిందిలే అక్కా, అమ్మ ఇచ్చింది. సర్లేగాని ఆ 'అన్న మహానుభావుడు' ఏంటడుగుతున్నాడు?"

"ఏం లేదులే" అంది సీత. శశిధర్ పేలవంగా నవ్వాడు.

"అక్కా! నేనంతా విన్నా గాని నువ్వు ఆయనకి డబ్బులు ఇవ్వమాకు. ఎంతసేపూ ఇంట్లోవాళ్ళని పీడించి డబ్బుపట్టుకెళ్ళి తగలెయ్యటం బాగా అలవాటయింది. సంపాయించే వాళ్ళయితేగా డబ్బు విలువ తెలియటానికి."

"బాబూ! నువ్వు చిన్నవాడివి. అవన్నీ నీకెందుకు?"

"నిజమే. చిన్నవాడు పెద్దమాటలు ఆడరాదు. అయినా అంతా నా కళ్ళకి స్పష్టంగా అవుపిస్తోనే వుందక్కా. నువ్వు ఇట్లాగే చేస్తూపోతే ఇక వాళ్లె పట్టికీ బాగుపడరక్కా. చేతులార నువ్వే వాళ్లని చెడగొట్టున్నావు. తర్వాత ఏమనుకునీ లాభంలేదు."

సీత నిట్టూర్చింది.

"ఏమే సీతా! పలక వేంటి? ఏమయిపోయావ్! ఎక్కడ పని అక్కడే తగలడి చచ్చింది. మరి కాసేపటికే అవురావురుమంటూ వస్తారు అందరూ."

"ఇదుగో వచ్చేను అమ్మా."

"ఆ వంటప్రయత్నమేదో చూడు. మళ్ళీ ఆఫీసుకి టయిమయిందని కాళ్ళు తొక్కుకుంటావు. అప్పుడు నేనే కంగారుపడి చావాలి. ఏం మనుషులూ? ఎవరికీ ఏమీ పట్టదు."

తల్లి సుబ్బమ్మ చదువులు వింటూనే పొయ్యిమీద ఎసరు పెట్టింది సీత. బుట్టలో నాలుగు వంకాయలు మిగిలి వున్నాయి. అవి తరిగిపెట్టి ఎసట్లో బియ్యంపోసింది. అన్నం దింపాక ఆ నాలుగు వంకాయ ముక్కలూ వేసింది. వేగాక దించి గిన్నెలో పెట్టి మూతపెట్టింది. ఆ పనీ




ఈ పనీ సర్దుకుని, వంటగది అదీ సర్ది, వచ్చేసరికి తొమ్మిదయింది?

గబగబా తలదువ్వుకుని బొట్టుపెట్టుకుని తయారై ఇవతలికి వచ్చేసరికి తొమ్మిదింపావయింది. కంగారుగా జోళ్ళు వేసుకోపోతుంటగా సుబ్బమ్మగారు వచ్చింది.

వచ్చి, 'అన్నం తిన్నావుటే?' అంది.

అప్పుడు జ్ఞాపకానికి వచ్చింది సీతకి, తను అన్నం తినలేదనీ - తినకపోతే సాయంత్రంవరకూ ఇక తినటానికి వీలవదనీ.

"పిచ్చిమోడు, అన్నీ నేనే చూసుకోవాలి రా కంచంలో పెట్టాను. గబగబ నాలుగు మెతుకులు తినిపో."

"వద్దులే, అమ్మా. టయిములేదు, మళ్ళీ బస్సు దొరకదు. ఆఫీసులో 'ఇన్స్పెక్షను' జరుగుతూవుంది. బావుండదు" అంది సీత.

"ఇదిగో రా, అక్కా. ఒక్క నిముషంలో ముగించవచ్చు" అంటూ కంచం తెచ్చి చేతిలో పెట్టాడు శశి కంచంలో ఇంత అన్నమూ, నాలుగు వేపుడు ముక్కలూ వున్నాయి.

సీత కనులు ఆప్యాయతనివర్షించాయి కొన్ని క్షణాలపాటు తమ్ముడ్ని చూసి గబగబ రెండు ముద్దలు నోట్లో వేసుకుని ఇన్ని మంచినీళ్ళు తాగి చెయ్యి కడుక్కుంది. కంగారుగా ఉరుకుల పరుగులతో కాళ్ళు తొక్కుకుంటూ సీత వెళ్తూవుంటే గుమ్మంలో నిలబడి శశిధర్ చెయ్యూపాడు. బస్టాండులో క్యూ కొండపేటి చేంతాడులాగా వుంది. ఆఫీసుకి చేరేసరికి పావుగంట ఆలస్యం అవనే అయ్యింది.

"ఏం ఇంతాలస్యం అయింది ! 'మేనేజరుజీ' మండిపడ్తున్నాడు" అంది 'కో టైపిస్టు' సుజాత. అప్పటికే ఒకసారి తలెత్తి క్రీగంట సీతని చూసి మరల తలొంచుకున్నాడు మేనేజరు మాణిక్య రావు.

"గుడ్మార్నింగ్ సర్" అంది సీత ఆయన దగ్గరకెళ్ళి.

అతను తలపూవి గుర్రున చూసాడు.

"ఇవేళ కొద్దిగా లేటయిందండి" అంది సీత నవ్వి. అతను కస్సుమని అందుకున్నాడు. "ఎందుకవదూ? నాకు తెలియదా ? షికార్లు, బాయ్ఫ్రెండ్సు పాపం ! వీటితో మీకు తీరికెక్కడుంటుంది ? అసలు మీకు ఈ వుద్యోగాలు చెయ్యటం ఎందుకూ అని ? శుభ్రంగా ఇంట్లో కూర్చునో, బజార్లో తిరుగుతునో, కాలం గడిపితే ఎవరడిగాడు ? ఈ వుద్యోగాలెందుకు ? ఈ 'లేటు కమింగు' లెందుకు ? మా ప్రాణాలు తీయటం ఎందుకు ? అసలే ఇన్స్పెక్షను రోజులు గదా ! ఆఁ ఆ మాత్రం తెలుసుకోకపోతే ఎల్లాగా అని ? ప్చ్ప్చ్..."

ఆ ! అక్షింతలు వేసుకుని, అటెండెన్సు రిజిష్టరులో సంతకంపెట్టి వచ్చింది సీత.

"ఏంటి 'వృద్ధ జంబుకం' చదువులు చదువుతూ వుంది" అంది సుజాత టైపు చేస్తూనే.

"ఏముంది ? మామూలే" అంటూ నవ్వి మిషనుమీది కవరుతీసి దుమ్ము దులిపింది సీత. చెయ్యవల్సిన స్టేట్మెంట్సు 'బొత్తి'గా పడివున్నాయి. చకచక వేళ్ళు కదిలాయి. మెషీను నడకలో కాలం ఇరుక్కుపోయింది.

మాణిక్యరావుకి నలభై ఏళ్ళుంటాయి. ఇద్దరు పిల్లల్ని కని చరిత్ర సృష్టించి, భార్య చచ్చిపోయింది గుండెజబ్బుతో. ఆ భార్యతో గతకాలంలో అతను నానా యాతనలూ పడ్డాడు. ఆమె పోయినప్పుడు ఒక ఏడ్పు ఏడ్చి తరువాత తృప్తిగా వూపిరి పీల్చుకున్నాడు. ఆ కారణంగా అతను 'స్త్రీ ద్వేషి'గా మారాడు. ఆఫీసులో ఎప్పుడూ స్త్రీలని విమర్శిస్తూ కసి తీర్చుకోవటం అతని హాబీ

లంచవర్లో-గంటమ్రోగింది. అప్పుడు పని ఆపి ప్రక్కకి తిరిగిన సీతని చూసి సుజాత పలకరించింది 'అలా కాంటీనుకి వెళ్ళి వద్దాం. వస్తావా !' 'ఉహు' అంది సీత. 'ఏం ? సింగిల్ కాఫీ తాగివద్దాం రారాదా ?'

"వద్దులే, నాకు తాగాలని లేదు. పని మిగిలిపోయింది. నువ్వు వెళ్ళిరా" అంది సీత. 'సర్లే' అంటూ వెళ్ళిపోయింది సుజాత. ఆఫీసు అంతా ఖాళీ అయింది. మాణిక్యరావు ఒక్కడూ కుర్చీలో కూర్చుని సిగరెట్ వెలిగించాడు.

టైపుచేస్తున్న సీత ఉలికిపడింది — కాసేపయాక.

తన వెనకాల ఎవరో నిలబడివున్నట్లు అన్పించింది ఆమెకి.

"సీతా !" వెనకనుంచి మాణిక్యరావు పిల్చాడు. ఆ పిలుపులో సౌమ్యత వుంది, ఆదరం వుంది, ఆప్యాయతా వుంది.

"యస్సర్."

"ఈ సార్లూ, గీర్లూ తీసెయ్యి సీతా! ఎవరూ లేనప్పుడు కూడా ఇవేంటి ?"

సీత మౌనంగా వుండిపోయింది. వేళ్ళు చకచకా కదిలాయి. చట్టం కదల్లమైతే ఆగలేదు.

"నిన్న మీ నాన్న వచ్చాడు, నా దగ్గరకు !" అన్నాడు మాణిక్యరావు

"వచ్చారా !" అంది సీత ఆశ్చర్యంగా.

"వచ్చి ఒక యాభయి కావాలని పుచ్చుకొని వెళ్ళేడు. నీ మొహం చూసి ఇచ్చేను. లెక్కరాసేననుకో. అయినా ఆయనకి అంత అవసరం తరుచూ అలా ఎందుకొస్తుందబ్బా ! ఆ మాటే అలో చిద్దామని నీ దగ్గరికి వచ్చాను."

"పోన్లెండి. మొత్తం ఎంతయిం దంటారు !"

"అన్నీ కలిపి రెండున్నర వంద లయిందనుకో."

"నర్లెండి. నే తీర్చేస్తాన్లెండి."

"నువ్వు తీర్చవని కాదనుకో. ఆయన్ని నువ్వు ఎప్పుడయినా అడి గేవా ! ఆ డబ్బు అతను ఏ అవసరం కొరకు ఖర్చుపెడుతున్నాడో కనుక్కు న్నావా ? జెన్యుయనేనా?..."

"సంసారం అన్నాక ఏవో ఖర్చు లుంటాయి లెండి."

"నిజం సుమా ! నా కంటే నువ్వే మెరుగు సీతా ! ఇంకా పెళ్ళికాక పోయినా సంసారపు సంగతుల్ని క్షుణ్ణంగా ఆకళింపు చేసుకున్నావు. ఏదీ! ఈ మధ్యన నా మతి మతిలోనే వుండటంలేదు ! ఏదో పైకి అలా వాగు తానుగాని వాస్తవానికి నాకు నువ్వే అంటే ఎంతో అభిమానం సుమా ! అది నువ్వు గ్రహించాలి..."

"థాంక్సండి."

"ఆఁ. అలా అని నువ్వు గ్రహిస్తే చాలు, పని జాగ్రత్తగా చేసుకో. ప్రపం చము మంచిదిగాదు. స్నేహం స్నేహం అంటూ స్నేహితురాళ్ళే గోతుల్లోకి దింపి వదిలేస్తారు ఈ స్నేహాలు మానెయ్యి. నా యిల్లు బంగారంగాను. నీకే ఎన్ని సలహాలు చెపుతున్నాను! దేవుడు మేలు చేస్తే నీ చేతే సలహాలు చెప్పించుకో వాల్సినవాడ్ని," నవ్వాతు.

"ఆపీసు పనిలో ఏవయినా 'ఇన్స్ట్రక్షన్స్' ఇస్తారా ?" అంది సీత చిరాకేసి వాగుడు ఆపి కాసేపు సీతకేసి చూసి" "నేనిచ్చేదేముంది! నువ్వేచేసుకుపోగలవు మెరికలాంటి పిల్లవి" అని మరల నవ్వాడు

మాణిక్యరావు. ఆ నవ్వు ముళ్లతో పొడిచి నట్లనిపించింది సీతకి.

అంతలో సుజాత వచ్చింది, కాంటీను నుంచి.

"ఏమిటి సర్ ! లంచవర్లోకూడా ఏదో శ్రమ పడుతున్నారు ?" అని నవ్వింది సుజాత.

మాణిక్యరావు వెకిలిగా నవ్వాడు

"సీతకి ఈ స్టేట్‌మెంట్లో ఒక విషయం అర్థంకాలేదంటేను, చెప్దామని వచ్చాను. తప్పా ?"

తప్పని ఎవరన్నారండి. ఆ మాట మీరే అంటున్నారు ?" మొహాన్నే నవ్వింది సుజాత. "అదుగో ఆఫీసులో అలా నవ్వవద్దనే నేననేది, సర్లే కానీండి ఆ స్టేట్‌మెంట్లు సాయంత్రాని కల్లా అవాలి రేపే ఆఫీసరుగారిచేత సంతకం చేయించాలి. వాట్ని హెడ్డాఫీసుకు పంపించాలి త్వరగా కానీండి తప్పులు మాత్రం దొర్లనీరాదుసుమా" అంటూ తన సీటుకి వెళ్ళిపోయాడు మానిక్యరావు

ఒకొక్కరే స్టాఫ్ రాసాగారు, కాంటీనునుంచి.

తనసీటులో కూర్చుని కాగితాలు సెట్ చేస్తూ "ఏమిటంటున్నాడు ముసలి పీనుగ ?" అని అడిగింది సుజాత తన మామూలు ధోరణిలో.

"ఏదో అనాలని ప్రయత్నం ఎలాగ అనాలో తెలీక అదీ ఇదీ అనబోయాడు" నవ్వింది సీత.

"సర్లె. జాగ్రత్తగా వుండు." అని హెచ్చరించింది సుజాత. సీత తలూపింది.

"మరేంలేదు నీమీద కన్నేసాడు. ఉత్తి స్కౌండ్రల్. ఇదివరకు ఇలాగే నా జోలికి రాబోతే గట్టిగా బుద్ధిచెప్పాను అప్పట్నుంచి నేనంటే మంట ! ఇటు వంటివిషయాల్లో మనం గట్టిగా వుండాలి లేకుంటే 'పీట్లు' మన బ్రతుకుల్ని మనం బ్రతకనీకుండా చేయగలరు !"

ఆ స్టేట్‌మెంట్లయ్యే సరికి అయిదు దాటింది ఆఫీసు బయటికి వచ్చి గాలి పీల్చుకున్నారు ఇద్దరూ.

"ప్రస్తుతం నీకు అర్జంటుపని ఏమన్నా వుందా ?" అని అడిగింది సుజాత.

"ఏం లేదనుకో. కానీ త్వరగా ఇంటికి వెళ్ళాలి, ఇంటిపని వుంది. అంది సీత. "సర్లె నిన్ను త్వరగానే వదులు తాను గాని నువ్వు ఒకసారి మా యింటికి వచ్చి వెళ్ళాలి. ఇవాళ నా 'బర్తుడే' అంది తనే మళ్ళా.

"మెనీ హాపీ రిటర్న్స్ "

"థాంక్యూ. పెద్దగా ఏమీ లేదనుకో. చిన్న టీ పార్టీ. ఎవర్నీ పిలవలేదుకూడా నిన్నొక్కదాన్నే పిల్చాను."

"థాంక్స్ కానీ... !

"కానీలు అర్థణాలు ఎప్పుడో పోయాయి. త్వరగా వదుల్తానన్నాను గదా !" అని రిక్షా పిల్చింది సుజాత ఇద్దరూ ఎక్కారు.

ఇల్లు దగ్గరవుతూవుండగా చెప్పింది సుజాత.

"సీతా ! దుర్గారావు వచ్చాడు."

"సీత గుండె ఝల్లుమంది ! అప్రయత్నంగానే గుండెమీద చెయ్యి వేసుకుంది. దుర్గారావు ఇదివరకు ఇద్దరికీ పరిచితుడు. కొన్నాళ్ళ క్రితం బదిలీయై వైజాగ్ వెళ్ళిపోయాడు ! ఏదో పని తగిలిందట. అందుకని ఈ ఊరొచ్చాడు. మరల. నీ గురించి మరీ మరీ అడిగేడు! దుర్గారావుని అలాగ నిరాకరించడంతో నువ్వు పెద్ద తప్పు చేశావేమో అని నాకనిపిస్తుంది సీతా అవకాశం ఎప్పుడూ మన అందుబాటులో ఉండదు.

సీతమౌనంగావింటూ వుండిపోయింది. మనసు ఆందోళితమయింది. నోరు బిగుసుకు పోయింది, గుండెలుఎగసిపడ్డాయి.

"పాపం దుర్గారావు చాలా చిక్కిపోయాడు సీతా! గడ్డం పెంచేడు. కళ్ళు లోతుకు పోయేయి. అస్థిపంజరంలా అయ్యాడు. ఏమిటని అడిగాను, ఏంచెప్పడు, నవ్వి వూరుకుంటాడు కానీ నాకు తెల్సు సీతా ! అతని మనస్సు ఛిత్రమయింది! నీకోసమే అతను అలాగ అయిపోయాడు." చెప్పకుపోతుంది సుజాత.

సీత కనులు చెమ్మగిల్లాయి. సుజాత చూడకుండా కొనగోటితో కంటి చివర పోగయిన అశ్రుబిందువుల్ని తుడుచుకుంది.

"అసలు నువ్వలా ఎందుకు చేసేవన్నది, తలబ్రద్దలు కొట్టుకున్నా ఈ నాటికీ నాకు అర్థంకాదు. అతనికేం తక్కువని? అందం లేదా ? సంస్కారం లేదా ? ఆస్తి లేదా ? చదువు, వుద్యోగం లేవా ? అన్నీ ఉన్నాయిగదా ? నీ పరిస్థితులన్నీ తెలుసుకున్నాడుగదా ? నీ బరువు బాధ్యతల్ని తనూ సంతోషంగా పంచుకుంటా నన్నాడుగదా ! మనసు విప్పి అన్నీ మాట్లాడేడుగదా! ఏమీ దాచకుండా హృదయాన్ని నీ ఎదుట పరచి పెట్టాడుగదా ? నువ్వూ అంతావిని సంతోషంగా నే తలఎగరేస్తివి. అతను ఆ రోజు ఆనందంతో వూగిపోవటం నాకూ తెలుసు. నేనూ ఎంతో సంతోషించాను. "నా స్నేహితురాలు సీత" ఎంతో అదృష్టవంతురాలు అని పొంగిపోయాను. అటువంటిది మర్నాటికల్లా నీ మనసు ఎందుకు మార్చుకున్నావు ? ఇది నీ స్వవిషయమే అనుకో, నేను కల్గించుకోకూడదు. అయినా మనసున్న స్నేహితురాలిగా, నీ మంచినికోరి మాత్రమే నేను బాధపడుతున్నాను సీతా. చేతికందిన స్వర్గాన్ని నువ్వే కాలదన్నుకున్నావు. అదే నా బాధ ..."

సీత తన మొహాన్ని చేతుల్తో కప్పుకుంది.

మౌనంగానే రోదించింది.

సుజాత చెయ్యి ఆమెవీపుమీద ఆదరపూర్వకంగా కదలాడింది.

"పోన్లె మరచిపో సీతా! పూరుకో ఏమయినా అలా జరిగిపోయింది. ఏది ఎలా జరిగినా మనం మంచి స్నేహితులం పరస్పర హితవుకోరుకునే వాళ్ళం. నా లక్ష్యం అదే పూరుకో. అతనికి నిన్ను చూడాలని గాఢమయిన కోరికవుందని నా కన్పించింది అది కేవలం అభిమానం ప్రేమ కలబోసి పెంచిన కోరిక మాత్రమే. ఒకవేళ అతను యాదృచ్ఛికంగా కలిసినట్లయితే కనీసపు స్నేహభావాన్నయినా వ్యక్తం చెయ్య గలిగించిన అనుబంధాన్ని గురించ యినా మర్యాదని పాటించవలసిన ధర్మం అంటూ వుందిగా. ఇప్పుడు నీకు నేను చెప్పదల్చుకున్నదిఇంతవరకుమాత్రమే. కానీ ఒక విషయం నమ్ము. నేను నీ స్నేహితురాల్ని. నీ హితవుని మాత్రమే కోరేదాన్ని. అందుకోసం నా ప్రాణమైనా ఇవ్వటానికి సిద్ధపడతాను. నన్ను నమ్ము.

సీత హృదయం ద్రవించిపోయింది. ఆత్రంగా సుజాత నడుంచుట్టూ చెయ్యి పెనవేసి బిగించింది. ఏవో చెప్పాలని ప్రయత్నించింది.

కాని నోరు పెగిలి రాలేదు.

గుండెలు గుబగుబలాడాయి.

మనసు ఎగిరెగిరి పడింది.

మనసు పొరలలో బాధాతప్తమయిన మధురోహలు కదులాడాయి.

రిక్షా ఆగింది.

దిగేక డబ్బులిచ్చి రిక్షాను పంపేసింది సుజాతే!

"రా, సీతా!" అంటూ సీత చెయ్యి పుచ్చుకుని నడిపించింది సుజాత స్నేహపిచ్చిలంగా.

గేటు తీసుకుని ఇద్దరూ లోపలికి వెళ్ళారు!

సుజాత గబగబా నడిచింది.

ఆమె వెనుకే అడుగులు వేసిన సీత కాళ్ళు అప్రయత్నంగా ఆగిపోయేయి. సీత ఆ క్షణాన తలెత్తింది. కళ్ళకు కన పడిన దృశ్యాన్ని చూసి, ఆమె గుండెలు ఝల్లుమన్నాయి ॥

## 2

"రా సీతా! రా!" అంటూ పిల్చింది సుజాత

ఎదురుగా వరండాలో కుర్చీలో కూర్చుని వున్న దుర్గారావు సీతనేచూస్తూ వున్నాడు. ఆ చూపులో స్నేహం వుంది, అభిమానం వుంది. ఈ రెంటినీ మించిన ఒక అనిర్వచనీయమైన భావనా వుంది.

సుజాతే వెనక్కి తిరిగివచ్చి సీతని చెయ్యిపట్టుకుని తీసుకొని పోయింది. కాళ్ళు చేతులు కడుక్కొన్నాక ఇద్దరూ తిరిగి వరండాలోకి వచ్చారు.

"మీ రిద్దరూ కబుర్లు చెప్పుకుంటూ వుండండి. నేను ఇప్పుడే లోపలికి వెళ్ళి వస్తాను." అంటూ లోపలికి వెళ్ళింది సుజాత.

"కూర్చోండి" ఆదరంగా అన్నాడు దుర్గారావు.

సీత కూర్చుంది.



"కులాసాగా వున్నారా?" అతనే అడిగాడు.

తల పైకీ కిందకీ ఆడించింది సీత.

"చిక్కిపోయినట్లున్నారు" అన్నాడు.

సీత పెదాలపైకి నవ్వు తెచ్చుకుంది.

"పనివుండి మరల నేను ఈ ఊరు రావలసి వచ్చింది. వచ్చాను, స్నేహితుల్ని కూడా చూశాను. నాకు చాలా సంతోషంగావుంది, సీతా!" అతనిగొంతు వణికింది.

తల దించుకుని అతని మాటలువింది సీత. సీత హృదయం తడబడుతూంది. పెదాలు అదురుతున్నాయి.

"మీరు బాగా చిక్కిపోయారు. ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకోండి" అని అందామనుకుంది సీత. కాని ఎంత ప్రయత్నించినా నోరు పెగలలేదు.

"మీవాళ్ళందరూ కులాసాగా వున్నారా సీతా?"

తలవూపింది సీత.

"మీ అన్నయ్య ఏంచదువుతున్నాడు. బి. ఎ. అనుకుంటాగదూ?"

అవునన్నట్లు తలవూపింది

"మీ చెల్లాయి కాలేజీలో చేరిందా?"

"ఊఁ."

"తమ్ముడు శశిధర్ చాకులాంటి కుర్రాడు. నైనయిందనుకుంటా."

"అవునండి" అనకోయి తల వూపి మాత్రమే సమాధానం చెప్పింది సీత.

"మీ అమ్మగారు, నాన్నగారు మంచి మనుషులు. ఎవరైనా ఎంత మంచి వారయినా పరిస్థితుల ఇనుప చట్రాల్లో నలిగిపోక తప్పదు త్వర లోనే మీ కుటుంబం కష్టాల్ని గట్టెక్కి సుఖాలరేవు చేరుకోవాలనే నేను ఎప్పుడూ కోరుకుంటూ వుంటాను. అప్పుడప్పుడు నన్ను జ్ఞాపకంచేసుకో సీతా, నీకు మంచి జరగాలి, అని కోరుకునే ఒక మిత్రునిగా నన్ను గుర్తువుంచుకుంటావు కదూ!"

సీత తలవంచింది. ఆమె కనులు అశ్రు పూరితా లయాయి.

"ఇటువంటి సమయాల్లోనే మనిషికి మనోధైర్యం అవసరం. ఆ ధైర్యమే మనిషిని బాధలనుంచి కడతేర్చగల సాధనం. త్వరలోనే మీ అన్నయ్య చదువు పూర్తయి, ఉద్యోగం వస్తుంది. అతను మీ కుటుంబానికి కొండంత అండగా అవుతాడు. మీ కష్టాలు తొలగి పోతాయి. అప్పుడు నువ్వూ మీ చెల్లాయి పెళ్ళికూతుళ్ళవ్వచ్చు. దేవుడు మేలుచేస్తే ఆ రోజు త్వరలోనే రావచ్చు అన్నట్లు నీ పెళ్ళికి నన్ను పిలుస్తావా సీతా? పిలిస్తే తప్పకుండా వస్తాను. ఈ అభాగ్య మిత్రుడ్ని మర్చిపోతేం?"

పమిటచెంగుతో ముఖం కప్పుకుంది సీత,

"ఛీ! తప్పు. అలా దుఃఖపడటం కూడదు. అందులో నీలాంటి అమ్మా యికి అది తగదు నిన్ను చూసి ఎప్పటి కయినా నేను గర్విస్తాను నీవంటి స్నేహితురాల్ని కలిగి వున్నందుకు నా మనసు ఆనందంతో పొంగిపోతుంది. అదే నా గర్వానికి కారణం. ఏదీ మొహం తుడుచుకో సీతా. చీరప్!" అని నవ్వి నవ్వించాడు.

మూడు ప్లేట్లలో రవ్వలడ్లు, వేయిం చిన జీడిపప్పులు సర్ది ట్రేలో పెట్టుకుని వచ్చింది సుజాత.

'వాతావరణం గంభీరంగా వున్న ట్లుంది నేను పానకంలో పుడకనవలేదు గదా!" అని నవ్వింది.

"ఆ మాటంటే నీ ముక్కునున్న పుడక ఒప్పుకోదు జాగ్రత్త" అని నవ్వాడు దుర్గారావు.

"ఒకరోజు వుండి వెళ్ళమంటే లేదు అర్జంటు పని వుంది,ఈ రోజే వెళ్ళాలం టున్నాడు." అందిసుజాత నెపం వేస్తూ. సీత తలెత్తి వుండమన్నట్లుగా అతన్ని చూసింది.

"లేదమ్మా. తప్పదు వెళ్ళిపోవాలి "

టీ తీసుకున్నాక థాంక్స్ చెప్పి లేచింది సీత. కాని మనసు వెనక్కి పీకు తూనే వుంది. ఇంకా అక్కడే కూర్చో వాలనే వుంది.

"సో" వుయార్ డిపార్టింగ్ థాంక్యూ

డియర్ యంగ్ లేడీస్'' అంటూ, లేచి నిలబడ్డాడు, దుర్గారావు తనుకూడా.

నాలుగడుగులు వేసాక ఆగి వెను దిరిగి చూసింది సీత.

దుర్గారావు నవ్వి చెయ్యి వూపాడు.

సీతను గేటుపరకువచ్చి సాగనం పింది సుజాత.

సీత, గుండెలు బరువుగా అయాయి. మనసు వూగిసలాడింది. ఆ సంచల నాన్ని నిగ్రహించుకోవాలని ప్రయ త్నిస్తూ గబగబ అడుగులువేసింది సీత,

ప్రొద్దుగూకింది. వీధుల్లో దీపాలు వెలిగాయి. షాపులు మెర్క్యురీ దీపాలతో ధగధగలాడుతున్నాయి. బజారులనిండా జనం కిక్కిరిసి ఉన్నారు. కాలేజీకుర్రాళ్లు సెంటర్లో పేపర్లకోసం ఎగబడ్తున్నారు. ఈవెనింగ్ ఎడిషన్ వచ్చినట్లు వుంది. రిజల్ట్సు బి ఎ. రిజల్ట్సు అంటూ పేపర్ల కుర్రాడు కేకలువేసుకుంటూ పోతు న్నాడు. అతన్ని ఆపి ఒక పేపరు కొన్నది సీత. అక్కడ్నే ఆగి రాజు రిజల్టుకోసం వెతికింది. రాజు నంబరు ముప్పయి సున్నా ఆరు. ఆ నంబరు ఎక్కడా లేదు. ఆత్రంగా ఒకటి రెండు సార్లు వెతికింది సీత.

ఆమె నవనాడులూ క్రుంగినట్లయింది.

రాజు పరీక్ష మరలా తన్నింది.

సీతని నీర్సం ఆవహించింది.

"సీతా!"

ఆ పిలుపుకు వెనుదిరిగి చూసింది సీత అప్పటికే రాజు దగ్గరకు వచ్చాడు.

"ఇంత ప్రొద్దుపోయి ఎక్కడినుంచి వస్తు న్నావు సీతా?"

''ఇక్కడికేలే సుజాత దగ్గరికి వెళ్ళి వస్తున్నాను. నీ రిజల్ట్సు పడ్డాయి చూశావా?"

''మైగాడ్! రిజల్ట్సుపడ్డాయా? అంత తొందరేమొచ్చిందని అప్పుడే వేశారు! ఆ వేసినవాళ్ళకి బుద్ధిలేదు," అంటూ దగ్గరగా వచ్చాడు.

గుప్పున వాసనకొట్టింది. కడుపులో దేవినట్లయి మొహం తిప్పుకుంది, "ఊ. రిజల్టు పడ్డాయంటావు చూశావా? ముప్పయిా సున్నా ఆరేమయింది, బండెక్కిందా?"

"పోయిందన్నయ్యా!" బాధగా అంది సీత.

రాజు పకపకనవ్వాడు. తెల్లబోయింది సీత.

"గురూ! ఎవరా చిలుక? కొత్తగా పట్టావేమిటి?''

"చాప్, నోర్ముయ్యరా రాస్కెల్. మా చెల్లాయి.!"

"సారీ గురూ! అలవాట్లో పొరపాటు

"సరేలే నోర్ముయ్యి. కాసేపు అవతల తగలడు.''

సీత నడవసాగింది. ఆమె ప్రక్కనే నడుస్తూ అన్నాడు రాజు.

"జాగ్రత్త చెల్లాయ్ ఈ మాట ముసలాళ్ళ చెవినిగాని వేసేవు. గుండె

పగిలి గొడవ చేయగలరు. చూద్దాం. ఈ వెధవ పరీక్ష ఇలా ఎన్నాళ్ళు తంతుందో చూద్దాం. అన్నట్టు సీతా, ఆ సంగతి ఏం చేసావ్ ?"

సీత ఆగి ఆతనివంక చూసింది. రాజు అసహనంగా మొహం పెట్టాడు.

"ఏమిటని గదూ నీ చూపు. ప్రొద్దుట చెప్పేను గదా, డబ్బు కావాలి."

"చూస్తాను "

"ఎప్పటికి చూస్తావు ? ఈ చూట్టం తోనే నా ప్రాణాలు పోతున్నాయ్."

"అన్నాయ్ ! కష్టపడి ఇలా డబ్బు తగలెయ్యకపోతే ప్రాణాలు పోతాయా ? పరీక్షలూ తగలేసి డబ్బూ తగలేయ టానికి మనమేం లక్షాధికార్లమా ?"

''భిక్షాధికార్లమంటావు, అంతేగా. పోనీ అలాగే అనుకో. దేనికోదానికి అధికార్లమే గదా మరి !"

"అన్నయ్యా!"

"ఏమిటమ్మా నువ్వు మరీని."

"నాకు బాధగా వుందన్నయ్యా."

"పిచ్చిదానా, ఎందుకు బాధ పడటం ? అందులో ఏమయినా సుఖం వుందంటావా ? చెప్పు. అలా అయితే నేనూ బాధపడటం మొదలుపెడతాను."

"అమ్మ నీ మీద ఎన్ని ఆశలు పెట్టు కుని బ్రతుకుతూ వుంది ! ! నాన్న సంగతి నీకూ తెలుసు. అన్నీ తెలిసి నువ్వుకూడా ఇలాగ తయారయితే ఈ సంసారం ఏమవను ? ఎలాగ కడ తేరను ?"

"అబ్బ ! ఏదన్నా అడిగితే నస పెడతావ్. అందుకే నువ్వంటే నాకు కోపం." అంటూ విసుక్కున్నాడు రాజు. సీత కొన్నిక్షణాలు మౌనంగా వుండి అంది.

"నేనంటే నాక్కూడా కోపంగా వుంది అన్నాయ్. ఏం చేద్దాం చెప్పు."

"ఏట్లో తగలడదాం పద" కోపంగా అన్నాడు రాజు.

"పద, నేను సిద్ధంగానే వున్నాను మరి !" అంది.

"సరేలే నోర్మయ్. బుద్ధిలేకపోతే సరి" అంటూ గిర్రున వెనుదిరిగి పోయాడు కోపంగా రాజు

సీత ఇల్లు చేరేసరికి సుబ్బమ్మ, రాఘవయ్య పీధరుగుమీద కూర్చుని వున్నారు. రాఘవయ్య చుట్ట తాగుతూ వున్నాడు.

"ఏమిటే అమ్మాయ్ ! ఇంత ప్రొద్దు పోయింది. మీ నాన్న వచ్చారు. పోనీ ఓపికతెచ్చుకుని ఇంత వుడకేద్దామని చూస్తే బియ్యం నిండుకున్నాయి. నువ్వు ఇలాగ చేస్తే ఎలా తల్లీ ? ఈ సంసారం ఎలా సాగేది ?" అంది సుబ్బమ్మ.

"పక్కింటి పిన్నిగార్ని అడిగి బదులు తీసుకోపోయావా ? అమ్మా" అంది సీత.



"ఏదీ, ఒకటే సీరసం, లేచి తిరిగి తేగా. నువ్వు త్వరగా వచ్చి ఆ పనేదో చూసుకుంటావనుకున్నాను. నాకేం తెలుసు? నువ్వుకూడా రాణీగారిలా తిరిగి తిరిగి ఇప్పటిగ్గాని ఇల్లు చేరవని నేను కలగన్నానా?"

"లలిత ఏమయింది?"

"సినిమాకని ప్రాణాలుతీసి అది ఇప్పుడే పోయింది."

"దాన్ని సినిమాకి పంపించకుండా వుండాల్సింధమ్మా. ఇపుడు మనకి అవే తక్కువయ్యాయా?"

"ఆ సంగతి నాకు తెలీదుటే తల్లీ, చిన్నపిల్ల ముచ్చటపడిందని సరే నన్నాను. అది తప్పే అయితే చెంపలు వేసుకుంటాను. నన్ను క్షమించు తల్లీ. నా బిడ్డలు ఎంత గొప్పవాళ్ళు! చెట్టంత తండ్రినే ఎదురుగా పెట్టుకొని కన్న తల్లిని కూడా ఎంతలేసి మాటలయినా అనగల్రు! శభాష్ అని నలుగురూ నన్ను మెచ్చుకుంటారు."

"ఇపుడు నేనేమన్నా ననమ్మా అలా బాధపడ్తావు?"

"పడద్దూ, ఇంకా ఎన్ని బాధలు

పడాలో ! ఇంకా ఎన్ని చూడాలో ! ఆ శ్రీరామచంద్రమూర్తికి దయ కలగద్దూ !''

"సర్లే, పోనీ. వూర్కో అమ్మా. నాదే తప్పు, నన్ను క్షమించు.''

"వూర్కో-వూర్కో అని అందరూ నన్నేగా వూర్కోపెట్టేవాళ్ళు" అంటూ గొణిగింది సుబ్బమ్మ. సీత లోపలికి వెళ్ళింది. దీపం వెలిగించింది.

''సుబ్బలక్ష్మీ, వూర్కోరాదా" రాఘవయ్య అనునయంగా నిర్దేశించాడు, భార్యని.

''వూర్కోక నేనేం చెయ్యగలనండీ. చూసారుగా, ఎంతెంత మాటలందో ? తిరిగి తిరిగి మగ మహారాజు అలిసిపోయి ఇంటికి వచ్చారు. ఏవేళననగా తిన్నారో ప్రేమగా ఇంత వుడకేసి నా చేతుల్తో పెట్టుకోవాలనేగా నా తాపత్రయం. ఆమాత్రం ఇంగితం, అభిమానం అందరికీ వుండి ఏడిస్తేగా ?"

కాళ్ళు చేతులు కడుక్కొని, మొహం తుడుచుకుంటూ సీత బయటికి వచ్చింది.

"అమ్మా, నా పెట్లో ఐదు రూపాయల కాగితం కనపట్టంలేదు. నువ్వు గాని తీసావా ? బియ్యానికి కావాలి.''

''చెప్పేను గాదే, లలిత కిచ్చానని."

"అలమార్లో రూపాయుండాలి ! ?"

"అదా ! ఇందాక మీ నాన్నగారు చుట్టలు కావాలంటేనూ శశికిచ్చి చుట్టలు తెప్పించాను."

సీత నిట్టూర్చింది.

"ఎందుకే తల్లీ, ఆ నిట్టూర్పులు. నట్టింట అలాగ నిట్టూర్పులు వదలటం మంచిదిగాదే. ఇప్పుడేం మునిగిపోయిందని ! బయటికిపోయి ఏ అప్పో సప్పో తేరాదా ? మా కాలంలో మేమూ ఇట్లాగే చేసామా ? జ్వరమొచ్చి మీ ముత్తవ్వ మంచమెక్కితే పదిమందిగల సంసారాన్ని నేను ఎట్లా సంభాళించుకుని వొచ్చాను."

"సరేలే అమ్మా, నేను వెడుతున్నాను."

"త్వరగా రా అమ్మా, మళ్ళీ అందరూ వచ్చి అన్నాలో అని నా ప్రాణాలు తీస్తారు."

"అట్లాగే."

ఇరుగింటి ఇంద్రావతి వూళ్ళోలేదు. పురుటికని పుట్టింటి కెళ్ళింది.

ఆమె భర్త ఆనందరావు మంచివాడు కాదు.

ఆఫీసుకి వెళ్ళేప్పుడు, వచ్చేప్పుడు కిటికీ దగ్గరచేరి దొంగచూపులు చూస్తాడు.

అందుకని పొరుగింటి పున్నమ్మ దగ్గరికి వెళ్ళింది సీత. అవతలింట్లో అడిగి లేదనిపించుకున్నాక, అంతా విని పున్నమ్మ "అయ్యోతల్లీ,నెలాఖరురోజులు గదా. ఇంట్లో అన్నీ నిండుకున్నాయి. అన్నట్లు నీకూ తెలుసుగా. ధరలు ఎలాగ మండిపోతున్నాయి. మీ బాబాయి

# కోతులు

గొల్లపూడి రాజ్యలక్ష్మి




"గోపీ ! ఒక్క క్షణం ఆగరా !" అంటూ వాడిచేతిలో పుస్తకా లుంచి — గుడిలోపలికి వెళ్ళాను.

తిరిగి వచ్చేదాకా వాడక్కడే నిల బడి - నా వంక హేళనగా - విసుగ్గా చూస్తూ అన్నాడు.

"ఏమంటున్నాడు నీ దేవుడు, కులాసానా ?"

ఇలా రోజూ ఏదో కామెంట్ చేయటం గోపాలంకి - విని నవ్వి వూరు కోవటం నాకూ అలవాటే అయినా ఇవాళ వూరుకోలేకపోయాను.

"ఆయనకేం లోటని ? కులాసా లేకపోవటానికి..."

"అయితే ... పాపం ఇప్పుడు నీకే పెద్ద లోటొచ్చిపడిందన్నమాట !"

"వ్యంగ్యం చేయకు. నాకదో తృప్తి. ఈ మహా విశ్వానికి అధినేత దేవుడు. ఆయన సృష్టిలో మనం ఇసుక రేణువుకు కూడా సరిపోలం. అట్లాంటి తేజస్సం పన్నుడిని స్తుతించటంలో తప్పేం వుంది ?"

"కావాల్సినంత వుంది. పలకని - వులకని ఆ రాయికి బదులు-ఏ మనిషికి మ్రొక్కినా ఫలం వుంటుంది."

"కానీ - నేను ఫలం కోరుకోవటం లేదు."

"ఓహో ... ఏ ప్రతిఫలం కోరుకో

నప్పుడు ఈ దండాలూ - దస్కాలూ ఎందుకోయ్?"

"ఆయన సృష్టిపట్ల - మేధస్సుపట్ల మన వినయాన్ని చూపటం అనుకో రాదూ?"

"మన నిత్యజీవితంలో ఏ ఆపదలకూ - అవసరాలకూ అక్కరకురాని దేవుడిపట్ల వినయం ఎందుకు చూపాలి? అసలు దేవుడనేవాడున్నాడా? వుంటే ఎవరైనా చూశారా? మన సైన్సు గ్రంథాలు తిరగవేయ్ ఈ సృష్టి పరిణామం ఎలా మొదలైందీ తెలుస్తుంది. అందులో దేవుడిపాత్ర ఎక్కడైనా కనిపిస్తే చెప్పు. అప్పుడు ఒప్పుకుంటాను."

"ఏ దేవుడూ - ఏ మహత్తరశక్తీ లేనిదే ఈ గ్రహాలూ - గోళాలూ గతులు తప్పకుండా ఎట్లా పరిభ్రమిస్తున్నాయి? వీటన్నిటి వెనుక ఏదో అజ్ఞాత శక్తి, దివ్యహస్తం వుండి తీరాలి. అది నా నమ్మకం!"

"నీ నమ్మకాలన్నీ - నీ మూఢ విశ్వాసాలమీద నిలిచినవి. అవి ఎప్పుడో అప్పుడు కూలిపోక తప్పదు."

"ఆ మాటే నేనూ అంటాను!"

"మంచిది. చూద్దాం వేచి. కాలం ఎవర్ని ఏ పరిధుల్లోకి తీసుకెళ్తుందో..."

నేను మౌనం వహించాను.

గోపాలం-నేను హైస్కూల్‌లో చదువుకునే రోజుల్నించి ప్రాణస్నేహితులం. మా ఇద్దరిమధ్యా అనేక విషయాల్లో ఏకత్వం వుండటంవల్ల మంచి స్నేహితులమయ్యాము. ఒక్క దేవుడి విషయంలోనే మేమిద్దరం ఉత్తర - దక్షిణ ధ్రువాలం ఒకరి నమ్మకాల్ని మరొకరం మార్చలేక మధ్యమధ్య ఇలా వాగ్వివాదపడటం మా కలవాటే. మా కిద్దరికీ బాడ్‌మెంటన్ ఆడటం సరదా. రోజూ కాలేజీ అవగానే కాస్సేపు ఆడుకుని ఇంటిముఖం పట్టాం. చాలా చక్కగా ఆడతాడు గోపాలం. శలవు రోజుల్లో - తీరిక సమయాల్లో లైబ్రరీకి వెళ్ళి - పుస్తకాలు తిరగేసి - వాటిల్లోని విషయాల గురించి అనేకసార్లు గంటలతరబడి వాదించుకోవటం మా కిష్టం. నిజానికి గోపాలం మంచి తెలివైనవాడు. ఆటల్లోనేకాదు. మాటల్లోనూ మేటి. మాటల్లోనేకాదు - ఆచరణలోనూ చూపిస్తాడు. అతని మేధాశక్తి అపూర్వం అన్పించి అబ్బురపడ్తూంటాను. తను వాదించే విషయాన్ని నా చేతకూడా 'ఔను' అన్పించేంతటి నేర్పరి. నేను అతనిలోని ఆ శక్తికే మిక్కిలి ఆకర్షితుడనౌతాను.

టెన్తులో మంచి మార్కులు తెచ్చుకున్న గోపాలం - ఇంటర్‌లో వాడి కిష్టమైన బై. పి. సి గ్రూప్ తీసుకున్నాడు.

అత్తెసరు మార్కులొచ్చిన నేను ఎం. పి. సి. తీసుకున్నాను.

మా గ్రూప్స్ వేరైనా కాలేజీ ఒకటే అవటంనుంచి - మా స్నేహానికి ఏ విఘ్నమూ వాటిల్లలేదు. మేం పెరుగుతున్నకొద్దీ మా స్నేహం మరింత పటిష్టం కాజొచ్చింది. మా అభిప్రాయాలూ మరింతగా బలపడినయ్.

అయినా -

నేను గుడి కన్పించినప్పుడల్లా - లోపలికెళ్లి నమస్కరించటం - గోపీ వెక్కిరించటం మానలేదు. అదీ మా దిన చర్యలో ఒక భాగమైపోయింది.

కాలేజీ జీవితం ముగిసింది. నేను బి ఏ. అన్పించుకున్నాను. గోపాలం బి. యస్సి.లో యూనివర్సిటీ ఫస్టు వచ్చాడు.

గోపాలం తన కిష్టమైన డాక్టర్ కోర్సు కెళ్ళాడు.

నేను బి.ఇడి.లో చేరాను.

మా ఇద్దరిమధ్యా ఉత్తర ప్రత్యుత్తరాలు జరుగుతూనే వున్నాయి.

నా చదువు పూర్తయి వున్నఊళ్ళోనే హైస్కూల్లో టీచర్‌గా చేరాను.

గోపాలం ఎం.బి బి.యస్ లో డిస్టింక్షన్ తెచ్చుకుని - ఫారెన్ స్కాలర్‌షిప్‌మీద రీసెర్చికై జర్మనీ వెళ్లాడు.

నేను మామూలు బడిపంతులు ఉద్యోగంతో - పెద్దవాళ్ళు కుదిర్చిన పద్మను పెళ్లిచేసుకుని - సంసార తాపత్రయంలో పడ్డాను

జర్మనీ వెళ్లాక - మొదట్లో లెటర్స్ వ్రాసిన గోపాలం - క్రమంగా తగ్గించేశాడు. నేనూ సంసారపు గొడవల్లో తాత్కాలికంగా గోపాలం మాట విస్మరించాను.

రేసు గుర్రాల్లా రోజులు దూసుకుపోతున్నాయ్

ఓ ఆదివారం - ఉదయంపూట తీరిగ్గా లెక్కల పేపర్లను ముందేసుకుని దిద్దుతూ కూర్చున్నాను.

వాకిట్లో కారు ఆగిన శబ్దమైంది. మా ఇంటి కెవరు వస్తారన్న నిర్లక్ష్యంతో పట్టించుకోలేదు.

బూట్లశబ్దానికి తలెత్తిచూసిన నేను ఆశ్చర్యానందాలతో ఉక్కిరిబిక్కిరయ్యాను. వున్నపాటుగా లేచి గోపాలానికి ఎదురెళ్లాను.

ఆప్యాయంగా కౌగలించుకుంటూ - "ఇంకా నీకీ గోపీ గుర్తున్నాడురా ?" అన్నాడు గోపాలం:

"అంత నిష్ఠూరం వేయకు గోపీ ! నిన్ను మర్చిపోవటమా ?" అన్నాను, ఏదో మాటలకందని అనుభూతి నా గొంతునిండా తొణికిసలాడగా!

గోపాలాన్ని కుర్చీలో కూర్చోమని - లోపలికి పరిగెత్తి - పద్మతో కాస్త కాఫీగట్రా చేయమని పురమాయించి వచ్చాను.

గోపాలం గది నలుమూలలా కలయజూస్తూ "ఊఁ ... పక్కా సంసారి వయ్యావన్నమాట !" అన్నాడు నవ్వి




"నా సంగతికేంలే... నీ విషయాలు చెప్పు. ఎప్పుడొచ్చావ్ ఇండియా ? రీసెర్చి పూర్తిచేశావా ? పెళ్లి చేసుకున్నావా ? పిల్లలెంతమంది ??" అన్నాను గబగబా.

"ఫుల్ స్టాప్. నీలాగా నేను బుద్ధి లేని గాడిదననుకున్నావారా ? నీకు ఆహ్వానం పంపకుండా చేసుకోవటానికి ?"

"సారీరా గోపీ ! అనుకోకుండా జరిగిపోయింది. కనీసం ఇన్విటేషన్ అన్నా పంపలేకపోయినందున రియల్లీ సారీ..."

"నెవర్ మైండ్ ... నేను ఇండియా వచ్చి వారం అయింది. ఇక్కడికి రాత్రే వచ్చాననుకో ... రాగానే నేను మొదటి పని - నిన్ను వెదుక్కుంటూ రావటమే...రీసెర్చి పూర్తిచేసుకునే వచ్చాను- ఇక ప్రాక్టీస్ పెట్టటానికి ఏర్పాట్లు చూసుకోవాలి !"

గోపాలం బాగా తెల్లబడ్డాడు. కళ్లకు జోడు రావటంతో మనిషికి నిండుదనం వచ్చింది. మాటలో - చూపులో ఓ రకమైన హుందా. రత్నాన్ని సానబెట్టినట్లు ఇప్పుడు మరింత కళకళలాడిపోతున్నాడు.

పద్మ ఉప్మా ప్లేట్లతో వచ్చింది.

ఇద్దరికీ పరిచయం చేశాను.

"ఇప్పుడెందుకమ్మా ఇవన్నీ ?" అన్నాడు మొహమాటంగా.

"నోరు మూసుకొని తినరా ! నా పెళ్లి కెలాగూ రాలేదు. ఇవాళ మా యింట్లోనే నీ భోజనం. తిక్కవేషాలు వేయక !" అన్నాను.

మొదట్లో ఏవో అభ్యంతరాలు చెప్పినా - మా భార్యాభర్తల బలవంతంతో వుండిపోయాడు.

కాఫీల్లాగాక వక్కపొడి అందించబోయాను. నిరాకరించాడు.

సిగరెట్ ఆఫర్ చేయబోయాను. సారీ చెప్పాడు.

"వాటెవండర్! స్టేట్స్ వెళ్ళినా - నువ్వు తెలుగు మర్చిపోలేదు. ఏ బాడ్ హాబిట్స్ లేవంటే నమ్మలేకపోతున్నాను" అన్నాను ఆశ్చర్యంగా.

"మన బలహీనతలు బైటపడవేసుకోవటానికి స్టేట్స్‌కే వెళ్ళనక్కరలేదు. ఎక్కడున్నా అవి మనిషిని లోబరుచుకుంటూనే వుంటాయి. వాళ్ళనుంచి మనం నేర్చుకోవాల్సింది ఇలాంటి హాబిట్స్ కాదు. నిజాయితీ-క్రమశిక్షణ. కానీ మనసులో చాలామంది అదేం దౌర్భాగ్యమో అవిమాత్రం వదిలేసి - మిగతావి వెంటబెట్టుకొస్తారు!"

గోపాలం అక్కడి ఆచార వ్యవహారాలు - వాళ్ళు సాధించిన విజయాలు - అక్కడ చూడతగిన ప్రదేశాలు అన్నీ వివరంగా చెప్తూ కూర్చున్నాడు. అవన్నీ ఆసక్తిగా వింటూ చూస్తున్నంత అనుభూతి చెందాను.

"ఆ సాయంత్రందాకా మా ఇంట్లోనే వున్నాడు గోపాలం. వెళ్ళబోయేముందు కారులోనుంచి ఓ పేకెట్ తీసుకొచ్చి నా చేతుల్లో పెట్టాడు.

"ఏంట్రా ఇది?" అన్నాను ఆశ్చర్యంగా.

"తీసి చూడు. నీకోసం ప్రత్యేకంగా తెచ్చాను. ఇంతకంటే విలువైంది - నాకేదీ కన్పించలేదు."

విప్పాను.

మూడు కోతులు! సజీవంగా వున్నట్లే భ్రమగొల్పుతున్న మూడు కోతులు.

చెడు చెప్పకు - వినకు - చూడకు. అన్న సందేశాల్తో వున్న మూడు కోతులు.

"థాంక్స్‌రా!" అన్నాను.

"రా! ... అలా మన కాలేజీవైపు వెళ్ళొద్దాం" అన్నాడు కార్లో కూర్చుని.

ఇద్దరం బైల్దేరాము.

మాతో చదువుకున్నవాళ్లు ఏ విధంగా సెటిలయ్యిందీ చెప్పుకున్నాం. కాలేజీ ఆవరణలోకి వెళ్ళాక - విచిత్రమైన అనుభూతి కల్గింది. ఒకప్పటి మా కాలేజీ! ఇప్పుడు మాకేం కాదు. అయినా పుట్టిపెరిగిన వూరిమీదా - చదువుకున్న విద్యాలయాలమీదా ఏళ్ళ తరబడి వుంటున్న ఇంటిమీదా మనిషికి ఎంత మమకారమో!

తిరిగి వస్తూ - దారిలో గుడిదగ్గర ఆపాడు కారు గోపాలం నా అలవాటు ఎంత గుర్తో అన్పించింది. నేను గుడి లోపలికి నడిచాను. గోపాలం కారుదిగి - అక్కడే వుండిపోయాడు. అంటే గోపాలం అభిప్రాయాలేం మారలేదన్న మాట!

నేను తిరిగి వచ్చేసరికి గోపాలం కారును ఆనుకుని నిలబడి — గాలి గోపురంవైపు చూస్తున్నాడు.

దగ్గరగా వెళ్ళినా - అతనట్లాగే వుండటంచూసి-



''ఏమిటంత పరిశీలన ? శిల్పకళ నేనా చూసేది ?'' అన్నాను - నేనూ చూపులు అటే త్రిప్పి.

'' కాదు ! భగవంతుడ్ని ! '' అన్నాడు నిదానంగా.

పక్కలో బాంబుపడ్డట్టు అదిరి పడ్డాను.

''ఒరే గోపీ ! ... నువ్వేనా మాట్లేది ?'' అన్నాను ఆశ్చర్యంగా

''ఎందుకంత ఆశ్చర్యం ?''

''అయితే నువ్వు మారిపోయావన్న మాట !! '' అన్నాడు సంతోషంగా.

''కానీ - నువ్వనుకుండే మార్పు కాదు.''

''నాకర్థం కావటంలేదు.''

''చెప్తాను...అదిగో ఆ గాలిగోపురం మీద ఏం వున్నాయి ?''

''శిల్పాలు !''

''ఇంకా ?''

''పావురాళ్ళు ?''

''ఇంకా ?''

''కోతులు !''

''అవే ! నే నన్న భగవంతుడు!''

''కోతులా !''

''అవును ! కారెక్కు - అర్థం అయేలా చెప్తాను.''

ఎక్కి కూర్చున్నాను - కదిలింది కారు

''అనాదినుంచీ మానవజాతికి అనేక ప్రాణులు - అనేక విధాలుగా ఉపయోగిస్తూ వచ్చాయి. అన్ని ప్రాణులలోకీ ఈ కోతులు తనకు ఎన్నివిధాలా ఉపకరిస్తున్నాయో తెలుసా ? వాటివల్ల మనకు కల్గుతున్న మేలు తెల్సుకుంటే వాటిని భగవంతుడని ఎందుకన్నానో తెలుస్తుంది.''

నేను మౌనంగా వింటూ అర్థంచేసుకోవటానికి ప్రయత్నించసాగాను.

"మనిషికి — కోతికి దగ్గర పోలిక లున్నాయి. కోతినుంచే మానవుడు రూపాంతరం చెందాడు. ఈనాడు మనం ఎన్నో రోగాలనుంచి - నివారణ పొందుతున్నామంటే అదంతా కోతుల చలవే. ఈనాడు కోతులు శాస్త్రజ్ఞుల పరిశోధనలకు ఎంతో ఉపకరిస్తున్నాయి. ఎన్నో ప్రయోగాలు వాటిపై జరిపి - వాటి రియాక్షన్ గమనించి - దాన్ని బట్టి మందులు తయారుచేస్తున్నారు. ఏ మనిషికైనా తమ వృత్తికి ఎంతో ఉపకరించే వాటిని దైవంఅంటాను నేను. దైవం అన్నది మన మాటల కతీతమైనది అని అర్థం. ఒక మనిషి చావుబ్రతుకుల మధ్య చేయూతనిచ్చి - జీవితాన్ని చూపించే డాక్టరు ఎంతో ఉన్నతుడనీ - దేవుడనీ ఆకాశాని కెత్తేస్తారు. కానీ ఏ డాక్టరుకైనా మందులనే ఆయుధం చేతిలో లేనిది ఏమీ చేయలేదన్నది జగ ద్విదితం. ఈ మందులు ఎట్లావచ్చాయి? ఎలాంటి పరిశోధనవల్ల? అని ఆలో చిస్తే - పేరుపొందిన ప్రతి మందు వెనక — అనేక జీవాల ప్రాణ త్యాగా లున్నాయి. ఉదాహరణకి పోలియో వాక్సిన్ తీసుకో. ఈ వాక్సిన్ కోతులపై పరిశోధనలుచేసి వుండకపోతే- ఈనాడు మనకు అందుబాటులో వుండేదికాదు. మానవుని శరీర ధాతునిర్మాణంలో సారూప్య - సాహిత్య ధర్మాలుగల కోతులపై పరిశోధనలే ఇతమిత్థమైనవి కావటంచేత - శాస్త్రజ్ఞులు వీటినే ఎక్కువగా ఉపయోగిస్తున్నారు. కొందరు శాస్త్రజ్ఞులు శస్త్రచికిత్సలోనూ తమ విధానాలకై కోతులపై పరిశోధనలు జరుపుతున్నారు. కొందరు శాస్త్ర వేత్తలు - మెదడులో లైంగిక కార్య కలాపాల కేంద్రాన్ని గుర్తించటానికై విద్యుత్తు ప్రవహించే సూదుల్ని మెద దులో గుచ్చుతారు. ఇలా రకరకాలుగా చిత్రహింసల పాల్జేస్తూ - కోతుల్ని ఉపయోగించుకుంటోంది - మా వైద్య శాస్త్రం అందుకే నాకు కోతుల్ని చూస్తే హృదయం ద్రవిస్తుంది. వాటిపట్ల నా మనసు కృతజ్ఞతతో నిండిపోతుంది. చేతులెత్తి నమస్కరించాలనిపిస్తుంది. మన ప్రగతికోసం - అవి బలైపోతు న్నాయన్న నిజం నన్ను కదిలిస్తుంది - మనం వున్నాం ఎందుకూ? తోటి మనిషి బాగుపడినా — సుఖంగావున్నా సంతోషించలేని మానవులం మనం. మన తెలివితేటలు - మనం సద్వి నియోగపర్చుకోవటమే అరుదు."

గోపాలం ఇంటిముందు ఆగింది కారు.

డ్రాయింగ్ రూంలో కూర్చున్నాక కోతుల్ని గురించిన సమాచారాన్ని ప్రకటించిన పత్రిక చేతుల్లో పెట్టాడు.

అదంతా చదివాక - గోపాలం నాకు బహూకరించిన కోతుల బొమ్మల అంతర్యం అర్థమైంది నాకు!




కొట్టువాడు యిచ్చిన గాజుల పొట్లాన్ని జాగ్రత్తగా పేంటుజేబులో పెట్టుకుని, షాపునుండి బైటపడ్డాడు రామారావు.

సాయంకాలం కావడంవలన వచ్చే పోయే జనంతో బజారు రద్దీగావుంది. రోడ్డు పక్కన పేవ్‌మెంటుమీద నడవసాగాడు రామారావు. అతని మనసు యిప్పుడు ఒకవైపు ఆనందంతోను, యింకొకవైపు ఏదో కోల్పోనట్లు దిగులుతోను నిండివుంది అందుకుగల ప్రధాన కారణం పార్వతి. రాత్రి పడుకోబోయే ముందు "రేపు మన పెళ్ళి రోజండి రేపటితో మనకు పెళ్ళి అయి పాతిక సంవత్సరాలు నిండుతాయి." అంది. అప్పుడే పాతిక సంవత్సరాలు గడిచిపోయాయా అని ఆశ్చర్యం కలిగింది. పార్వతిలాంటి భార్య దొరకడం అదృష్టం. అందుకనే కాబోలు, పాతిక సంవత్సరాలు యిట్టే గడిచిపోయినా, తనకు తెలిసిరాలేదు.' గొణుక్కున్నాడు రామారావు. భార్యను ప్రేమగా గుండెకు హత్తుకున్నాడు పెళ్ళయి యిన్ని సంవత్సరాలయినా పార్వతి తనను ఏమీ కోరలేదు. తను కూడా "ఏం కావాలి?" అని అడగనూలేదు. వచ్చిన జీతం యింటి ఖర్చులకు సరిపోవడమే కష్టమవుతుంది అటువంటప్పుడు భార్యకు ఏంకావాలో ఎలా అడగగలడు? చేతకాని తనం తన నోరు నొక్కేసింది... ఎన్నోసార్లు.

కాని, నిన్నరాత్రి అనాలోచింతగా, తన చేతగానితనాన్ని మరచిపోయి "ఎంకావాలో కోరుకో" అన్నాడు. పార్వతి నవ్వింది.

"మీలాంటి భర్త లభించాక ఏ ఆడదన్నా ఏం కోరుకుంటుంది?" అంది. ఆ మాటలు వెక్కిరింపో, పొగడ్తో అర్థంకాలేదు.

పార్వతిని మరింతగా గుండెలకు హత్తుకుని, ముంగురుల్ని సవరిస్తూ— "అదికాదు పారూ! మనకు వివాహం జరిగి యిన్ని సంవత్సరాలయ్యాయా?! నువ్వు ఎప్పుడన్నా నన్ను ఏదైనా కోరేవా? ప్లీజ్— ఏదైనా కోరుకో. లేకపోతే నాకు బాధగావుంటుంది." అన్నాడు. తన బలవంతంవలన పార్వతి కోరుకుంది.

ఎన్నాళ్ళనుంచి ఆ కోరికను తన గుండెలో భద్రంగా దాచుకుందో! తన వత్తిడివలన మెల్లగా ఆ కోరికను బైటపెట్టింది.

"నాకు... ఒక జత బంగారు గాజులు కావాలండీ" అంది. తను మరేం ఆలోచించకుండా సరే నన్నాడు.

ఉదయం నిద్రనుండి లేచాక, రాత్రి పార్వతి కోరిక, తన వాగ్దానం గుర్తుకు రాగానే గుండెనెవరో పిండినట్లయింది. రాత్రి తనెంత అవివేకంగా ప్రవర్తించాడో అర్థం అయింది. నిద్రపోతున్న పార్వతి మనసులోని కోరికను తనే బలవంతాన తట్టిలేపాడు. ఆ కోరికను తీర్చక తప్పదు. పాతిక సంవత్సరాలు తన కష్ట సుఖాల్ని పంచుకున్న భార్య కోరికను, ఈనాడు వివాహ రజతోత్సవ సమయంలో తీర్చడం తన విధి. కాని, ఎలా? వెయ్యి రూపాయలుంటేగాని బంగారు గాజులజత రాదు. నెలాఖరు రోజులు, పాతిక రూపాయలకన్నా తన దగ్గర ఎక్కువలేవు.

ఆఫీసులో పనిచేస్తున్నాడన్న మాటే గాని, మనసంతా గాజుల గురించే తీవ్రంగా ఆలోచిస్తుంది. సాయంకాలం ఆఫీసు విడిచిపెట్టే సమయానికి ఒక నిర్ణయానికి వచ్చాడు రామారావు.

ఆ నిర్ణయ ఫలితమే ఈ గాజులు! జేబులోని గాజుల్ని జాగ్రత్తగా అదిమి పట్టుకుని యింటివైపు నడుస్తున్నాడు రామారావు. అతని మనసు ఆలోచనలు ఈ గాజుల్ని కొనడానికి ఎంత బాధ పడ్డాడో, తలచుకుంటేనే భయం వేస్తుంది.

గుమ్మంలో తన రాకకు ఎదురు చూస్తూ నిలుచుంది పార్వతి. పార్వతిని అలా గుమ్మంలో చూసేసరికి పాత రోజులు గుర్తుకు వచ్చాయి రామారావుకి. పెళ్ళయిన కొత్తలో తన రాకకోసం ఎదురుచూస్తూ అలా నిలుచుండేది. ఆ తరువాత ఆ అలవాటు తప్పింది. మళ్ళీ యిన్నాళ్ళిద్దికి.

పార్వతి భర్తను చూసి చిన్నగా



నవ్వి యింట్లోకి దారితీసింది. రామారావు కూడా నవ్వక తప్పలేదు.

ఇంట్లోకి వస్తూనే "పిల్లలంతా ఎక్కడ ?'' అడిగాడు.

"పెద్దవాడు యిప్పుడే లైబ్రరీకని చెప్పి వెళ్ళాడు. ఉమ యింకా కాలేజీ నుండి రాలేదు," చెప్పింది పార్వతి.

వంటయింట్లోకి వెళ్ళి స్టీలు ప్లేటులో రెండు స్వీట్లు, ఉప్మా సర్ది, రామారావుకి యిచ్చింది రామారావు ప్లేటును అందుకొని, పక్కనున్న బల్లమీద వుంచాడు.

"పారూ ! రాత్రి నువ్వడిగింది జ్ఞాపకం వుందా ?" భార్య కళ్ళలోకి చూస్తూ ప్రశ్నించాడు.

"బంగారుగాజులు కదూ ! పోనిస్తురూ. మనకి అంత డబ్బు ఎక్కడిది ! పూరిచ కే. మీరు బలవంతం చేస్తే అలా అడిగాను," అంది ఆ విషయాన్ని తేలిగ్గా కొట్టిపారేస్తూ.

"పారూ ! నీ కోరిక తీర్చలేని అసమర్థుడిని కదూ !" కళ్ళల్లో రామారావుకు నీరు తిరిగింది.

"ఛ అలా ఎవరన్నారు ?'' భర్త మాటలకు నొచ్చుకుంటూ అంది.

రామారావు భారంగా నిట్టూర్చాడు.

''ఇదిగో, నువ్వడిగిన గాజులు." జేబులోనుంచి పొట్లాన్ని తీసి భార్యకిచ్చాడు

పార్వతి ఆశ్చర్యంగా భర్తను చూసి గబగబా పొట్లాం విప్పింది పచ్చగా, మెరుస్తూ గాజులు ! తన కళ్ళను తనే నమ్మలేకపోయింది.

"ఏమండీ! ఇంత డబ్బు ఎక్కడిది!" ఆశ్చర్యంనుండి తేరుకున్న తరువాత,

భర్తను అనుమానంగా చూస్తూ ప్రశ్నించింది.

జవాబు చెప్పలేదు రామారావు. దోషిలా తల వంచుకున్నాడు.

"లంచం పుచ్చుకున్నారా?" భయం భయంగా అడిగింది, భర్త స్వభావం బాగా తెలిసివున్నా.

"ఇంకా, అంతకు తెగించలేదు పారూ!" అన్నాడు బాధగా. తన మాటల వలన భర్త మనసు గాయ పడిందని గ్రహించింది పార్వతి. ప్రేమగా భర్త తల నిమురుతూ "మీ సంగతి నాకు తెలుసండి. ఈ గాజులు చూసేసరికి మతిపోయి, అలా అడిగాను" అంది పార్వతి.

"గాజులు బాగున్నాయా?" అడి గాడు రామారావు, ప్లేటును దగ్గరకు తీసుకుని,

"చాలా బాగున్నాయండీ ఇంతకీ, ఈ గాజులకీ... డబ్బెక్కడిది?"

పార్వతి ప్రశ్న రామారావుకు గోరు చుట్టుమీద రోకలిపోటులా తగిలింది.

"అప్పు చేశాను పారూ!" మెల్లగా జవాబిచ్చాడు.

'ఇంత డబ్బు ఎందుకు అప్పు చేశారండి!" అంది పార్వతి గాజుల్ని ఆపేక్షగా చూస్తూ.

"ఇప్పుడా గొడవంతా ఎందుకు పారూ! ఈ రోజు మన వివాహ రజతో త్సవ దినం. సంతోషంగా వుండాలి. త్వరగా నువ్వు తయారవు. సినిమాకి వెళ్దాం" అన్నాడు.

"అలాగేనండి. ఇంతకీ, ఈ గాజుల్ని ఎంతకు కొన్నారు?" గాజులు పరీక్షగా చూస్తూ అడిగింది.

"పారూ! ప్లీజ్... ముందు నువ్వు ముస్తాబవు," విసుగా మొహంపెట్టాడు రామారావు.

* * *

రాత్రి పది గంటలయింది.

పిల్లలందరూ ముందు గదిలో నిద్ర పోయారు. వంటయిల్లు సర్ది, భర్త గదిలోకి వచ్చింది పార్వతి.

మంచంమీద పడుకుని వున్న రామా రావు తలతిప్పి పార్వతివైపు చూశాడు.

తడిచేతుల్ని చీర కొంగుతో తుడుచు కుంటూ వచ్చి రామారావు పడుకున్న మంచంమీద కూర్చుంది.

"పారూ! ఒక నిజం చెబుతాను. కోపం తెచ్చుకోవు కదూ?" సంశయంగా అడిగాడు.

"నిజం చెబితే కోపం ఎందుకండి?" అంది.

రామారావుకు నిజం చెప్పడానికి ధైర్యం చాలడంలేదు. ఒకవైపు అర్ధాం గికి నిజం చెప్పకుండా మోసం చెయ్యడం తప్పు అని మనసు హెచ్చ రిస్తుంది.

జారిపోతున్న ధైర్యాన్ని జాగ్రత్తగా కూడదీసుకున్నాడు.

"పారూ! నిన్ను... మోసం చేశాననుకో, అప్పుడు నన్ను అసహ్యించుకోవు కదూ?" గొంతు వణికింది.

"ఛ. అవేం మాటలండీ. మీరు నన్ను మోసంచెయ్యడమేమిటి?" అమాయకంగా భర్తను చూస్తూ అంది.

"అవును పారూ! నిన్ను మోసం చేశాను. నువు బంగారు గాజులు తెమ్మని అడిగితే, ఆ గాజుల్ని కొనే స్తోమత లేక గోల్డుకవరింగ్ గాజులు తీసుకువచ్చాను. ఆ గాజుల్ని బంగారు గాజులని చెప్పి నీకు యిచ్చాను. నన్ను క్షమిస్తావు గదూ?" దుఃఖం వలన రామారావుకు గొంతు బొంగురుపోయింది.

"అదేమిటండీ... ఈమాత్రం దానికే బాధపడాలా? నాకు మొదటే తెలుసు మీరు తెచ్చినవి గోల్డు కవరింగు గాజులని" అంది

రామారావుకు పార్వతి మాటలు ఆశ్చర్యాన్ని కలిగించాయి.

"ముందే తెలుసా? ఎలా??"

"మీరు తెచ్చిన గాజులు చాలా తేలిగ్గా వున్నాయండి. అంతేకాదు, మన ఎదురింటి పిన్నిగారికి చూపిస్తే యివేం బంగారు గాజులు! గోల్డు కవరింగువి," "అంది ఆవిడకు యిటువంటి విషయాలు బాగా తెలుసు" అంది.

బాధగా పార్వతిని చూశాడు.

"మరి, నన్ను వెంటనే అడగలేదేం?'' ప్రశ్నించాడు తనవలన పక్కింటావిడ దగ్గర పార్వతికి తలవంపు జరిగిందనే విషయం రామారావుకు భరించశక్యం గాకుండా వుంది.

''అడగాలనే అనుకున్నాను. కాని, మీరు బాధపడతారని అడగలేదు."

పార్వతి మాటలకు రామారావుకు దుఃఖం ఆగిందికాదు.

"నువ్వు భార్యగా దొరకటం నా అదృష్టం పారూ! నీకు...నీకు మోసం చేశాను. వట్టి యిడియట్‌ని చేతగాని వాడ్ని..." పిచ్చిగా జుత్తు పీక్కున్నాడు- రామారావు! పార్వతి అతన్ని వారిస్తూ

"అలా మాట్లడకండి. అసలు నాదే పొరపాటు అంత పెద్ద కోరిక కోరకుండా వుండవల్సింది నన్ను క్షమించండి" అంది

''నీ మంచితనంతో నన్నింకా పిచ్చివాడ్ని చెయ్యకు పారూ! ప్లీజ్" అసహనంగా అన్నాడు. పార్వతిని గుండెకు హత్తుకుని ముద్దులవర్షం కురిపించాడు.

...నేనదృష్టవంతుడ్ని... మరోసారి మనసులో అనుకున్నాడు రామారావు.

——



# చక్రపాణి

కావిలిపాటి విజయలక్ష్మి

(గత సంచిక తరువాయి)

అతను అంచనా ప్రకారం ప్రక్క దగ్గరకు నడిచి మంచంమీద కూర్చున్నాడు.

"వక్కపొడి," అంది పద్మావతి.

అతను చెయ్యి ముందుకు చాపాడు.

అతని చేతిలో వక్కపొడి వేసింది పద్మావతి.

అతను వక్కపొడి నములుతూ వెనక్కి వాలాడు.

"ఉండండి. దిండు ..." అంటూ అతని తలకింద చెయ్యుంచి, దిండు సరి జేసింది పద్మావతి.

ఆమెను ఏమేమో అడగాలని మనస్సాత్రతపడుతూన్నా, ఇవ్వాళ కాదు అనుకుని వత్తిగిలిపడుకున్నాడు పాణి.

అతనేమన్నా మాట్లాడతాడని ఆశించిన పద్మావతి, బరువుగా నిట్టూర్చి టేబిలువైపు నడిచింది.

రాత్రి ఒంటిగంట ప్రాంతాన మెల కువ వచ్చింది పాణికి. ఎవరో మనిషి గదిలో ఉన్న అలికిడి. కాయితాలు తిర గేస్తూన్న చప్పుడు. అతని గుండె భయంతో క్షణం కొట్టుకోవడం మానేసి తర్వాత తీవ్రంగా కొట్టుకోవడం ప్రారం భించింది. కొన్ని క్షణాల్లో ధైర్యాన్ని చిక్కబట్టి లేచి కూచుంటూ. "ఎవరు గదిలో!" అన్నాడు గట్టిగా.

చిన్న శబ్దమయ్యేలా నవ్వి. "నేను పద్మావతిని. దొంగ కాదులెండి. నిద్ర పోండి" అంది పద్మావతి.

"చంపావ్. ఇంతరాత్రివరకూ ఈ గదిలో ఏంచేస్తున్నావ్ ? నిద్ర పోలేదూ ?" అడిగాడు.

"ఎకౌంట్సు చూడాలనీ..."

"రేపు చూడొచ్చు. నిద్రపో. చాలా రాత్రయినట్టుంది. ఆరోగ్యం దెబ్బ తింటుంది."

"అయిపోయింది లెండి."

అతను మళ్ళీ వెనక్కు వాలి పడు కున్నాడు.

మరొక పదినిమిషాల తర్వాత పుస్త కాలు కట్టేసి అతని మంచం దగ్గరగా వచ్చింది 'అతని పక్కలో చోటుచేసు కోవాలనీ, అతని పాలాన్నీ, వక్షాన్నీ తాకాలనీ, ప్రయత్నించింది. కాని సంకోచంతో, బిడియంతో అలా చెయ్య లేకపోయింది తనకోసం తన ఆరోగ్యం కోసం కలవరపడే వ్యక్తివైపు ఆప్యా యంగా ప్రేమగా చూసింది. తర్వాత తన గదిలోకి వెళిపోయింది పద్మావతి.

* * *

మర్నాటి ఉదయం పాణి స్నానం చేసి బట్టలు వేసుకొని తలదువ్వు కుంటూంటే అతని గదిలోకి వచ్చింది పద్మావతి.

అతను తల అటూ ఇటూ దువ్వు కుంటూ పాపిడి తిన్నగా రావాలని అవస్థ పడుతున్నాడు.

"ఏదీ దువ్వెన ఇలా ఇవ్వండి !" అంటూ అతని చేతిలోని దువ్వెన తీసు కుంది పద్మావతి.

అతని క్రాపు సరిగా దువ్వి. అతని ముఖాన్న వత్తుగా ఉన్న పౌడరు చీర చెంగుతో అద్దుతూ, "మీ శశి ఉత్తరం వ్రాసిందట ?" అడిగింది పద్మావతి.

అతని కామె అలా తన గెడ్డంకింద చెయ్యుంచి ముఖంపైకెత్తి, తలదువ్వు తూంటే, ఆమెను చేతుల్తో చుట్టెయ్యా లనిపించింది. ఆమె మెత్తని బట్టతో ముఖంమీద పౌడరు అద్దుతూంటే, ఏవేవో మధురమైన కోరికల్తో అతని నరాల్లో విద్యుత్ ప్రవహించసాగింది. కాని 'తనకై తాను ఆమె తమ దాంపత్య జీవితానికి అనుమతించేవరకూ, ఆమెను తాకకూడదు.' అనుకున్న పాణి చలించే మనస్సునూ, అదుపు తప్పే శరీరాన్నీ ఆధీనంలో ఉంచుకొని,

"మా శశి ? శశి ని కెమి కాదా ?" నవ్వుతూ అడిగాడు.

"క్షమించండి. అలవాటుగా అనే శాను. ఆమె ఎప్పుడు వస్తుంది ? ఆమెను చూడాలని నాకు ఆత్రతగా ఉంది."

"అమెరికానుంచి వచ్చేశారు. అత్త వారింట్లో ఉంది. ఆడబిడ్డ పెళ్ళి ఉందట. అయాక వస్తుందట."

"ప్చ్. ఒక్కసారి వచ్చి మళ్ళీ వెళ్తే బాగుండును. అలా జాబు వ్రాయక పోయారా ?"

"అలానే అత్తయ్య వ్రాసింది. శశి వ్రాసిన ఉత్తరం డ్రాయిర్లో ఉంది చదువు. ."

ఉత్తరం తీసి చదివి మళ్ళీ పెట్టేస్తూ "డ్రయివరుకి, అదే మన పచ్చబస్సు డ్రయివరుకి ఎంత డబ్బిచ్చారు ఈ నెలలో ?" అడిగింది పద్మావతి.

కుర్చీలో చేరబడి కూర్చుని నవ్వుతూ, "ఏం ? రెండువందల యేభై అనుకుంటాను."

"ఒక నెలలో ఎన్ని కొత్త టైర్లు వేయించాడు ? అయినా పెట్రోలు ఎంత కాలిందని వ్రాశాడో ఓసారి కనుక్కు న్నారా ? నన్ను అడిగి అతనికి డబ్బిస్తే ఏం పోయింది "

అదోలా నవ్వి, "హమ్మయ్య" అని "ఏదీ ! మనమధ్య తగు వచ్చాక నీతో మాట్లాడాలంటే నీ ఛాయలకురావాలంటే నాకు చచ్చే భయంగా ఉండేది కదూ ! అస్సలు మనస్సేమీ బాగుండేదికాదు. పోతే పోనియ్ డబ్బు అని అందరికీ అడిగినంతా ఇచ్చేశాను."

"మంచిపని చేశారు లెండి."

"నువ్వు ఎవరితోనూ తగువులు తెచ్చుకోకు పద్మావతీ ! మోసంతో, ఒక స్వార్థంతో, ఏర్పడిన మనమధ్య బంధాన్ని తెంచుకొని వెళ్ళిపోయి సుఖ పడు పద్మావతీ ."

ఆ విధి ఎందుకు వేసిందో ఈ బంధం. "మీరు వెళ్ళిపోమని పదే పది సార్లు అన్నంతమాత్రాన తెంచుకో మన్నంతమాత్రాన కొన్ని బంధాలు అందరూ తెంచుకోలేరు. వెళ్ళిపోలేరు." ఆమె గొంతు వణికింది. అదిరే పెద వులతో, రోషంతో ముఖం ఎర్రవారగా అతనివైపు చురుగ్గా చూసింది పద్మావతి.

నవ్వాడు పాణి. "ఎందుకు తెంచుకు వెళ్ళిపోలేరు ?" అంటూ.

"ఎందుకా ! నే నీ భారతదేశంలో సాంప్రదాయమైన కుటుంబంలో పుట్టడంవలన. ఆ సాంప్రదాయంమీద గౌరవం ఉండటంవలన. స్త్రీకి భర్త ఒక్కడే, అనే నిబంధన మీద విశ్వాసంవలన. ఈ ముంగాళ్ళ బంధాన్ని తెంపేసుకుని వెళ్ళిపోయి మళ్ళీ పెళ్ళిచేసుకొని, మరో మగాడికి భార్య నయ్యే గుండెధైర్యం, నిబ్బరం, తెగువా లేక. సరా ! ప్లీజ్ చక్రపాణిగారూ !

మరోసారి దయచేసి నన్నీ ఇంట్లోంచి వెళ్ళిపొమ్మని అనకండి. మీ ఆస్తి పాస్తులేం నాకు అఖ్ఖరలేదు. కావాలంటే మరొక అమ్మాయిని పెళ్ళిచేసుకొని మీరే సుఖపడండి. అంతేకాని ..." ఆమె గొంతు మూగబోయింది. ఆవేశంతో దుఃఖంతో.

ఆమె ఏడుస్తూందని గ్రహించాడు పాణి

"ఆవేశపడకు పద్మావతీ "అని పాణి అనేంతలో వణికే గొంతులో ఇలాటి మాటలతో నన్ను చిత్రవధ చేసేకన్నా ఒక్కసారి చంపెయ్యరాదూ !" అంది పద్మావతి.

"భగవంతునిమీద ప్రమాణంచేసి చెబుతున్నాను పద్మావతీ ! భవిష్యత్ గురించి నిర్ణయం నీకే వదిలిపెడు తున్నాను. వ్యాపార విషయాలు నువ్వు దగ్గరున్నప్పుడే మాట్లాడతాను. అనవసరంగా అలా నువ్వు బాధపడి బేలగా ఏడిస్తే నేను సహించలేను. ఇప్పటికే నా మనస్సు ఆస్స లీవిషయం ఎందుకు బయటపెట్టానా ! అని పశ్చాత్తాపంతో కృంగిపోతూంది. నన్ను నేనే తిట్టు కుంటున్నాను", అన్నాడు.

"అస్సలు ఇంతకాలం ఈ నిజం దాచటంలో చెప్పకూడదనుకోవడంలో మీ ఉద్దేశ్యం నేనెలాటిదానో్న ! అని పరీక్షించాలనే కదూ! మరి పశ్చాత్తాపం, తిట్టుకోవడం ఎందుకు ?"

"నిన్ను పరీక్షించాలని కాదు పద్మావతీ ! నీ భర్త అంధుడు కాదనుకునే నీ బంగారు ఊహ చెరిపెయ్యడం ఇష్టం కాక. ఈ కఠినమైన నిజాన్ని నీముందర ఉంచి నిన్ను శిక్షించటం న్యాయం కాదేమో ! అని."

అన్నపూర్ణమ్మ అక్కడికి రావటంతో ఆ సంభాషణ ఆగిపోయింది.

''ఏదో వాదనలో దిగినట్టున్నారు. "అమ్మాయ్ ఇవాళ టిఫిను తింటారా లేదా ?" అడిగింది అన్నపూర్ణమ్మ విసుగ్గా.

మౌనంగా వంట ఇంట్లోకి వెళ్ళి టిఫిను ప్లేటుతెచ్చి పాణి చేతిలో ఉంచింది పద్మావతి.

"ఏమిటమ్మా ! ఆ కోపం ? టిఫి నేమిటో చెప్పకుండా, మాట్లాడకుండా, అలా వాడి చేతికిచ్చేశావ్ ?" అంది నవ్వుతూ అన్నపూర్ణమ్మ.

"ఎవరిమీద కోపం. భగవంతుడి మీద," అంటూ అక్కడనుంచి వెళి పోయింది పద్మావతి

ఆమె వెళిపోయిందని గ్రహించిన పాణి. "ప్పే మళ్ళీ ఆరోగ్యం పాడు చేసుకుంటుండిలా ఉంది చూస్తుంటే. తనను కూడా టిఫిను తీసుకోమని చెప్పత్తయ్యా !" అన్నాడు పాణి

"కావాలంటే తానే తీసుకు తింటుం దిలే. కాని శశేమిత్రా అలా వ్రాసింది. ఓసారి చూసి మళ్ళీ వెళ్ళరాదూ !"

"తనిష్టమే కానియ్ అత్తయ్యా. ఆడ పిల్ల అత్తవారింటి కెళ్ళాక అంతే. క్రమంగా మనని దూరంచేసు కుంటుంది."

"దూరమవడం ఎలా కుదురుతుంది. ఈసారి అతనవస్తే వెళ్ళనివ్వవద్దు. వెధవలు వ్యాపారంలో మోసం చేస్తు న్నారు ఉద్యోగం వద్దు పాడూ వద్దు. రమేష్‌ని మన వ్యవహారాలు చూస్తూ మనింట్లోనే ఉండిపొమ్మందాం "

"అతను సమ్మతించవద్దూ !" నవ్వాడు.

"సమ్మతించకపోవటానికి మనం అతన్ని అగౌరవంగా చూస్తామా ! పరాయివాళ్ళు తినే లాభాలు మనవాళ్ళు తినడం నయంకదూ !"

"నిజమే నీ ఆలోచన బాగుంది. కాని అతను "మీ దగ్గర గుమస్తాలా పడి ఉంటానా ?'' అంటే ఏమంటాం చెప్పు ? సర్లే. వాళ్ళు రానియ్ ముందు శశితో మాట్లాడి తర్వాత అతనికి చెప్పవచ్చు. నీ ఆరోగ్యమెలా ఉంది ? డాక్టర్ని ఇంక ఇంటికి రానక్ఖర్లేదన్నావట ?"

"బాగానే ఉందిలే "

"అస్సలు నీ ఆరోగ్యం సంగతి పట్టించుకోవడం మానేశావులా ఉంది", అన్నాడు పాణి నవ్వుతూ.

"నిజమేరా బాబూ ! నా ఆరోగ్యం గురించి అస్సలు ఆలోచించడమే మానే శాను " అంది అన్నపూర్ణమ్మ తానూ నవ్వుతూ.

"మరి దేనిగురించి ఆలోచిస్తూం టావు అత్తయ్యా !"

"నువ్వూ నీ భార్యా ఎప్పుడు రాజీకి వస్తారా !" అని

"ఇంకేముంది ? రాజీకి వచ్చేసినట్లే. నిన్న సినిమా కెళ్ళాం. రాత్రి ఎక్కౌంటు పుస్తకాలు చెక్ చేసి ఎవరికో డబ్బు ఎక్కువ ఇచ్చేశానని మునపటికన్నా చనువుగా, స్వతంత్రంగా చీవాట్లేస్తూం దిప్పుడు "

"మాటలు మార్చకురా పాణీ ! ఆ అమ్మాయిని ఇంట్లోంచి వెళ్ళిపొమ్మనీ, పెళ్ళిచేసుకొని హాయిగా జీవించమనీ, నువ్వు అనడంలా. తప్పుకదూ ! అలా అనవచ్చా ? ఈ గడ్డమీద సాంప్రదాయ మైన కుటుంబంలో పుట్టిన ఆడపిల్ల, కట్టుకున్నవా డిలాటి మాటలంటూంటే సహించగలదా ?"

"నేను నిజంగా మనస్ఫూర్తిగా అన్నానత్తయ్యా ! ఆ మాట ఈ గుడ్డి వాడితో ఆమెకు జీవితం దుర్లభం కదూ !"

"ఏదో తానే నిర్ణయించుకోవాలి. నువ్వేం అలాటి మాటలనకు పాపం, నువ్వేరోజు ఈ సంగతి బయటపెట్టావో ఆనాటినుంచీ ఆ అమ్మాయి సరిగా అన్నం తినటంలేదు "

"నేనూ ఇటుపైన ఏమీ చెప్పకూడదనే నిర్ణయానికి వచ్చా నత్తయ్యా "

"ప్చ్. వయసులో ఉన్న పిల్లలు, చిలకా గోరింకల్లా కలసి సుఖంగా బ్రతకాల్సింది ఖర్మ "

అతను మౌనంగా తలవంచాడు. అతని వదనం విషాదంగా మారిపోయింది.

మరొక్క రెండునిమిషాలు కూర్చుని పాణికి మంచినీళ్ళిచ్చి అతను తిన్న టిఫిను ప్లేటు తీసుకొని వెళిపోయింది అన్నపూర్ణమ్మ.

ఏవేవో ఆలోచనలు ముసురుకోగా గుప్పిటలో జుట్టుపీక్కుంటూ చాలాసేపు అలా కూర్చున్నాడు పాణి.

మధ్యాహ్నం భోజనమై పాణి తన గదిలోకి వెళ్తూంటే అతని వెనుకే వెళ్ళింది పద్మావతి.

ఆమె తన వెనుక వస్తూన్నట్టు గ్రహించిన పాణి, "నువ్వు సరిగ్గా భోజనం చెయ్యటంలేదట ఆరోగ్యం పాడుచేసుకుంటావా ?" అన్నాడు మంచంమీద కూచుంటూ

"ప్చ్. ఆవిడ అపోహ. కడుపు నిండా అన్నం తినక నాకేమయింది ఇప్పుడు ? ఏదీ నోరు తెరవండి ?"

"ఏమిటది ?"

"తాంబూలం."

ఆమె ప్రవర్తన కొత్తగా ఉంది అయినా తనకు తాంబూలం అలవాటు లేదు. ఒకవేళ వేసుకుంటే, తిక్కగా ఉంటుంది. అదే అన్నాడు. "వద్దు. నాకు అలవాటులేదు అని "

"అబద్ధం... మీకు... ఇలానేని వ్వటం ఇష్టం కాక "

"కాదు పద్మావతీ నిజం. నాకు గొంతు పట్టేసినట్టవుతుంది వక్కపొడి ఇయ్యి... అంతే కాని "

"చెయ్యి చాపండి "

'నోటికే ఇయ్యరాదూ ! అనిపించినా, చెయ్యిచాపాడు అతని చేతిలో వక్కపొడి వేసి మౌనంగా తన గదిలోకి వెళిపోయింది పద్మావతి. మళ్ళీ ఆలోచించసాగింది 'ఇతనికి తన ఇష్టాన్ని ఎలా తెలియచెయ్యాలి ?' అని

ఆరాత్రి అతని గదిలో పాలగ్లాసుతో ప్రవేశించింది చూసిన అన్నపూర్ణమ్మ ముసిముసిగా నవ్వుకుంది

"ఇదిగో పాలు తీసుకుంటారా ?" అతని మంచం దగ్గరలో నిల్చుని అడిగింది. ఆ గ్లాసుతోపాటూ తనను దగ్గరకు లాక్కుంటాడనీ, ఇంకేవేవో ఊహాలతో, బిడియంగా, మత్తుగా, అతని వైపు బరువుగా కళ్ళెత్తి చూసింది

అతను లేచి మంచంమీద మఠం వేసుకు కూర్చుంటూ, "ఆప్యాయంగా, అనురాగంతో ఇవ్వబోయేవన్నీ. కాదన టానికి విచారిస్తున్నాను పద్మావతీ ! నాకు పాలు పడవు. కఫం చేసి నానా హైరానా పడిపోతాను నువ్వు

తాగెయ్ నీకు అంతగా నాకేదన్నా నీ ఇష్టమొచ్చినట్టూ ఇవ్వాలనుంటే టేబిలు మీద ద్రాక్షపళ్ళున్నాయి" అన్నాడు. ఆమె ద్రాక్ష పళ్ళు తెచ్చి నోటికందిస్తుందనీ, అప్పుడు ఆమెను దగ్గరగా లాక్కోవాలనీ, అతని తపన

కాని, "నా కేం అంతగా ఇవ్వాలని లేదులెండి హాయిగా నిద్రపోండి" అని చప్పున వెనుదిరిగి వెళిపోయింది పద్మావతి.

మంచంమీద వాలిపోయిన పద్మావతి కనుకొలుకుల్లో నీరూరింది గుడ్డివాడనే బాధ, విస్మరించి అతన్నే భార్యగా అనుసరించాలని ప్రయత్నించిపరాజయం పొందింది ఎంత ఘటికులు చక్రపాణి గారు? "నువ్వు ఆప్యాయంగా, అనురాగంతో ఇవ్వబోయేవన్నీ కాదనటానికి విచారిస్తున్నాను, పద్మావతీ!" అంటే తనను గ్రహించి. అన్నమాటే కదూ. ఛీ! ఛీ! తనకెంత సిగ్గులేదు? ఉదయం అతన్ని తాకి క్రాపు దువ్వింది. ముఖం చీరచెంగుతో అద్దింది. మధ్యాహ్నం తాంబూలం నోటికి అందివ్వబోయింది. రాత్రి పాలగ్లాసుతో అతని గదికివెళ్ళింది తన మనసు అర్థంచేసుకుని సున్నితంగా హృదయానికి సూటిగా తగిలేలా మందలించారు. అతనిచేత తాళి కట్టించుకొన్నా తాను అతని భార్యగా ప్రకటించుకొని, ఏనాడో వదిలిన మాంగల్యం మళ్ళీ ధరించినా, తను అతని భార్యగా స్థానం సంపాదించుకోలేదు అతనికి తనపై ఉండేది కేవలం జాలి, దయ, సానుభూతి. ఇంకా తనని ఎలా అన్నా వదించుకోవాలనే తహ తహ ఎందుకు రప్పించానా అనే విచారం. కానీ, అతని మనస్సేమిటో నేనూ తెలుసుకోవాలి. అస్సలు ఈ ఇంటినీ ఇతన్నీ వదిలి నేనెందుకు వెళ్ళిపోవాలి? నేనేం నేరం చేశాను?" ఇలాటి ఆలోచనలతో చాలా రాత్రివరకూ నిద్రపోలేదు పద్మావతి

"ప్చ్ పొరపాటు చేశాను. పాలు కొంచెం తాగి ఆమెను తాగెయ్యమని ఇచ్చేస్తూ, ఆమెను దగ్గరకు తీసుకోవలసింది. చేతుల్లో ఒదిగిపోయేదో, విదలించుకొనేదో, నేనంటే ఆమెకు ఇష్టమో కాదో, తెలిసిపోయేది. ఇష్టమో లేక ఇష్టం చేసుకోవాలనే ప్రయత్నమో. ఇవ్వాళ పద్మావతి తనకు చాలా దగ్గరగా వచ్చింది బలవంతాన మనస్సుని లొంగదీసుకుంటుందో! లేక నేనంటే ఆమెకు అనురాగం, ప్రేమా ఉన్నాయో నా మోహం. గుడ్డివాడంటేనే సాధారణంగా అసహ్యపడతారు. అలా ఏది ప్రేమా, అనురాగం అనే పదాలకే తావెక్కడుంది? అస్సలామెకు అలాటివే వన్నా ఉంటే తాను తన భర్తనని తెలుసుకొని ఎందుకంత కుమిలిపోతుంది? ఏడుస్తుంది? సంతోషించేది. ఆ రోజే తనకు దగ్గరయ్యేది ఆమెకు తనమీద ఉండేవి, జాలి, సానుభూతి. ఇంకా

తనకు ఆశ్రయ మిచ్చాననే కృతజ్ఞత, అంతే అయివుంటుంది! ఇలా ఎటూ తెగని ఆలోచనలతో చాలా రాత్రివరకూ పాణి నిద్రపోలేదు.

*   *   *

"మనం శశికి ఇచ్చిన ఆస్తంతా ఆ దరిద్రుడు అమ్మేశాడట." అంది అన్నపూర్ణమ్మ, రుద్ధస్వరంతో, పాణి చేతికి మంచినీళ్ళ గ్లాసిస్తూ.

"నీ కెలా తెలిసింది? అస్సలు అమ్మవలసిన అవసరం ఏమొచ్చింది?" నమ్మలేనట్టు ముఖంపెట్టి ఆశ్చర్యంగా అడిగాడు పాణి.

ఇదిగో వెంకట్రామయ్యగారు ఉత్తరం వ్రాశారు "ఈ మధ్య శశి అత్తవారి ఊరు వెళ్ళటం తటస్థించింది. రమేష్ శశికి మీరు పసుపు కుంకుమల క్రింద ఇచ్చిన ఆస్తంతా వచ్చిన ధరకి అమ్మేశాడని తెలిసి చాలావిచారించాను. పాణీ, పద్మావతీ మీరూ క్షేమమని భావిస్తాను. ఇంతే సంగతులు. వెంకట్రామయ్య" గబ గబా చదివింది అన్నపూర్ణమ్మ.

"ఈ భోగట్టా సేకరించడానికే ఆయన ఆ ఊరు వెళ్లారులా ఉంది. శశి ఉత్తరంలో మాట మాత్రమైనా డబ్బు ప్రసక్తి రాయలేదే! కావాలంటే ఆ డబ్బు మనమే ఇచ్చేవారంగా! నాన్నగారు ఎంతో అభిమానంతో దానికిచ్చినవి అవి. పోన్లే అత్తయ్యా, విచారించకు. శశికి ఆ ఆస్తిపోయినంత మాత్రాన లోటేమీ రాదు. మన ఆస్తి మాత్రం దానిదికాదూ!"

"పిచ్చివాడివి నీకు పిల్లా, జెల్లా పుట్టరూ? నీ భార్య ఊరుకుంటుందా!"

"నాకు పిల్లా...జెల్లా..."అనినవ్వి "సర్లే దాని గురించి అంతగా ఆలోచించి మనస్సు పాడుచేసుకోకు ఏదో కొంప మునిగే అవసరం వస్తే కాని బావ అలాటి పని చెయ్యడు" అన్నాడు కాని అతని మనస్సులోనూ అలజడి రేగింది రమేష్ ఏదన్నా వ్యసనాలకి అలవాటుపడ్డాడా? తన చెల్లెలు జీవితం ఎలా నడుస్తుంది? అని ఆమె తొందరగా రావాలని ఆత్రత పడింది అతని మనస్సు.

నాలుగు క్షణాల తర్వాత "అత్తయ్యా!" "పిలాచాడు పాణి "ఎందుకుబాబూ" అంటూ వచ్చిందామె

"శశిని తొందరగా రమ్మని ఒక ఉత్తరం వ్రాయి, నేను వ్రాసినట్టుగా" అన్నాడు

"ఇప్పటట్రా. ఉండు అవతల పనుంది "

"పోనీ మన సెక్రటరీని పిలువు."

"అదెవరు ? మరెవరన్నా కొత్తగా వచ్చారా ఈ ఉద్యోగానికి."

"ఇంకెవరు ? నీ కూతురు పద్మావతి. పిలువు "

"తనకెందుకీ విషయాలన్నీ చెప్పడం ?"

"వెంకట్రామయ్యగారికన్నా పయిదా!"

"సర్లె చెబుతానుండు." అని వెళ్ళి పద్మావతితో పాణి పిలుస్తున్నాడని చెప్పండి అన్నపూర్ణమ్మ.

"ఏమిటి! ఎందుకు! ఎవరికి?" అని ప్రశ్నించలేదు పద్మావతి. అతను వ్రాయమన్నట్టుగా ఉత్తరం వ్రాసి అడ్రసు వ్రాసింది.

తనతో ఎవరు వ్యాపార విషయాలు మాట్లాడాలని వచ్చినా విధిగా పద్మావతిని పిలుస్తున్నాడు పాణి ఆమె వారితో మాట్లాడుతుంది అతను శ్రోతగానే ఉండి పోతున్నాడు, వచ్చినవారు వెళిపోయిన తర్వాత. "మీ అభిప్రాయం ఏమిటి? నేనేమన్నా పొరపాటుగా మాట్లాడానా?" అడుగుతుంది పద్మావతి. "లేదు చాలా తెలివిగా మాట్లాడావు" అంటాడు పాణి.

ఒక్కోసారి అతనికి టిఫినూ కాఫీ భోజనం స్వయంగా పెడుతూంది పద్మావతి. కాని వారిద్దరి మధ్యా అత్యవసరమైన పొడి మాటలే దొర్లుతున్నాయి. ఇదివరకటిలా పద్మావతి నవ్వుతూ, కొంటెగా చిలిపిగా మాట్లాడుతే బాగుండుననీ, ఆమెతో సినిమాకూ షికార్లకూ వెళ్ళాలనీ, ఈ బరువై పోతూన్న కాలం తేలిగ్గా దొర్లిపోవాలనీ, ఆరాటపడుతున్నాడు పాణి. కాని పద్మావతితో మునపటి చెలాకీతనం స్థానేగాంభీర్యం నిండుతనం ముఖావం రావడంతో అతని కోరిక లేమీ నెరవేరటంలేదు

ఏదన్నా పుస్తకం చదివి విని పిస్తావా? అంటాడతను ఆమె పారం వప్పగించినట్టు చదువుకుపోతుంది. సగంలో "వద్దు మూసెయ్. తల నెప్పిగా ఉంది" అంటాడు తోటకు షికారు వెళ్ళి ఎంతకాలమైందో! అస్సలా తోట ఎలా ఉందో పూల మొక్కలేమైపోతున్నాయో! కారు ఎన్నాళ్ళయి షెడ్‌లో నిద్రపోయిందో ఇద్దరూ పట్టించుకోవడంలేదు 'నీ భర్త నని చెప్పిన అతను. తన అంగీకారం. ఉద్దేశ్యం గ్రహించి కూడా తన నెందుకు దూరంగా ఉంచాలి? అతని ఉద్దేశ్య మేమిటస్సలు? తాను మాంగళ్యం మెడలో కట్టుకున్న రోజునే అప్పారావుతో చెప్పింది 'అప్పారావ్' నేను పాణిగారి భార్యనని నీకు తెలిసిందిగా మా మామగారే చిన్నప్పుడు మా ఇద్దరికీ పెళ్ళిచేశారు. అందరికీ ఈ సంగతి చెప్పెయ్! అని అతనలానే అందరికీ చెప్పాడులా ఉంది. కొంచెం రోజులు అందరూ తనవైపు అదోలా చూసేవారు. ఒకసారి పనిమనిషీ అప్పారావూ గుసగుసలాడటం తను వింది తాను బాత్ రూంలో ఉన్నట్టు వాళ్ళకి తెలియదు. "అప్పారావూ. అమ్మాగారూ అయ్యాగోరూ. ఓటయ్యారంటావా!" అడుగుతూంది అరవై యేళ్ళ అప్పలమ్మ.

"నేదులా ఉంది పడకలు ఏరే," అంటున్నాడు అప్పారావు, తానిలా మౌనంగా సౌమ్యంగా ఉంటే జీవిత మంతా ఇలానే దొర్లిపోతుంది. అయన్ని రెచ్చగొట్టాలి కోపం తెప్పించాలి. అప్పుడెలా ప్రవర్తిస్తారో చూడాలి అను కుంది పద్మావతి.

"పిన్నీ మార్నింగ్ షో సినిమాకు వెళుతున్నాను" అని చెప్పి వెళిపోయింది పద్మావతి

పాణి కూడా వెళ్ళి ఉంటాడనుకొన్న అన్నపూర్ణమ్మ. పదకొండు గంటలయ్యే సరికి డైనింగ్‌రూంలో కొచ్చి టేబిలు ముందు కూర్చున్న పాణివైపు ఆశ్చ ర్యంగా చూస్తూ "నువ్వు సినిమాకు వెళ్ళలేదూ!" అడిగింది బుగ్గలు నొక్కుకుంటూ

"ఎవరు వెళ్ళారు?" అప్రయత్నంగా ప్రశ్నించాడా పాణి

"పద్మావతి వెళ్ళిందే! అయితే నీకు తెలియదా"

ఒక్కసారి గతుక్కుమన్నాడు పాణిని తనను పిలవకుండా కనీసం వెళ్తున్నానని చెప్పకుండా, సినిమాకు వెళిపోయిన పద్మావతి ఉద్దేశ్యం అతనికి అర్థంకాలేను తనను పిలవకుండా ఆమె సినిమాకు వెళిపోవడం అతనికి ఎంతో బాధనిపించింది కూర్చున్నవాడల్లా చివాలున లేచి నిల్చుంటూ," వడ్డించకు తాను వచ్చాక ఇద్దరం కలసి తింటాంలే అని గదిలో కెళిపోయాడు

ఒంటిగంట దాటిన తర్వాత ఇంటికి వచ్చింది పద్మావతి చీర మార్చుకొని కాళ్ళు చేతులూ మొహం కడుక్కుని తుడుచుకుంటూ డైనింగ్ రూమ్‌వైపు వెళ్తున్న అన్నపూర్ణమ్మను చూసి 'నేను అన్నం పెట్టుకు తినేస్తానులెండి పిన్నీ మీరు పడుకోండి," అంది

"అయితే నీ మొగుడు కూడా ఇంకా తినలేదు. వాణ్ణి పిలువు అని వరండాలో వాల్చి ఉన్న మంచంమీద పడుకుంది అన్నపూర్ణమ్మ

పద్మావతి గొంతు విన్న పాణి ఆమె పిలవకుండానే డైనింగ్ రూంలో కొచ్చి, టేబిలు ముందు కుర్చీలో కూర్చున్నాడు పాణి

మామూలుగా, అతని చెయ్యి పట్టి, వడ్డించిన పదార్థాలు తాకిస్తూ, ఫలానా కూరా. పచ్చడీ అని చెప్పింది పద్మావతి

అతను 'సినిమా కెళ్ళావా? అనో, లేక నన్ను పిలవకుండా కనీసం నాతో చెప్పకుండా ఎందుకు వెళ్ళావ్ అనో అంటాడనుకుంది పద్మావతి. కాని అతను మౌనంగా భోజనం చేస్తున్నాడు.

అతనూ అనుకుంటున్నాడు ఫలానా సినిమాకు వెళ్ళాననీ, తననెందుకు పిలవలేదో పద్మావతి కారణం వివరి

స్తుందనీను. కాని ఆమె కూడా మౌనం గానే భోజనం చేస్తూంది.

అతను భోజనం ముగించి "చేతి మీద నీళ్ళు పోస్తావా?" అన్నాడు.

అతని చేతిమీద నీళ్ళు పోస్తూ, "నా కోసం వెయిట్ చేస్తూ ఇంతవరకు భోజనం చెయ్యకుండా ఎందుకు కూర్చు న్నారు?" అడిగిందామె

అతను భుజం మీదున్న తువ్వాలు తీసుకుని చేతులు తుడుచుకుంటూ మౌనంగా గబగబా అతని గదిలో కెళ్ళి పోయాడు. ఆమెకు జవాబివ్వకుండానే.

తాను కోరుకున్న మార్పు అతనిలో రావటంతో తృప్తిగా నిట్టూర్చింది పద్మావతి తర్వాత వరసగా నాలుగైదు సినిమాలకు వెళ్ళింది. పాణితో చెప్ప నన్నా లేదు. 'సినిమాకు వెళ్ళి వస్తాను.' అని చెబుతున్న పద్మావతితో. "బాబుని కూడా తీసుకు వెళ్ళు" అని చెప్పేది అన్నపూర్ణమ్మ

వినిపించనట్టు వెళిపోయేది పద్మావతి. అతని మనస్సేమిటో అతను గ్రహించే వరకూ తానిలానే ప్రవర్తించాలి. అను కునేది తాను సినిమాకు వెళ్ళి వచ్చిన రోజున పాణి వదనంలో గాంభీర్యం చాటున అయిష్టత. అసహనం చూస్తోంది. ఒక్కోసారి అతని వదనం కోపంతో కందడం. పెదవు లదరడం చూసి నవ్వుకుంటూంది తాను అతని స్వంతమనే భావన లేనప్పుడు, తనకు అతను పూర్తిగా త్యాగం చేస్తూన్నప్పుడూ అతనిలో ఇలాటి పరిణామం రాదు. తాను కావాలి. కాని దగ్గరకు రాలేదు. వస్తే చొరవ చెయ్యలేదు. ఈ పిరికి తనం పోవాలి ఉత్త మెత్తని మనస్సు కాదు. అవసరమైతే కరకుతనం కూడా ఉండాలి. తనమీద కోపగించుకొని, తనను శాసించే పాణి రూపం చూడాలి అనుకున్న పద్మావతి మరి కాస్త స్వేచ్ఛా స్వాతంత్రం తీసుకుంది. సినిమా షికారూ, స్నేహితుల ఇచ్చకనీ ప్రతి రోజూ బయటికి వెళ్ళి తన ఇష్టమొచ్చి నప్పుడు మళ్ళీ తిరిగి వస్తూంది. అన్న పూర్ణమ్మ సన్నగా విసుక్కుని సణుగు తూంది "ఆడది అలా తిరగడం బాగుండదు ఓసారి మందలించు," అని పాణిని హెచ్చరిస్తూంది

అతనూ మానసికంగా చాలా బాధ పడుతున్నాడు. వ్యాపార విషయాలు తప్ప అస్సలు తనతో మాట్లాడటమే మానేసింది పద్మావతి పైగా ఇంట్లో ఉండ పుంటా ఒక వేళంటూ లేకుండా ఎవరింటికో ఎక్కడికో ప్రతిరోజూ తిరగడం, ఆమె ఈ ప్రవర్తన అస్సలు నచ్చటం లేదతనికి. ఎప్పటికప్పుడే ఆమెను పిలిచి ఏదో అడిగెయ్యాలనీ, తీవ్రంగా మందలించాలనీ, అనుకుంటూనే మౌనంగా ఉండిపోతున్నాడు.

వారం రోజుల్లో వస్తున్నానని శశి వ్రాసిన ఉత్తరం అన్నపూర్ణమ్మకి

పాణికి ఎంతో సంతోషాన్ని కలుగ జేసింది

సాయంత్రం నాలుగు గంటల వేళ. మళ్ళీ ఎక్కడికో ప్రయాణమవుతూన్న పద్మావతితో "ఎక్కడికో వెళ్ళిపోతూ న్నట్టున్నావ్. ఇవ్వాల్టికి ఇంట్లో ఉండు." అంది అన్నపూర్ణమ్మ విసుగ్గా.

"ఏం? ఏదన్నా పనుందా?" అడి గింది పద్మావతి

"నిన్న వెళ్ళి వాళ్ళు వచ్చారు తోట బేరానికి. నువ్వు లేవని పాణి వాళ్ళకేమీ చెప్పలేదు. ఇవ్వాళ రమ్మన్నాను వస్తా రేమో! ఉండు ఎటూ వెళ్ళకు."

"వస్తే ఈ సంవత్సరం తోట అమ్మటంలేదని చెప్పండి." అనేసి "అప్పారావ్! డ్రయివర్ని పిలు ఓసారి" అని అప్పారావుకి చెప్పింది పద్మావతి.

"ఆ మాటేదో నువ్వే ఉండి చెప్పు. ఇప్పుడు పెత్తనమంతా నీదేగా! అయినా అడదానికి అంత నిర్లక్ష్యం పనికిరాదు." అని ఆమె ఇంకేమేమో అనేంతలో ఈ సంభాషణ అంతా వింటూన్న పాణి. "అత్తయ్యా!" అని పిల్చాదు వారింపుగా! ఆమె అతని పిలుపు విని ఆగలేదు సరికదా! "పేనుకి పెత్తన మిస్తే తలంతా డొల్లిందట. అలా తోట అమ్మనంటుందేమిటి? బాగా పూశాయట చెట్లు ఆ కాయంతా ఎవరు తింటారు? అన్నిటికీ అలా ఉరుకోకపోతే, ఎందుకు అమ్మదో అడగరాదూ!" అంది రోషంగా పాణివైపు చూస్తూ అన్నపూర్ణమ్మ.

అవును పద్మావతీ అమ్మేయ్యకపోతే ఆ కాయలన్నీ ఏం చేసుకుంటాం? ఎవరు తింటారు?" నవ్వుతూ ప్రశ్నించాడు పాణి

శశి పిల్లలూ వస్తున్నారు. ఈ సంవత్సరం తోటలో కాసిన కాయంతా పండించి ఆ పళ్ళన్నీ మన వర్కర్సుకి పంచాలని నిర్ణయించుకున్నాను కచ్చితంగా చెప్పింది పద్మావతి.

ముక్కుమీద వేలుంచుకొని ఆశ్చర్యంగా పద్మావతివైపు చూస్తూ, పాణి ఏమంటాడో అని అతని మాటకోసం చెవులు రిక్కించి అతని వైపు చూస్తూంది అన్నపూర్ణమ్మ.

"సరే నీ ఇష్టం" అనేశాడు పాణి.

"మతిలేకపోతేసరి. ఇలాగే అన్ని వ్యవహారాలూ చూస్తుంటే అడుక్కుతిని పోవాలి రెండు వేల రూపాయలిస్తామని బేరాలు వస్తే పంచిపెట్టేస్తుందట పళ్ళు! ఏమోనమ్మా మీ ఇష్టం. ఎలా తగలెట్టుకుంటారో అంటూ అక్కడ నుంచి విసురుగా రుసరుసలాడుతూ వెళిపోయింది అన్నపూర్ణమ్మ

రాజూ కారు సిద్ధంచెయ్. అన్న పద్మావతి మాట విన్నాడు పాణి. ఆమె తనను కూడా రమ్మంటుందని కొన్ని క్షణాలు చూశాడు. కాని ఆమె పంటరిగానే తోటకి వెళిపోయినట్లు తెలుసుకున్న

పాణికి రోషం వచ్చింది. వెంటనే తానూ తోటకు వెళ్ళాలనుకున్నాడు. అప్పారావ్‌ని రిక్షా పిలమని అతని సాయంతో తోటకి చేరుకున్నాడు

పాణిని చూసిన పద్మావతి హృదయం సన్నగా కంపించసాగింది. ఏమంటారిప్పుడు ? అనే భయంతో

పద్మావతి దగ్గరకు పాణిని నడిపించుకు వచ్చిన అప్పారావు "అమ్మగారిక్కడే ఉన్నారు. వెళ్తాను బాబూ" అని చెప్పి వెళ్ళిపోయాడు

"పద్మావతీ!" మృదుగంభీరస్వరంతో పిలిచాడు పాణి

ఆమె మౌనంగా తలవంచింది.

ఆమెనుంచి జవాబు రాకపోవటంతో, అక్కడ మామిడి చెట్టు క్రింద పచ్చికలో మఠం వేసుకు కూర్చుని, "ఏదీ నీ చెయ్యి ఇలా ఇయ్యి" అన్నాడు పాణి, తన కుడి చేతిని ముందుకి చాపుతూ.

అతని చేతిలో తన చేతిని ఉంచింది పద్మావతి

ఆ చేతిని పట్టి చెంపకానించుకుంటూ నా సహనాన్ని పరీక్షిస్తున్నావా ? పద్మావతీ" అన్నాడు పాణి.

"మీ సహనాన్ని పరీక్షించడానికి నేనేమౌతాను మీకు అయినా నానుంచి సహనాన్ని కోల్పోవలసిన అవసరం మీకేముంది ?" అంది పెదవులు బిగబట్టి వచ్చే నవ్వును ఆపుకుంటూ.

నవ్వి, "ఏ మౌతావో నీకు తెలియదూ ! నన్ను ఒంటరిగా వదిలి నువ్వు సినిమాలకూ షికార్లకూ వెళిపోతూంటే సహించలేకపోతున్నాను పద్మావతీ ! మానసికంగా చిత్రవధ అనుభవిస్తున్నాను ఆమె చేతిని ఆప్యాయంగా పెదవులకానించుకుంటూ అన్నాడు పాణి

చెయ్యి వెనక్కి తీసుకొని, హబ్బ, ఈ మాత్రందానికే చిత్రవధ అనుభవిస్తూంటే, నేను మీ ఇంట్లోంచి వెళిపోయి మరొకర్ని పెళ్ళిచేసుకొని అతనితో కాపురం చేస్తూంటే..." అని మరి నవ్వాపుకోలేని పద్మావతి నవ్వేసింది.

సెలయేటి గలగలలా ఆ నవ్వు వినిపిస్తూంటే తేలిగ్గా నవ్వి హాయిగా గుండెలనిండా గాలి పీల్చుకొని నిజమే. అదొక గొప్ప త్యాగమనీ, నిన్ను ఉద్ధరించాలనీ అన్నానేకాని, సహించలేను. అస్సలు అలా జరిగిన పక్షంలో జీవించలేను నువ్వీ ప్రపంచంలో లేవనుకున్న రోజుల సంగతి వేరు. కాని నువ్వు దైవికంగా నా దగ్గరకు రావడం మన పరిచయం స్నేహం మన అనుబంధానికి గట్టి పునాదులేశాయి నా వల నేమన్నా పొరపాటు జరిగి ఉంటే క్షమించి, మామూలుగా ఇదివరకటిలా ఫ్రీగా నవ్వుతూ మాట్లాడు పద్మావతీ !" అన్నాడు.

ఆమె జవాబేమీ ఇవ్వలేదు

"నామీద కోపమా! పద్మావతీ!"

"మీ మీద కోపానికి మీరేంచేశారు?"

"మరి ఎందుకిలా మారిపోయావ్? నేను నీ నుంచి ఏమీ కోరను. ఎప్పటిలా స్నేహితుల్లా ఉందాం ప్లీజ్."

రెండు క్షణాలు అతనివైపు, అతని ముఖకవళికలవైపూ పరిశీలనగా, ఉదాసీనంగా చూసింది పద్మావతి.

"తర్వాత అలా పూలమొక్కల వైపు వెళ్ళి వస్తాను కూచుంటారా?" అడిగింది.

"నన్ను కూడా తీసుకుపో" లేచినిల్చున్నాడతను. అతని చెయ్యి పట్టి నడిపించుకు తీసుకొని వెళ్ళి తోట మధ్య ఇంటి గుమ్మం మీద కూచోమని పాణికి చెప్పి తాను పూల మొక్కల మధ్యకు వెళ్ళిపోయింది పద్మావతి.

మరి కొంచెంసేపటికి కొబ్బరి నీళ్ళ గ్లాసుతో తెచ్చి ఇచ్చాడు మాలి పాణికి

"ఇవేమిటి? ఎవరిమ్మన్నారు?" అడిగాడతను "

"అమ్మగారు" మాలి జవాబు

'మొక్కలన్నీ ఎండిపోతున్నాయంట. పూయడంలేద' నీళ్ళు పోయడం లేదని తిడతన్నారండి నన్ను.

చిన్నగా నవ్వి "తిట్టకుండా జాగ్రత్త పడు మరి!" అంటూ కొబ్బరి నీళ్ళు తాగి గాసతని చేతికిచ్చేశాడు పాణి

"నెల్లైగారొత్తారంట తోట అమ్మనంటున్నారు ఏటిసేసుకుంటాం బాబూ!

ఈ శాపంతా!" అన్నాడు మాలి అదోలా నవ్వుతూ

"తన ఇష్టం వచ్చినట్టు చెయ్యనీ!"

ఆ యమ్మ వశమైపోయాడు మతి పోయినట్టుంది అనుకుంటూ వెళ్ళిపోయాడతను

పావుగంట తర్వాత మళ్ళీ పాణి దగ్గరకు వచ్చింది పద్మావతి

"అవ్వాళ కూర్చున్నాం నేరేడు చెట్టు క్రింద అన్నావు అక్కడ కూర్చుని మాట్లాడుకుందాం పద్మావతీ!" అన్నాడు పాణి

అతని చెయ్యి అందుకుని అతను కోరినట్టుగా గెడ్డ పక్క నేరేడు చెట్టు క్రిందికి తీసుకొని వెళ్ళి కూర్చోండి మీరు కోరిన ప్రదేశమిదే!'' అంది పద్మావతి

తాటాకుల చాప తెచ్చి పరిచాడు మాలి

దానిమీద తలకింద చెయ్యుంచుకొని వత్తిగిలి పడుకున్నాడు పాణి

అతని సమీపంలో దిగువున గొంతుగా కాళ్ళకు చేతులు చుట్టి మోకాళ్ళపై గెడ్డం ఆన్చి, పాణివైపే చూస్తూ కూర్చుంది పద్మావతి

కొన్ని క్షణాలు మౌనంగా దొర్లిపోయాయ్

"చీకటిపడటానికి ఇంకా ఎంత టైము పడుతుందంటావ్?" అడిగాడు పాణి

సుమారు ఇంకో అరగంట కాలం పట్టవచ్చు

"ఏమన్నా మాట్లాడు పద్మావతీ!"

"ఏమున్నాయి మాటలు నవ్వబోయింది

రెండు క్షణాల తర్వాత చిన్నగా దగ్గి గొంతు సవరించుకొని "మన పెళ్ళి తర్వాత అవాళ నా చెయ్యి విడిపించుకొని పారిపోయిన తర్వాత ఎప్పుడూ నాగురించి ఆలోచించనే లేదా పద్మావతీ! నన్ను ఓసారి చూడాలనీ నా గురించి తెలుసుకోవాలనీ కూడా అనుకోలేదా?' అన్నాడు నెమ్మదిగా

"ఎందుకు ఆలోచించను?"

"ఏమని ఆలోచించేదానవు? ఎప్పుడూ మా ఇంటికి రావాలనుకోలేదా?"

ఆమె వదనం గంభీరంగా విషాదంగా మారిపోయింది గతం అతను ప్రశ్నించడంతోనే, వెంటనే ఏమీ చెప్పలేకపోయింది మౌనంగా ఉండిపోయింది

ఆమె మౌనాన్ని సహించలేనట్టు ఆత్రతగా "చెప్పు పద్మావతీ నాకు వినాలని చాలా కుతూహలంగా ఉంది" అన్నాడు పాణి

"ప్చ్ ఏముందిలెండి వినటానికి! నేనొక అనాధలానే బ్రతికాను నేను తల్లిదండ్రుల మధ్య గృహ వాతావరణంలో జీవితం గడపలేదు ఫ్రెండ్సింటికి వెళితే వారిలా నాకు అమ్మా, నాన్నా వారికొక ఇల్లూ, వారి మధ్య నేను

ప్రతకడంలేదు కదా అని నామీద నాకే జాలివేసేది. అని ఆగింది పద్మావతి.

కొన్ని క్షణాలు ఆ తర్వాత ఆమె చెప్పబోయే మాటలకోసం చెవులు రిక్కించిన పాణి. అంతేనా ?" అన్నాడు నవ్వుతూ

"నేనూ బోర్డింగ్ స్కూల్లోనే కదా ఉండేదానను ? ఏమిటో మా నాన్న స్కూలుకి వచ్చి ఎవ్వరూ వినకుండా నెమ్మదిగా, చెట్ల చాటున ఏకాంతస్థలానికి తీసుకుపోయి నీకు పెళ్ళి చేస్తున్నానమ్మా ! అనేసరికి కంగారుపడి పోయాను అస్సలప్పటికి 'పెళ్లి' అనే ఊహేలేదు. తర్వాత ఇంత తొందరగా చెయ్యవద్దని పెద్దాన్ని అయాక చెయ్యండని బ్రతిమిలాడి ఏడ్చాను. ఆయన నన్ను బ్రతిమిలాడి అనునయించడం మొదలుపెట్టారు. చివరకు తన నిర్ణయం మారదన్నారు. ఆ అబ్బాయి ఎలా ఉంటాడు ? ఏమిటి చదివాడు ? లాటి వివరాలు తెలుసుకోవాలనిపించింది నాకు. కాని ఏమీ బిడియంగా అడగా లేకపోయానాయన్ని సెలవు తీసుకొని నాన్న వెనుక ప్రయాణమయ్యాను. నాకు బోలెడు పట్టు పరికిణీలూ నగలూ కొన్నారు నాన్న ఆయన నా అదృష్టాన్ని మెచ్చుకుంటూ, తన మిత్రులకు మీ వివరాలు చెబుతూంటే విని నేనూ గర్వపడ్డాను" ఆగింది.

"ప్చ్ పాపం తర్వాత?'' అన్నాడు పాణి లేచి కూచుంటూ.

"ఏం ? అంత ఇంట్రెస్టుగా ఉందా ? లేచి కూర్చున్నారు ? పడుకుని వినే కథ కాదా ?" నవ్వబోయింది.

నవ్వి "చెప్పు" అన్నాడు పాణి.

పెళ్లయిన తర్వాత నిజంగా ఆ స్కూల్లో చదవాలనిపించలేదు నాకు. ఆ పెళ్ళి సీనంతా ఒక మధురమైన కలగా నాకు మిగిల్చి మీరూ, మీ నాన్నగారూ వెళ్ళిపోయారు. నాకేమీ అప్పటికి తెలియకపోయినా, చిన్నదాన్నయినా ఎంత బాధపడ్డానో తెలుసా ! ఏడుపు వచ్చేసింది. పెళ్ళయాక మీరు మీ ఇంటికి నన్ను తీసుకువెళ్తారనుకున్నాను మీకొక అత్తయ్యా, చెల్లెలూ ఉన్నారని తెలుసుకున్నానుగా! ఇహ మీ ఇంట్లోనె మీ అందరి దగ్గరా ఉండిపోవాలనుకుని మురిసిపోయాను. నేనూ అందరిలా ఉంటాననుకున్నాను. కాని మీరు నన్ను కొంచమైనా అభిమానం లేకుండా వదిలేసి వెళ్ళిపోయారు.

"అయితే అవన్నీ గుర్తుచేసుకొని నామీద కోపం పెంచుకుని అన్నమాట, నువ్వు ఇలా మారిపోయింది.'' నవ్వాడు గలగలా.

(సశేషం)

Printed and Published by A. Chandra Sekar Rao at 5-9-88, Public Garden Road, Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press, Public Garden Road, Hyderabad-500 001. Editor : A. SUDHAKARA RAO